





# ఉప వేదాలు

## సంగీత కళ

## సంగీత సాంప్రదాయ ప్రదర్శిని- 1 నుంచి 4





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061771,72,73,74

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: In

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author
Year to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంగీత సంప్రదాయ ప్రదర్శిని

శ్రీ గురుగుహ ముద్రాంకిత కృతి వక్తలైన
ముద్దుస్వామి దీక్షితులవారిపుత్రులును,
ఎట్టయపురం సంస్థానం
సంగీత సాహిత్య విద్వాంసులు నైన
బ్రహ్మశ్రీ సుబ్బరామదీక్షితుల వారిచే
రచియింపబడినది.

ద్వితీయ ముద్రణ

సంపాదకులు : ఆచార్య నోరి నాగభూషణం

పర్యవేక్షకులు : గానకళాప్రపూర్ణ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురణ

# తొలిపలుకు

నృత్య, సంగీత, నాటకోత్సవాలను నిర్వహించటం, ఆ యా కళలలో శిక్షణాలయాలకు సాంస్కృతిక సంస్థలకు, నిస్సహాయస్థితిలో గల వృద్ధకళాకారులకు ఆర్థికసహాయము చేయటం, మరుగున పడి పోతున్న మన సంప్రదాయ, జానపద కళారూపాల పునర్వికాసానికి కృషిచేయటం మున్నగు కార్యక్రమాలతోపాటు ఆ యా రంగాలలో పరిశోధన చేయించి, గ్రంథాలు ప్రచురించే కార్యక్రమాన్ని కూడా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ చేపట్టింది. ఈ పథకం క్రింద సంస్కృతంలోని ప్రామాణిక సంగీత, నృత్యశాస్త్ర గ్రంథాలను అనువదింపజేసి ప్రచురిస్తున్నాము. ఇంతవరకు "సంగీతరత్నాకరం" మొదటి భాగం, "నృత్తరత్నావళి" ప్రచురించాము.

ప్రాచీన సంస్కృత గ్రంథాల అనువాదాలు చేపట్టటమేకాక తెలుగునాట సంగీత, నృత్య, నాటక కళా వికాసాలను తెలియపరిచే స్వతంత్రగ్రంథాలను ప్రచురించాలని కూడా అకాడమీ సంకల్పించింది. మొదట నాటక కళాభివృద్ధికి దోహదకారులైన తెలుగు నాటకకర్తలను గురించి గ్రంథాలను ప్రచురించాలని నిర్ణయించి, నాటక కర్తలుగా చిలకమర్తి, తిరుపతి వేంకట కవులు గురించిన గ్రంథాలను ప్రథమంగా వెలువరించాము. ప్రసిద్ధులైన మిగతా నాటక కర్తలను గురించి, సంగీత, నృత్య కళాకోవిదుల గురించి కూడా గ్రంథాలు ప్రచురించ తలపెట్టాము.

ఇంతేకాక ప్రస్తుతం ప్రతులు లభించని "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" వంటి అమూల్య గ్రంథాలను పునర్ముద్రించాలని కూడా అకాడమీ నిర్ణయించింది. ఐదు సంవత్సరాలనాడు చేపట్టిన ఈ గ్రంథ ప్రచురణ పథకం నేటికి సఫలమై, తొలి సంపుటము వెలువడుతున్నది. ఇది అత్యంత వ్యయంతో కూడిన కార్యము. ఈ ప్రచురణంలో ఇంత విలంబనానికి ధనాభావమే కారణము. సంగీత సంప్రదాయ ప్రదర్శిని మిగిలిన మూడు సంపుటాలు, ప్రథమాభ్యాస పుస్తకము త్వరలో వెలువరించగలమని ఆశిస్తున్నాము.

పునర్ముద్రణకు "సంగీత సంప్రదాయ ప్రదర్శిని" వ్రాతప్రతిని సిద్ధపరచిన ఆచార్య నోరి నాగభూషణంగారికి, మేము కోరినంతనే వ్రాత ప్రతిని, ఎంతో శ్రమకోర్చి, పరిశీలించి సహాయపడిన గానకళాప్రపూర్ణ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి ధన్యవాదములు తెలియ పరుస్తున్నాము.

కె. ఆర్. పరమహంస
స్పెషల్ ఆఫీసర్
ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ

# ధన్యవాదలేశము

కర్ణాటకసంగీతపు లక్ష్యలక్షణములను ఎంతో విపులముగా విశదముగాచెప్పి కూర్చిన మహాగ్రంథము ఈ సంగీత సంప్రదాయ ప్రదర్శిని. ఇప్పటి మన సంగీతకళకు ఇదిగొప్పనిధి. దీనివంటిది నాటికి నేటికి ఇంకొకటి లేదు. రహస్యముగా రక్షింపబడుచుండిన యిందలి విషయములను వెలికితీయించిన ఎ. ఎం. చిన్నసామి మొదలియారుది. వెలికితీసి చక్కగా పర్పఱిచి గమకాదుల నిండుగుర్తులతో దీనిని తెలుగుభాషలో లిపితో సిద్ధపఱిచిన సుబ్బరామదీక్షితులది. అచ్చుపు తమిళ రాష్ట్రమున దీనినింత చక్కగా ఆకాలమున 1904 వ సంవత్సరము ప్రాంతమున అచ్చువేయించి ప్రకటించి యెందఱో సంగీతవిద్వాంసులకు రసికులకు బహుమానముగా ఇచ్చుచుండిన ఎట్టయపుర మహారాజులది-ఈ మూడు ప్రయత్నములలో దేనికంటె ఏది యెక్కువ శ్లాఘాపాత్రమో చెప్పలేము. ముగ్గురును కర్ణాటసంగీత రసికులమూర్తీభవించిన భాగ్యము. ఈ గ్రంథమునకు పీఠము వంటిది ఈ గ్రంథకర్తయే రచించిన 'ప్రథమాభ్యాస పుస్తకము' గూడ ఇట్లే చాలా విలువగలది.

ఈ రెండు పుస్తకముల ప్రతులు ప్రాయశః ముగిసిపోయి ఎన్నో యేండ్లయినవి. సంస్థానములు స్వరూపమును పోగొట్టుకొన్న అవాంతర సమయమున ఎట్టయపురము నగరులో మిగిలియుండిన కొన్ని ప్రతులను ఎవరెవరో సంగ్రహించుకొని దండుచేహారము సాగించుచుండిరి. ప్రాతమనకు పల్చని కాగితములమీద ముద్రితములైనవి గనుక ఆ ప్రతులు గూడ తాకితేచాలును విరిగిపోవు జీర్ణస్థితికి లోనైనవి.

ఈ స్థితిలో దీని పునర్ముద్రణము చేయగల పుణ్యాత్ములకై కలలుగనుచుండిన పలువురిలో నేనొక్కడను. ఏదైనను గొప్ప సంస్థ యొకటి చేపట్టి, నిర్వహింపవలసిన పని యిది. వ్యయ ప్రయాసములు ఎక్కువ. కేంద్రీయసాహిత్య అకాడమీ తెలుగు ఉపసమితిలో నేనున్నప్పుడు ఈ పని నెరవేర్పుడని ప్రార్థించితిని. వారంగీకరించి సూచింపగా కేంద్ర సంగీత నాటక అకాడమీ వారు సమ్మతించి ఈ గ్రంథము తెలుగుమూలమును, తమిళ హిందీ భాషలలో దీని పరివర్తనమును గూడ ప్రకటింప నిర్ణయించిరి. అందు హిందీ అనువాదమేస్థితిలో నున్నదో తెలియదు గాని తమిళ తర్జుమా మాత్రము క్రమసంచికలుగా సాగుచున్నది. తెలుగుమూలమును ముద్రించు ప్రయత్నము ఇంతకాలమైనను రూపుగొనకుండెను.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఈమహాకార్యము శ్రద్ధాభిమానములతో నెరవేర్పబూనుకొన్నది. వ్యయము మాట అట్లుండగా అచ్చుకై యథామూలముగా దీని వ్రాతప్రతిని సిద్ధపరచుట సామాన్యకార్యముగాదు. ఎంతో ఓర్పు, శ్రద్ధ, వైదుష్యము, వ్యుత్పత్తి, ఉత్సాహము కలవారుగాని దానిని నెరవేర్పలేరు. ఈ గుణములు నిండిన శ్రీ నోరి నాగ భూషణంగారు ఈ బరువునెత్తికొని నెరవేర్చుటను ఎంత మెచ్చుకొన్నను చాలదు.

అకాడమీ అప్పటి అధ్యక్షులు శ్రీ పసల సూర్యచంద్రరావుగారి సహృదయత, కార్య శ్రద్ధ, రసికత, కళాభిమానము, దీర్ఘదర్శిత్వము మొదలగు గుణములు జగమెరిగినవి. ఈ మహా కార్యమునకు ఆయన సూత్రధారత్వము లభించుటగూడ వరప్రసాదమువంటిది.

'సిద్ధమైన దీని వ్రాతప్రతి నీవొకసారి పరికించి యిమ్మని' శ్రీ సూర్యచంద్రరావుగారు నాకు నియమించిరి. యథాశక్తిగా ఆపనిచేసితిని. ఈ అవకాశము నాకు కలిగించిన శ్రీ రావు గారి దయకు నా ధన్యవాదాంజలి.

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# విషయసూచిక

# వాగ్గేయకార చరిత్రము

## శార్ఙ్గదేవులు

ఈ శార్ఙ్గదేవుడు కాశ్మీరదేశస్థుడు, వర్షగణ ఋషిగోత్రమందు జనించిన భాస్కరునిపౌత్రుడు. సొడ్డలదేవుని పుత్రుడు. ఇతఁడు యాదవవంశస్థుడును, "దౌలతాబాద్" అనెడి దేవగిరి నగరమున శకము 1132, క్రీస్తుశకము 1210 మొదలుకొని శకము 1169, క్రీస్తుశకము 1247 సంవత్సరము వరకు రాచరికము జేసినవాఁడునైన సిమ్హణరాజుకాలములో నుండినవాఁడు. సంస్కృతమందును సంగీతమందును అపారపాండిత్యముగల ఈ శార్ఙ్గదేవుడు "అధ్యాత్మవివేకము" అనెడి యొక వేదాంతగ్రంథముఁ జేసియున్నాడు. ఇతనిచేఁ జేయబడిన సంగీతరత్నాకరములో "నిశ్శంకుడు" అనెడి బిరుదు వహించియున్నట్లును, భరత మతంగ కీర్తిధర కోహల కంబళ అశ్వతర ఆంజనేయ అభినవగుప్త సోమేశ్వరులు మొదలయినవారల మతముల నిరూపించియున్నట్లును జెప్పియున్నాడు. మొదటిది స్వరగతాధ్యాయము; రెండవది రాగవివేకాధ్యాయము; మూడవది ప్రకీర్ణకాధ్యాయము; నాలుగవది ప్రబంధాధ్యాయము; ఐదవది తాళాధ్యాయము; ఆఱవది వాద్యాధ్యాయము; ఏడవది నృత్యాధ్యాయము-ఇటుల ఏడధ్యాయములుగా జెప్పబడియున్నది.

ఈ సంగీత రత్నాకరగ్రంథము ఏడు వ్యాఖ్యానములతోనున్నది. వానిలో సిమ్హళ శార్ఙ్గదేవ కుంభకర్ణ నరేంద్ర కల్లినాథులు జేసిన సంస్కృత వ్యాఖ్యానములు నాలుగు, గంగారాముడు జేసిన హిందూస్థాని వ్యాఖ్యానమొకటి, ఆంధ్రభాషావ్యాఖ్యానములు రెంటిలో నొకటి హంసభూపాలుడు జేసినట్లు దోచుచున్నది. వీనిలో కల్లినాథులు జేసిన వ్యాఖ్యానము బహుదేశప్రసిద్ధిగానున్నది.

ఈ రత్నాకరమునఁ జెప్పఁబడిన కొన్నిభాగములు ఈకాలమునఁగల లక్ష్యలక్షణములకు సమన్వయముగాకనున్నవియని రామామాత్యులును వెంకటమఖియును జెప్పియున్నారు. వాడుకయందును అటులనేయున్నవి అని సంప్రదాయజ్ఞులు నుడువుచున్నారు.

## అహోబలులు

ఈ వైదీకబ్రాహ్మణుఁడైన పండితుఁడు "సంగీతపారిజాతము" అను గ్రంథమును సంగీతరత్నాకరమతము ఆంజనేయమతముల ననుసరించి జెప్పియున్నాడు. ఈగ్రంథములోగల

కొన్ని లక్షణ లక్ష్యములు యిప్పటి వాడుక ననుసరించియున్నవి. ఈ అహోబల పండితుఁడు అహోబలప్రాంత్యమున రమారమి నాలుగువందలకాలమునకు మునుపుండిన వాఁడుగా దోచుచున్నది.

## రా మా మా త్యు లు

ఈయన తోడరమల్ల కులమునం దుద్భవించిన నియోగిబ్రాహ్మణుడైన తిమ్మామాత్యుని కుమారుఁడు. ఆంధ్రభోజుడని ప్రఖ్యాతివహించి యనేక దేశాధిపతులఁజయించి విద్యానగరము అను విజయనగర సంస్థానమును పాలించిన కృష్ణదేవరాయల కుమారిని వివాహము జేసికొని కృష్ణ దేవరాయలకు వెనుక విజయనగరరాజ్యమునేలిన రామదేవరాయలు తన సహోదరుడైన వెంకటాద్రిరాజుతో సభలో నీరామామాత్యునిచే జేయఁబడిన ఏలా, రాగకదంబము, గద్యప్రబంధము, పంచతాళేశ్వరము, స్వరాంకము, శ్రీరంగవిలాసము మొదలైన ప్రబంధములను శ్రావ్యముగా వినుకొనియుండునప్పుడు వెంకటాద్రిరాయలు అభినవ భరతాచార్యుడని బిరుదువహించిన రామామాత్యునిఁజూచి

శ్లో. సంగీతశాస్త్రే బహుధా విరోధా
స్సంత్యేవ లక్ష్యేషుచ లక్షణేషు,
సర్వం సమీకృత్య సరామమంత్రీ
తనోతు శాస్త్రం వచసా తవేతి.

అని సంగీతశాస్త్రమందు లక్ష్యలక్షణములలో ననేకవిరోధములు గనబడుచున్నవి గావున నన్నియు సమంజసముజేసి యొకసంగీతశాస్త్రముఁ జేయవలెనని చెప్పినతోడనే రామదేవరాయలు తదనుగుణంబుగా కర్పూరతాంబూలము మొదలయిన యనేక బహుమానము లొసంగగా రామామాత్యుడుస్వరమేళకళానిధిని ఏడుప్రకరణములుగా రామదేవరాయాంకితముగానే రచించి వినిపించెను.

శ్లో. శాకేనేత్ర ధరాధరాబ్ధి ధరణీగణ్యేథ సాధారణే,
వర్షే శ్రావణమాసి నిర్మలతరే పక్షే దశమ్యాంతిథౌ,
రామామాత్య వినిర్మితస్స్వరతతే ర్నిర్మథ్య రత్నాకరం.
సోయం మేళకళానిధిర్మతిమతా మాకల్ప మాకల్పతాం.

ఇతడు స్వరమేళకళానిధి జేసినకాలము మీదఁజూపించిన శ్లోకముచేత శాలివాహన శకము 1472. క్రీస్తుశకము 1550 అని తెలియవచ్చుచున్నది. మీదఁజూపించిన యీతని ప్రబంధములలో నొకటైనను యీకాలములో నగుపడుటలేదు,

## కల్లినాథులు

ఇతఁడు తోడరమల్లకులమందు జనించిన లక్ష్మణాచార్యుని కుమారుడు. అభినవ భరతాచార్యరాయడనుఁ బిరుదువహించిన చతురకల్లినాథుడు. విద్యానగరము నేలిన ఇమ్మడి దేవరాయల ఆస్థానపండితుఁడు. ఇతఁడు శాలివాహన శకము 1475, క్రిస్తుశకము 1553 లో సంగీతరత్నాకరమునకు కలానిధి అను వ్యాఖ్యానముఁ జేసినవాఁడు. ఈ వ్యాఖ్యానము అన్ని దేశములందును ప్రసిద్ధినొందుకొనియున్నది.

## గోవిందదీక్షితులు

విద్యానగరము అను విజయనగరము నేలిన రాయల వంశస్థులవలన రాచరికమును పొంది శకాబ్దము 1452, క్రి. శ. 1530 మొదలుకొని శకాబ్దము 1592, క్రి. శ. 1670 వరకు తంజావూరు సంస్థానమును మిక్కిలి ప్రబలముగా పరిపాలించుకొనివచ్చిన నాయక మహారాజవంశములో మొదటిరాజయిన చేవప్పనాయక మహారాజు శకాబ్దము 1452, క్రి. శ. 1530 మొదలుకొని శకాబ్దము 1494, క్రి. శ. 1572 వరకు చోళమండలమును నీతిదప్పక పరిపాలించుకొనివచ్చెను. ఈవివరము తంజావూరి రైల్వేస్టేషనుకు డాసిన సంసప్పిరు మసీదులోనుండు నొక రాతికంబము నందు మసీదుకు యేడువేలినేల దానమిచ్చినదని వ్రాసియున్న దానశాసనమువలనఁ దెలియ వచ్చుచున్నది.

ఈ చేవప్పనాయని కుమారుఁడు అచ్యుతప్పనాయకమహారాజు, కర్ణాటక స్మార్త బ్రాహ్మణుఁడును, అశ్వలాయన సూత్రుడును వాసిష్ఠగోత్రోద్భవుఁడును, గాయత్రీ మంత్రోపాస్తిచే సావిత్రీదేవి ప్రసన్నమునొందిన మహానుభావుఁడును, సకలశాస్త్రపారంగతుఁడునైన గోవిందదీక్షితులను మంత్రిగాఁగైకొని శకము 1499, క్రి. శ. 1577 మొదలు శకము 1536, క్రి. శ. 1614 వరకు చోళమండలము నేలెను. స్మృతిలోఁజెప్పినట్లు ఉత్తమశ్రోత్రియులకు ఉభయకావేరీతీరములందుగల పుణ్యక్షేత్రములలో ననేకదానములును, అనేకభూసుర సురాలయములకుఁ బహుసర్వమాన్యములును పంచనదక్షేత్రము మొదలు మాయూరమువరకుఁగల కావేరీ తీరములందు సంధ్యామంటపములతో మెట్లును, సేయునట్లు జేసినదిఁగాక తనబుద్ధిబలముచే వృద్ధాచలము మొదలు రామసేతువరకుఁగల భూమిని (అచ్యుతనాయక మహా) రాజుచే పరిపాలించునట్లును జేసెను. ఈతని యనుమతిచే పంచనదక్షేత్ర మాహాత్మ్యమను స్థలపురాణమును శకము

అప్పయ్యదీక్షితులవారి సహోదరుడైన ఆచ్చాదీక్షితుల పౌత్రుడైన నీలకంఠదీక్షితులు వెంకటేశ్వరదీక్షితుల (వెంకటమఖి) యొక్క శిష్యుడని తన గంగావతరణ కావ్యమందు జెప్పి యున్నారు.

శ్లో. శ్రీ కంఠచరణాసక్త శ్శ్రీమానప్పయ దీక్షితః,
విధిత్రయీ యదాశిష్టా నాన్యత్రలభతేగతిం,
తత్సమానప్రభావస్య తదనంతర జన్మనః,
ఆసీదాచ్చాదీక్షితస్య పుత్రోనారాయణాధ్వరీ,
జయంతి తనయాస్తస్య పంచసౌభ్రాత్రశాలినః,

* * * *

తేషామహం ద్వితీయోస్మి భూమీదేవీ తనూభవాం,
నీలకంఠ ఇతిఖ్యాతిం నీతశ్శంభోః ప్రసాదతః,
వార్తికాభరణగ్రంథ నిర్మాణవ్యక్త నైపుణః,
శ్రీ వేంకటేశ్వరమఖి శిష్యే మయ్యనుకంపతే,
కుర్వతీ శ్రవణే వాణీ కోమళాంయస్యసాహితీం,
కర్ణపూర శిరీషేపి కాఠిన్యమివ పశ్యతి.
భాన్తి శిష్యాః పురోయస్య పాణివిన్యస్త పుస్తకాః,
తత్సూక్తి జాహ్నవీపూర త్రాసేనేవధృతప్లవాః.

నీలకంఠదీక్షితులు నీలకంఠవిజయము అను గ్రంథము జేసినకాలము శకాబ్దము 1560, క్రీ. శ. 1638,

రఘునాథభూపాలునికి వెనుక నతని కుమారుడైన విజయరాఘవభూపాలుడు సకల విద్యాపారంగతుడై చోళమండలము నేలెను.

ఆకాలమున వీణ శ్రుతి స్వర మేళ రాగ ఆలాప ఠాయ గీత ప్రబంధ తాళములనెడు పది ప్రకరణములతో గూడిన "చతుర్దండిప్రకాశిక" యను సంగీత లక్షణ గ్రంథమును విజయరాఘవ భూపాలుని ప్రేరణవలన వెంకటమఖి రచించెను. ఈ వెంకటమఖియే రాగాంగ ఉపాంగ భాషాంగ రాగములకు శ్లోకరూపముగా లక్షణములును, గీతరూపముగా లక్ష్యములును జెప్పియున్నారు. లక్ష్యములైన ప్రతిగీతమందునుగల ధాతువుల చమత్కారమును, శుద్ధ వికృత స్వరములివియని దెలుసుకొనుటకుగల సంకేతాక్షరములును, చక్రము మేళము లివియని యెఱుగుటకైగల సంకేతములును రాగాంగరాగగీతమాతువులం దమర్చియున్న చమత్కారమును యీ పుస్తకమందుగల రాగాంగ ఉపాంగ భాషాంగ రాగగీతముల గమనించి జూచితే స్పష్టమగును.

విజయరాఘవ భూపాలునిచే క్రీస్తుశకము 1660 లో నాగపట్టణమును డచ్చివారల కీయబడినట్లు శాసనములు గనుబడుచున్నవి. విజయరాఘవరాజును వెంకటమఖియును సమ కాలీయులే. ఈయన విడిగా గీతములును, ప్రబంధములును జెప్పియున్నారు.

ఈ వెంకటమఖి శ్రీ జయదేవులు జేసిన (అష్టపది) గీత గోవిందమువలె శ్రీ త్యాగ రాజ విషయమై యిరువదినాలుగు అష్టపదులు జేసినట్లు తెలియవచ్చుచున్నది. ఈయన సేతు యాత్రబోవునప్పుడు చోరబాధాపీడితులై లలితరాగమున "అరెనిబిడకంటక దుష్ప్రవేశ" అను గీతమును పాడినతోడనే శ్రీరామలక్ష్మణులు కోదండపాణులై వచ్చి చోరబాధల దీర్చినారట. ఈ గీతము మాయామాళవగౌళ ఉపాంగరాగవరుసలో జూడస్పష్టమగును. ఒకానొకప్పుడు విజయరాఘవభూపాలుడు తనదేశస్థులందరును శంఖచక్రముద్రాంకితులై యుండవలెనని ఆజ్ఞాపిం చెనట. అప్పుడు వెంకటమఖి మధ్యార్జునక్షేత్రమున వెలయు మహాలింగమూర్తిని "శంఖచక్రాంక నత్యాచరేరే" అని రీతిగౌళలో నొక గీతమునుపాడి ప్రార్థించెనట. తోడనే రాజు ఉదరబాధచే పీడితుడై వేంకటమఖిని ప్రార్థించి తనదేశస్థులు వారివారి మతములోనే యుండవలెనని యాజ్ఞా పించినమాత్రమున తన ఉదరబాధతీరి సౌఖ్యముగానుండెనట. ఇట్లు వెంకటమఖి మహి మలు పెక్కులుగలవు.

కొన్ని గీతములలో "ముద్దువెంకటమఖి" "వెంకటవైద్యనాథుడు" అను ముద్రలు గనుబడుచున్నవి. వారలు ఈ వెంకటమఖియొక్క డాసిన వంశస్థులనితోచుచున్నది.

తంజావూరు ఆంధ్రమహారాష్ట్ర రాజుల కాలనిర్ణయము తంజావూరు గవర్నమెంటు నార్మల్ స్కూలు ద్రావిడ పండితులు బ్రహ్మశ్రీ కుప్పుస్వామి శాస్త్రిలచే దెలిసెను.

## గోవిందామాత్యులు

ఇతడు ఆరువేల నియోగిబ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడు. కౌండిన్య గోత్రుడు. ఓబయామాత్యుని పుత్రుడు. సంగీతశాస్త్రమును శ్రీరామచంద్రాంకితముగా ఆంధ్రభాషలో పద్యకావ్యముగా రచించెను. ఈ గ్రంథము కొన్నిభాగములందు శార్ఙ్గదేవుని సంగీతరత్నాకరము ననుసరించియు, మేళము, రాగములు రామామాత్యుల స్వరమేళకళానిధిని యనుసరించియు జెప్పియున్నాడు. ఇతడు రామామాత్యునికి వెనుకటివాడును, వెంకటమఖికి ముందటి వాడనియు దోచుచున్నది.

## పురందరవిఠలదాసులు

ఇతఁడు కర్ణాటక బ్రాహ్మణుడు. మధ్వమతస్థుడు. కర్ణాటకభాషలో గొప్పపండితుడు. భక్తాగ్రేసరుడు. ఇతడు మొట్టమొదట పూనాలో సాహుకారియై కోటీశ్వరుడుగానుండి పాండు

రంగ విఠలుని భక్త్యాతిశయమువలన విరక్తికలిగి మహాభక్తుడై సంగీతసాహిత్యములలో మిక్కిలి ప్రజ్ఞగలవాడై యొక్కొక్క సందర్భమందును చేసిన కీర్తనములచే శ్రీ పాండురంగవిఠలుని ప్రసన్నతను జెందినవాడై యుండెను. ఇతని యద్భుతచరిత్రములు నెవరికిని వ్రాయనలవిగాదు. ఇప్పటికిని వాడుకలోగల సరళి, జంట వరుసలు, అలంకారములు, పిళ్ళారిగీతములు ఇవి యీమహానుభావుని వలన నేర్పడినవిగా నున్నవి. ఆళ్వారాదులచే జేయబడిన తిరువాయ్ మొఴి అని ద్రావిడ దివ్యప్రబంధమును శ్రీవైష్ణవ బ్రాహ్మణులు సన్నిధులందు ఎటులసేవింపుచున్నారో అటులనే మధ్వమత మఠాధిపతులు వారి వారి యాస్థానదేవతా సన్నిధులందు ఈపురందర దాసుల వారి కీర్తనములనుపాడి కొనియాడునట్లేర్పరచియుండుట నేటికిని జూడవచ్చును. ఇతని వలన జూడబడిన* సూళాదులు పెక్కులుగలవు. ఈతని కీర్తనములు వేదాంతవిషయముగా ననేకములున్నవి. ఈతని కీర్తనములు ఇన్నియున్నవని చెప్పుటకసాధ్యము. ఈపురందర విఠల దాసులు అహోబలుని కాలమునకు మునుపే యుండవచ్చును. ఈతనిసంగీతసాహిత్య ప్రబంధ ధోరణి యీపుస్తకములోగల సూళాదులచే స్పష్టమగును.

## రామదాసులు

ఇతడు నియోగిబ్రాహ్మణుడు. కంచర్లకులోద్భవుడు. గోపనామాత్యకుమారుడు. సంగీతసాహిత్యనిపుణుడు. ఇతడు భద్రాచలముతాలూకా తహసీలు గానుండి సర్కారు సొమ్ములంతనెత్తి భద్రాచల శ్రీరామభద్రాలయ జీర్ణోద్ధారణము జేసినదిగాక భాగవతులైన బ్రాహ్మణులకు తృప్తిగా ప్రతిదినమును భోజనములు పెట్టించుకొని శ్రీరాములవారి విషయమై యనేక కీర్తనములుజేసి భాగవతులతో నెల్లప్పుడును భజనచేసుకొని తన్ను మరచియుండెనట. ఇదితెలిసి నవాబు ఇతని చెరసాలలోబెట్టి పదిరెండుసంవత్సరములు నిర్బంధపరచినాడట. ఆ సమయమందు నెడతెగక రాములపై కీర్తనములుజేసి భజించుకొని యుండెనట. కరుణాసముద్రుడైన రామభద్రుడు కనికరమున లక్ష్మణునితో బంట్రౌతుల వేషముదాల్చి యర్ధరాత్రి సమయమున వచ్చి నిద్రబోయ్యేడు నవాబునులేపి చెల్లవలసిన పైకముల జెల్లించి యంతర్థానమయ్యేనట. ఈ వివరములు రామదాసుల చరిత్రమువలన దెలియనగును. తెనుగున నితని కీర్తనములనేకములు గలవు.

## తాళపాకము చిన్నయ

ఇతడు తెనుగు బ్రాహ్మణుడు. వెంకటాచలపతి భక్తుడు. తిరుపతిలో నుండినవాడు. వెంకటరమణ విషయమై భాగవత సంప్రదాయముగా వాడుకలోగల ఉత్సవపద్ధతి నేర్పఱచిన

---

* రచించు అనుటకు "చూచు" అని వాడుట తమిళ సంప్రదాయము. (రా. అ)

పుణ్యపురుషుడు. దానిలో తోడయము, మంగళము, శరణు, హెచ్చరిక, కీర్తనములు, ధూప దీపాలంకార నైవేద్యాద్యుపచారముల కీర్తనములు, పవ్వళింపు, దివ్యనామ సంకీర్తనము, వసంతోత్సవముల కీర్తనములు, స్వామిని మేలుకొలుపుటకై కీర్తనములు, ఇని మొదలైనవియు నణగి యున్నవి. ఇదిగాక విడికీర్తనములును గలవు. ఇతని భక్త్యాతిశయమువలన మాటిమాటికి వెంకటరమణుడు ఇతనికి సాక్షాద్దర్శనమిచ్చి మాట్లాడినట్లు పెద్దలు జెప్పుచున్నారు. భజనపద్ధతికి యితడే మూలపురుషుడు. ఇతడు రామామాత్యులకు ముందటివాడని జెప్పుచున్నారు.

## క్షేత్రజ్ఞులు

ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు. ఇతనియునికి మువ్వపురి. ఆంధ్రభాషలో మిక్కిలి ప్రజ్ఞగలవాడు. సంగీత సాహిత్యజ్ఞానముగల గొప్పపండితుడు. ఈతడు బాల్యదశలో నొక మహాయోగివలన గోపాలమూలమంత్రముపదేశింపబడి మువ్వపురిలో వెలయు గోపాలాలయములోనుండి బహుకాలము భక్తితో మంత్రావృత్తి జేసుకొని యుండునపుడు శృంగారరసాధి దేవతయైన గోపాలుడు దర్శనమిచ్చి యనుగ్రహించినతోడనే "శ్రీపతిసుతుబారికి నేనోపలేక నినువేడితే కోపాలా మువ్వగోపాలా" అని వాగ్గేయరూపముగా పదములు జెప్ప ప్రారంభించెనట. ఇతని పదములవలె శృంగారరసము లొలుకునట్లు కైశికీరీతిగాను, మృదుపదములు గలదిగాను, నాయకీనాయక లక్షణములు దప్పకను, అర్థపుష్టితోను, సందర్భరసములకు దగినట్లు రాగములతోను, ధాతువులతోను ఇతనికి మునుపుగాని వెనకగాని పదములు జూడదగినవారెవరును లేరని నిశ్చయముగా జెప్పవచ్చును. ఈతని పదములు శబ్దార్థముల చక్కగానెఱిగి రసానుభవముతో నెవడు (చౌకముగా) విళంబముగా పాడుచున్నాడో ఆపదములుదా రుచించును. ధాతువులను వ్రాసి జూచితే వచ్చినదే వచ్చినట్లుండును. ఇట్లుండుటయే పదసాహిత్యములశయ్య. ధాతువులు వచ్చి నదిరాక యుండుట కీర్తనములశయ్య. ఈ క్షేత్రజ్ఞులు మధుర, తంజావూరు, గోలకొండ యీ సంస్థానాధిపతులసభలలో యిన్నేసి యిన్నేసి పదముల జెప్పియున్నానన్నందుకు దేశీయదేవగాంధారి రాగమున "వేడుకతో నడుచుకొన్న విటరాయడే" అనునొక పదము జెప్పియున్నారు. ఇదిగాక తంజావూరి విజయరాఘవనాయక భూపాలుని ప్రార్థనచే ఈ రాజాంకితముగా క్షేత్రయపంచరత్నమని ఐదుపదములు జెప్పియున్నారు. ఇతని పదములనేకములు ముప్వగోపాల ముద్రలతో నుండును. కొన్నిపదములు "కంచివరదుడు" "చెవ్వందిలింగడు" అని యుండి నప్పటికిని మువ్వగోపాలముద్రలేక నుండవు.

రసికాగ్రేసరుండైన విజయరాఘవ భూపాలుండు యితనికి సేయునట్టి బహుమానాద్యుపచారములజూచి ప్రబంధ రచనాదురంధరులైన కవీంద్రులు యీసున మహారాజా! "ఇదేమి? ఏరా, రారా, పోరాయనిజెప్పెడి క్షేత్రయమీద నింతమోహమా?" ఇతనికి నింతబహుమానా

ద్యూషచార గౌరవమా?'' అనిన పలుకు లాలకించి క్షేత్రయవచ్చినతోడనే యీ సంగతులు జెప్పెను. క్షేత్రయవిని వారు జెప్పినది సరిదా అనెను. పిమ్మట కాంభోజీరాగమున ''వదరక పోవే" అను పల్లవి, అనుపల్లవి, రెండు చరణములును(జెప్పి మూడవచరణమున "భామరో శకునములడిగితి మువ్వగోపాలుఁడు వచ్చునని, కామించి నాథులకలయు చెలులజూచి కరగి చింత నొందితి" ఇంతవరకుఁజెప్పి యీ చరణముయొక్క కడపటి ఖండము మాత్రము కవీంద్రులు పూరింపవలెను అని రాజువద్ద దెలియజేసి సేతుయాత్ర పోయివచ్చెదనని వెడలెను. కవీంద్రులు సభకు వచ్చినతోడనే వారివద్ద పై జెప్పిన పదమునిచ్చి యీపదముయొక్క మూడవచరణమునందు కడపటి ఖండముమాత్రము పూర్తి సేయుడీ యనిరాజు చెప్పెను. ఆ కవీంద్రులందరును జేరి క్షేత్రయ తిరిగివచ్చువరకు యోచించియును ఆకడపటి ఖండమునకుఁ దగినవ్యవహారముదోచక చింతిల్లు చుండిరి. క్షేత్రయవచ్చినతోడనే కవీంద్రులందరును క్షేత్రయవద్దికిబోయి ప్రార్థించినారట. క్షేత్రయ "రామరామ యీమేనితో వానిమోము జూడవలెనా మొదటిపొందేచాలు'' అని పదమును పూర్తిచేసినదివిని కవీంద్రులందరును నీవు సాక్షాద్గోపాలుఁడేయని కొనియాడి రాజువద్దకుబోయి యీ సంగతిని దెలియఁజేసి పొగడిరట.

మావద్దనుండు ప్రాచీనపుస్తకములో పై జెప్పిన పంచరత్నములఁజేర్చి ఏనూరు పదము లున్నవి ఇప్పుడుగల అచ్చుపుస్తకములో బహుపదముల శబ్దములు మాఱ్చబడి యున్నవి ఇది గాక అర్థములు రససందర్భములు దెలియని నవీన గాయకులు రాగములను మార్చియున్నారు. ఇతఁడు పై జెప్పిన విజయరాఘవభూపాలుని కాలమే.

## శ్రీనివాసులు

ఇతఁడు ద్రావిడబ్రాహ్మణుడు. ఆంధ్రద్రావిడ భాషలయందును సంగీతమందును పండి తుడు. ఇతడు మధురలో మీనాక్షిగుడి పరిచారకుడు. తనచే జేయబడెడి కైంకర్యములను అప రాధలేశములేక భక్తితో నడుపించుకొని వచ్చునట. ఇటుల నితడుండునపుడు మీనాక్షీధ్వజమంట పమువద్ద నొకతపస్వి రాజమాతంగీదేవి మూలమంత్రమును బహుకాలముగా నావృత్తి జేసుకొని యుండెను. ఒకానొక దినమందు అర్ధజామకాలపూజ నడచినతోడనే మీనాక్షీదేవి అర్ధజామా లంకార చిహ్నములతోడ నోరునిండిన తమలముతోడ నొక బోగముపడుచువలె నాతపస్వివద్దికివచ్చి "ఓరీ! నోరుదెఱచు" అని జెప్పినమాత్రాన భ్రష్టేఅని తిట్టిన తోడనే అక్కడికి సమీపమున పండు కొని నిద్రబోవుచున్న శ్రీనివాసుని దగ్గరికివచ్చి "ఓరీ శ్రీనివాసా! లే నోరుదెఱచు" అన్న మాత్రమున నోరుదెఱచగ వానినోటియందు తమలమును తుప్పెనట. ఆమాతంగీ పరమాను గ్రహమువలన సంగీత సాహిత్యములలో ప్రజ్ఞగలిగి కీర్తనములు జెప్పదొడగెనట. ఇతని కీర్తన ములు అనేకములుగలవు. అర్థపుష్టియు శబ్దశయ్యాయును వ్యవహారములును పొందియుండును.

ధాతువుల శయ్యాయు మేలిమిగ నుండును. ద్రావిడభాషలో పలువిధములైన పదములు, కీర్తనములు "విజయగోపాల" ముద్రతో నేయబడియున్నవి. ఇతడు మధుర తిరుచినాపల్లి నేలిన విజయ రంగ చొక్కనాథనాయక భూపాలుని కాలమందున్నవాడని తెలియవచ్చుచున్నది.

## జయదేవులు

ఇతఁడు ఉత్తరదేశస్థుఁడైన విప్రుఁడు గోవర్ధనాచార్య శిష్యుఁడు. శ్రీకృష్ణచరణారవింద మరందతుందిల మిళిందాయమాన మానసుడు. సంస్కృతభాషలో నసదృశమైన వాగ్విలాస వైభవముగల కవీంద్రుడు. ప్రసన్నరాఘవ నాటకము మొదలైన పెక్కుగ్రంథములు విరచించిన చతురుడు. శ్రీరాధాకృష్ణ విషయమై శృంగారరస ప్రధానమై ద్వాదశసర్గ సహితమై విలసిల్లెడి "గీతగోవిందు" (అష్టపది) అను ప్రబంధమును గాంధర్వముగా విరచించిన మహాత్ముఁడు. ఈ అష్టపదులకు ఈ జయదేవులవలన నేర్పరుపబడిన రాగములును గేయఘణుతులను సంగీతరత్నాకర రాగవివేకాధ్యాయమునఁగల రాగములవలె నెటులనో వాడుకలేకపోయెను. 300 సంవత్సరములకు మునుపుగల దక్షిణదేశస్థులైన సంగీతజ్ఞులు ఇరువదినాలుగు అష్టపదులకును రాగతాళములు, ఆయా రాగతాళముల ననుసరించి యేర్పరుపబడిన గేయఘణుతులు, యిప్పుడు వాడుకలోనున్నవి.

ఈ జయదేవకవీంద్రుడు పంతొమ్మిదవ అష్టపది వ్రాసుకొని యున్నపుడు "స్మరగరళ ఖండనం మమశిరసిమండనం, దేహిపదపల్లవ ముదారం" అని తోచినతోడనే వ్రాయక తాటాకును తన భార్యయైన పద్మావతిచేతనిచ్చి తలంటుకొని తాను స్నానమునకై నదికేగెనట. తోడనే శ్రీకృష్ణుడు తలంటుకొన్న జయదేవ స్వరూపముగావచ్చి పద్మావతిని బిలిచి తాటాకును లేఖినిని బుచ్చుకొని జయదేవులకు తోచినట్లే సాహిత్యములను వ్రాసియిచ్చిపోయెనట. వెంబడిని జయదేవులువచ్చి తాటాకునడిగెను. ఇప్పుడు దానేవచ్చితీసి వ్రాసియిచ్చిపోతిరియని చెప్పఁగా తాటాకును దీసిచూచి ఆనందసాగరమగ్నుడై 'ఓపద్మావతీ భగవంతుఁడు నీకు దర్శనమిచ్చెనే. నీ సుకృతము నేమని పొగడుదును' అని చెప్పినదిగాక ఆఅష్టపది ఎనిమిదవ యడుగున "జయతు పద్మావతీ రమణజయదేవకవి భారతీఫణిత మితిగీతం" అని తనపేరునకు మునుపు ఆమె నామమునుబెట్టి యిరువది యొకటవ అష్టపదిలోను బెట్టుకొనెనట. ఇటుల బెట్టుకొనుటయే ఆమెకు భగవద్దర్శనమైనందుకు నిదర్శనముగానున్నది. ఇతడు శార్ఙ్గదేవుల కాలముగా నుండవచ్చునని దోచుచున్నది.

## ఘనం సీనయ్య

ఇతఁడు ఆత్రేయగోత్ర పవిత్రుడు ఆపస్తంప సూత్రుడు. శ్రీ వైష్ణవుడు వంగల కులజుడు. వాధూలదేశిక కృపాపాత్రుడు. శేషయజ్వకుమారుడు. సంగీత సంస్కృతాంధ్ర భాషా

ప్రవీణుడు. శ్రీవిజయరంగ చొక్కనాథ కరుణాకటాక్ష లబ్ధసంపద్వైభవుడు. మంత్రి శేఖరుడు. శృంగారరస భూయిష్ఠమైన ''శశాంక విజయము'' అనెడి ప్రబంధమునంది కీర్తివహించినాడు. ఇతని సంగీత విద్యాపారీణతను గురించి శశాంకవిజయములో వర్ణించిన పద్యము.

శా. హాహాహూహులు గానగర్వమునహా హాహూహువంచున్స్వరా,
రోహప్రక్రియకా తురంగతనులై రూపంబులానన్వృథా,
సాహంకారులమర్త్యగాయకులు జోడానీకు పాండ్యేశ్వర,
స్నేహాలంకృత వంగలాన్వయమణీ సీనా కవిగ్రామణీ.

ఈ సీనయ మన్నారు రంగముద్రతో గేయవాక్కుగా ననేక కీర్తన పదములు జేసి యున్నాడన్నందుకు శశాంక విజయములోగల పద్యము.

క. శ్రీమన్నరు రంగాధిప,
నామాంకిత గేయకల్ప నాతతమతికిన్,
రామానుజ విజయాంకగ
వీ మధురస మోదమాన వేంకటపతికిన్.

ఈ సీనయ క్షేత్రయకు సమకాలీయుండని తోచుచున్నది.

## మార్గదర్శి శేషయ్యంగారు

ఇతడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు. సంగీతమందును సంస్కృతమందును చాలా పాండిత్యముగలవాడు. రంగనాథుని భక్తుడు. అయోధ్యలో నుండి శ్రీరంగమునకువచ్చి సంస్కృత గేయవాక్కుగా రంగనాథునిపై ననేకకీర్తనములుజేసి భజించుకొని వసించెనట. అయోధ్యలో నుండి వచ్చినవాడగుటచే ''కోసల'' యను ముద్రను తన కీర్తనములలో బెట్టుకొని వచ్చెనట. తనచేజేయబడిన కీర్తనములన్నియు నొకపుస్తకముగావ్రాసి రంగనాథుని యర్ధజామపూజా సమయమున రంగనాథుని పాదముల సమర్పించి బెట్టుమని యర్చకులవద్దనిచ్చి వచ్చెనట. మరునాడుదయకాలమున రంగనాథుని కోవిలకువెళ్లి పుస్తకమును తీసిచూచెనట. ఆ పుస్తకములో నరువది కీర్తనములు మాత్రముండెనట. తక్కిన కీర్తనములన్నియు స్వరూపము దెలియక చెదలుబట్టి పోయెనట. భగవంతుడొప్పుకొన్న అరువది కీర్తనములే ప్రసిద్ధముగా నున్నవి అప్పటి పండితులు ఈతని సంస్కృత వాగ్గేయఫణుతులనుజూచి ఇతనిని మార్గదర్శి శేషయ్యంగారు అని పొగడినారట. ఇతడు సీనయకు మునుపటివాడని జెప్పుచున్నారు.

## గిరిరాజ కవి

ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు. ''జననాత్కమలాలయే'' అని జనులచే పొగడబడిన తిరువారూరే యీ గిరిరాజకవికి వాసస్థలము. సంస్కృతాంధ్రభాషలలో మిక్కిలి ప్రజ్ఞగలవాడు.

సంగీత విద్యాసంపన్నుడు. ఇతడు తెనుగున భక్తిరసముగాను వేదాంతవిషయముగాను బహు కీర్తనములజేసి ప్రఖ్యాతిని బొందినవాడు. తంజావూరినేలిన మహారాష్ట్రరాజులలో రెండవ రాజయిన సహజిమహారాజుచే బహుసమ్మాన గౌరవముల నందినవాడు. శ్రీరామానుగ్రహము వలన భక్తిరసముతో తెనుగున ననేకకీర్తనములుజేసి యశఃకాయులై విలసిల్లెడి త్యాగరాజయ్య యొక్క పితామహుడు. రమారమి 170 సంవత్సరములకు మునుపుండిన వాడుగా దోచు చున్నది.

## సహజి మహారాజు

ఇతడు తంజపురినేలిన మహారాష్ట్ర రాజవంశస్థులలో రెండవరాజు. ఏకోజి మహారాజు కుమారుడు. భోసలకులజుడు. సంస్కృత మహారాష్ట్ర, ఆంధ్ర హిందుస్థాని మొదలయిన భాష లలో మిక్కిలి సమర్థుడు. సంగీత సాహిత్య విద్యాపారంగతుడు. ధర్మసంస్థాపనశీలుడు. ఇతడు శకాబ్దము 1605, క్రీ. శ. 1684 మొదలు శకాబ్దము 1632, క్రీ.శ. 1711 వరకు చోళమండలము నేలినవాడు. ఈసాహ మహారాజు అనేక దేవతావిషయములై, పైజెప్పిన భాషలలో ననేక కీర్తనములు జెప్పియున్నాడు. ఇదిగాక తిరువారూరి శ్రీవీథీవిటంక త్యాగరాజస్వామి తెనుగున పల్లకినాటకము అనుపల్లకి సేవాప్రబంధము వాగ్గేయ స్వరూపమై విరచించియున్నాడు. ప్రతి శుక్రవారము స్వామి శయనస్థానమునకు పల్లకిలో వేంచేయునపుడు పల్లకినాటకమునుపాడి ఆడు కొని వచ్చునట్లు ఏర్పాటుజేసియున్నాడు. నేటికిని నడిచివచ్చుచున్నది. ఇట్లు నడిచివచ్చుటకై సాహమహారాజు పదివేలి నేల సర్వమాన్యము ఇచ్చియున్నాడట.

## లక్ష్మీకాంత మహారాజు

ఈరాజు క్షత్రియుడు. సంగీత సంస్కృతములం దసాధారణమైన పాండిత్యముగల వాడు. ఇతని కీర్తనములు సంగీత సంస్కృత సాహిత్య చమత్కారములతోగూడి యున్నవి. ఈరాజు ఏ సంస్థానమునేలిన వాడనియు, ఏకాలమున నుండిన వాడనియు తెలియలేదు. ఆయన ఉనికి తెనుగుదేశమో లేకనుత్తర దేశమోయనియు, అహోబలమునికి పిమ్మట నుండినవాడనియు నెంచవలసినదిగా నున్నది.

## వీరభద్రయ్య

ఇతడు తైలింగ్య బ్రాహ్మణుడు. తెనుగున మంచి ప్రజ్ఞగలవాడు. ఇతని వాస స్థలము ఉత్తరదేశము. సంగీత సాహిత్యరచనా విశారదుడు. మహారాష్ట్ర మహారాజులలో సద్వి వేకవితరణ ధురీణుడును, రసికశిఖామణియును, ఔదార్యగుణసంపన్నుడును, నీతిదప్పక చోళ మండలమును పరిపాలించినవాడును, అనేక సురాలయ భూసురాలయములకు సర్వమాన్యముల

నిచ్చినవాడునైన ప్రతాపసింహ మహారాజు శకాబ్దము 1662 క్రీ.శ. 1741 మొదలు శకాబ్దము 1686, క్రీ.శ. 1765 వరకు తంజపురినేలెను. ఈతని రాచరిక ప్రారంభకాలములో నీతని యౌదార్యాది సుగుణములను విని వాగ్గేయశ్రేష్ఠుడైన వీరభద్రయ్య ఉత్తరదేశమునుండి వెణ్ణేటిగట్టవచ్చి రాజు భేటికై బహుదినములు కాచియుండెను. ఇతని యోగ్యతాగౌరవములను బహుజనులవలన విని యొకదినము రాజే వీరభద్రయ్యగదికివచ్చి పాటనువిని బహుమానమిచ్చి తంజపురికి పిలుచుకొనిపోయి తగిన జాగనిచ్చి యాదరించి గౌరవించెనట. అది మొదలు తంజపురినగరిలో కొలువైయున్న భోసలవంశరాజుల కులదైవమైన ప్రతాపరామముద్రను గైకొని బహుకీర్తనములు అనేక రక్తిరాగములందును, బహుదేశీయ రాగములందును గేయకల్పనలు వేర్వేర విలసిల్లునట్లు విరచించెను. ఇదిగాక ప్రతాపసింహ మహారాజుమీద దరు, పదములు, తిల్లానాలు మొదలయినవి యనేక విచిత్రగేయ కల్పనలతో జేసి బహుఖ్యాతినొందెను. ఈ మహానుభావునివలననే దక్షిణదేశపు గానమార్గము మిగుల పరిష్కారము గలదిగా నేటికిని ప్రకాశించుకొనియున్నది.

## కవి మాతృభూతయ్య

ఈ తైలింగ్యవిప్రుడు సంగీతాంధ్రభాషా పండితుడు. త్రిశిరగిరి (తిరుచినాపల్లి) వాసుడు. శ్రీ సుగంధి కుంతలాంబా భక్తుడు. ఆమెయనుగ్రహమువలన నీతిభక్తిరసముగల కీర్తనములు అనేకముగా జేసియున్నాడు. శృంగారరసముతో బహుపదములు జెప్పియున్నదిగాక పారిజాతాపహారణమును గాంధర్వరూపమైన యొకనాటకమును జెప్పియున్నాడు. ప్రతి కీర్తనపదములందు "త్రిశిరగిరి" అని ముద్రబెట్టియుండును. పదశయ్యావ్యవహారము గలిగి యర్థపుష్టితోనుండును. ఈ మాతృభూతయ్య తన పేదరికమును సైచక సుగంధి కుంతలాంబవద్ద బహుకీర్తనములచే మొఱయిడినదిగాక "కాశికప్పణ మీవలనమ్మ" యని జెప్పిన కీర్తనమువిని అమ్మవారు మాతృభూతయ్య స్వప్నమున దర్శనమిచ్చి "తంజావూరిలో నాభక్తుడు ప్రతాపసింహుడున్నాడు. అచ్చటికి వెడలుము. ఆరాజు నీలేమిని పోగొట్టును" అన్నమాత్రమున లేచి తంజావూరికి వెడలెను. ఆదినమే సుగంధి కుంతలాంబ ప్రతాపసింహుని స్వప్నములో "నాభక్తుని నీవద్దకు రమ్మంటిని వానిలేమిని దీర్చుము" అని చెప్పినతోడనే రాజులేచి మాతృభూతయ్య రాకనుగోరియుండెనట. ఇతడువచ్చినది తెలిసి యుపచరించి పదివేలరూపాయలిచ్చి త్రిశిరగిరికి పంపించెను. అతడు అచ్చట సౌఖ్యముగా తన కృతులచే శ్రీ మాతృభూత సుగంధి కుంతలాంబలను భజించుకొనియుండెనట.

## ఆదిప్పయ్య

ఈ కర్ణాటకబ్రాహ్మణుడు మధ్వ మతస్థుడు. తెనుగందును సంగీతమందును గొప్ప పండితుడు. ఈ ఆదిప్పయ్య ప్రతాపసింహ మహారాజుకాలమందును, తుళజామహారాజు కాలమందు నుండినవాడు. రక్తి రాగములందును, దేశీయరాగములందను "శ్రీ వేంకటరమణ"

ముద్రతోను, విశేషగమక జాతీయములతోను అనేక కీర్తనములు ఇతనివలన జేయబడియున్నవి. వీరు వీరభద్రయ్య మార్గమునే యనుసరించినవారు. రాగాలాపన, మధ్యమకాలపల్లవి ఫణతులు ఇతనివలననే పరిశుద్ధమైనవని జెప్పుదురు. వర్ణములనేకములు ముందుండినప్పటికిని భైరవిరాగములో నితనివలన సేయపడిన "విరిబోణి" యను తానవర్ణము పాడుటకుగాని వీణలో వాయించుటకుగాని యిటువలనే యిక వర్ణముకలుగుట దుర్లభము.

ఈ ఆదిప్పయ్య కుమారుడు వీణకృష్ణయ్య. ఇతడు వైణిక శ్రేష్ఠుడు. మైసూరు, విజయనగరం, కొత్తకోట ఈ సంస్థానాధిపతులమీద (ప్రసిద్ధములుగానున్న సప్తతాళములోగల ధ్రువతాళమందే తక్కిన అరు తాళములు నణిగియుండునట్లును, ప్రబంధముపాడి యెత్తునపుడు అన్నితాళముల మొదటి ఘాతలు ఒకేఘాతగా పడునట్లుండెడు) "సప్తతాళేశ్వరము" అనిమూడు ప్రబంధములు జేసియున్నాడు. ఆ ప్రబంధ మాతువులలో రాజుల నామాక్షరము లందొక్కొక్క అక్షరముల నొక్కొక్క ఆ వృత్తాద్యక్షరములుగా నర్థముతో రచించియున్నాడు. ధ్రువతాళము ముప్పదియావృత్తములైతే ఎత్తునపుడు తక్కిన ఆరుతాళములును ఒకేరీతిగా ప్రబంధాద్యక్షరమందెత్తబడును.

ఈ వీణకృష్ణయ్య కుమారుడు వీణ సుబ్బుకుట్టి అయ్య. ఇతనివలె వీణయందు రాగాలాపన మధ్యమకాల పల్లవి స్వరకల్పనలు గమకముచెలయునట్లును, అతీత అనాగత గ్రహములు వెలయునట్లును వాయించుటనెవరికిని సాధ్యముకానేరదు. వైణికులకు తాళజ్ఞానముండుట యతి దుర్లభము. ఈయనకు గలిగిన తాళజ్ఞానము ఇంకొకరికి గలుగనేరదు. ఈయన వీణవాయించుకొనియే డెబ్బదియేండ్లుండెను. ఇతడు గతించి రమారమి ముప్పదినాలుగు సంవత్సరములుండ వచ్చును.

## వెంకటరామయ్య

ఈ బ్రాహ్మణుడు తెనుగున మంచిచదువరి. సంగీతమందును మిక్కిలి ప్రౌఢుడు. ఈ వెంకట్రామయ్య కీర్తనముల జాతీయములనెఱిగి పాడుటకు దుర్లభములుగా నుండుటవలన నప్పటి గాయకోత్తములు "ఇనుప సనిగెలు (శనగలు) వెంకట్రామయ్య" యని పేరిచ్చినారట. ఇతడు బోధేంద్రస్వాములమీద "సతమని" యను తోడికీర్తనము మొదలైనవియును, మధురానల్లూరి మొదటి స్వాములమీద కొన్ని కీర్తనములును "గోపాలకృష్ణ" ముద్రబెట్టి జేసియున్నారు. ఇతడు ఆదిప్పయ్యయొక్క కడపటి కాలమని దోచుచున్నది.

## సొంటి వెంకటసుబ్బయ్య

ఈ తైలింగ్య బ్రాహ్మణుడు తెనుగందును సంగీతమందును సామర్థ్యము గలవాడు. వేంకటమఖిచే జెప్పబడిన రాగాంగాది రాగ సంప్రదాయములను విశేషముగా దెలిసినవాడు. ఈ

వెంకటసుబ్బయ్య, ఆదిప్పయ్య అను నీయిద్దరును సమకాలికులై యుండినప్పటికిని యీ వెంకట సుబ్బయ్య వయస్సున చిన్నవాడే. ఇతడు తుళజామహారాజుమీద బిలహరిరాగములో నొకవర్ణము విచిత్ర కల్పనలతో జేసియున్నాడు. రసికాగ్రేసరుడై ఔదార్యస్వరూపుడై ప్రఖ్యాతిజెందిన మణలి చిన్నయామొదలారి సభలో బహుమానింపబడి బహుచమత్కారములతో నితనివలన నేయ బడిన సంగీతసాహిత్యములు పెక్కులుగలవు. ఇతనికుమారుడు వెంకట రమణయ్య. సంగీత సాహిత్యమార్గమందును, గానమార్గమందును, తన తండ్రికిమించినవాడని జెప్పుదురు. ఇతడు శరభోజి మహారాజు కాలమందుగూడ నుండెనట. వీరికి సొంటియనుట ఇంటిపేరు.

## రామస్వామి దీక్షితులు

శకాబ్దము 1657, క్రీ.శ. 1735 లో జన్మించిన ఈ ద్రావిడ బ్రాహ్మణుడు పౌత్రుడు. కాశ్యపగోత్రుడు. అపస్తంబసూత్రుడు. ఇతని తండ్రి వెంకటేశ్వర దీక్షితులు. తల్లి భాగీరథియమ్మ. ఇతడు ఏడవవయస్సున గుత్తుపువారి కలహముచే కాంచీమండలమునుండి పండ్లుచెల్లిన తల్లిదండ్రులతో వెడలి మధ్యార్జున క్షేత్రమునకు సమీపముననున్న గోవిందపురమునకువచ్చి క్రమాంతము అధ్యయనము జేసుకొని యుండెను. అటుతరువాత ఆయనతల్లిదండ్రులు ఆరునెలలు ముందు వెనుకగా లోకాంతరము జెందిరి. సంస్కృతభాషలో మంచి వ్యుత్పత్తిని జెంది ఆంధ్రభాషను నేర్చుకొనెను. స్వభావముగా తనకు మంచి శారీరముకలిగియుండుటవలన వినికచే శ్రావ్యముగా పాడ నేర్చుకొనెను. పాటపై నుండు భ్రమవలన తంజావూరికిపోయి వీరభద్రయ్యగారివద్ద రెండుసంవత్సరములుండి రక్తిరాగములందును దేశీయరాగములందు నతనిచే జేయబడిన కీర్తనములును స్వరజ్ఞానము కలుగునట్లభ్యసించి ఆలాపన పల్లవి స్వరములు పాడునట్లు నేర్చుకొని మాయూరమునకు వచ్చియుండునప్పుడు సంగీతలక్షణము దెలుసుకొనవలెనను అపేక్షచే చింతిల్లుచుండెను. ఒకదినమం దొక పెద్దలువచ్చి "మధ్యార్జునమునకు వెడలుము నీచింతలు దీరును. లక్షణ విద్యావంతుడౌదువు" అని యనుగ్రహించిన మాత్రమున మధ్యార్జునమునకు వెడలి అచ్చట నిత్యాగ్నిహోత్రియు వెంకటమఖి మాతులపౌత్రుడునైన వెంకట వైద్యనాధ దీక్షితుల పరమానుగ్రహమువలన ఒక్క సంవత్సరములో వీణనభ్యసించి పిమ్మట చతుర్దండి ప్రకాశిక రాగాంగోపాంగ భాషాంగ రాగగీతములు సకలరాగ తాళలక్షణములు సాంగోపాంగముగా దెలుసుకొని తనగురువులనాజ్ఞ చొప్పున తంజావూరికేగి అచ్చటి రాజసభలో గొనియాడబడి బహుసమ్మాన గౌరవములనంది మాయూరమునకువచ్చి శ్రీ త్యాగరాజమహోత్సవ దర్శనార్థమై తిరువారూరికివెడలి శ్రీ కమలాంబా త్యాగరాజులసేవించి భజించుకొనియుండెను. దర్శనార్థమై యచ్చటికివచ్చిన అమరసింహ మహారాజు ఈయనవలన తనమీద సేయబడిన రాగమాలికనువిని బహుమానించి ఆదరించెను. ఈ రామస్వామి దీక్షితుల భక్త్యాతిశయమువలన శ్రీ వీధీ విటంక త్యాగరాజస్వామి స్వప్నదర్శనములో నాజ్ఞయిచ్చినప్రకారమే స్వామి వీధికి విజయము సేయు సమయములందు ధ్వజమంటపము మొదలు

తిరిగి ధ్వజమంటపమువరకు వచ్చుదాక ఇచ్చోటనిచ్చోట నిటులనిటుల వాయించవలెనని నాగస్వర వాద్యగాండ్లు మొదలయినవారికి చేసిన యేర్పాటువలె పరంపరగా ఇప్పుడును వాయించుకొని వచ్చుచున్నారు. ఇతనికి నలువదియేండ్లవరకు సంతతిలేనందువలన తనభార్యతో శ్రీ వైద్యనాథుల గుడికిపోయి శ్రీ ముద్దుకుమారస్వామి సన్నిధిలో భజనయుండిరి. కొన్ని దినములలో నితని భార్య సుబ్బమ్మ గర్భవతియైనతోడనే తిరువారూరికివచ్చి యుండునపుడు మంచిలగ్నమున నొక సుపుత్రునిగనెను. ఆ బిడ్డకు ముద్దుస్వామియని పేరుబెట్టిరి. కొన్నిసంవత్సరములకవతల బుట్టిన రెండవపుత్రుడైన చిన్నసామి దీక్షితులకు తన గురువులపేరైన వెంకట వైద్యనాథ శర్మమను బెట్టిరి. ఈ చిన్నస్వామి దీక్షితుల తోడబుట్టిన ఆడుబిడ్డకు బాలాంబయనియు, కడపటికొడుకునకు బాలస్వామియనియు పేళ్ళుబెట్టిరి. ఇతని కుమారులలో ముద్దుస్వామి దీక్షితులు క్రమాంతము అధ్యయనముజేసి కావ్యనాటకాలంకారములు చదివి వ్యాకరణమూలమైన కౌముదీ చదువుకొని సంగీతమును నేర్చుకొనియుండెను. ఇతనితమ్ములు వారివారియేండ్లకు దగిన విద్యలనభ్యసించు కొనియుండిరి. ఆకాలమున దర్శనార్థమై తిరువారూకి వచ్చిన మణలి ముద్దుకష్ణ మొదలారు అను గొప్పప్రభువు రామస్వామి దీక్షితుల యోగ్యతను గమనించి బహుమానించినదియుగాక సకుటుంబముగా వీరిని వెంటనేబిలుచుకొని మణలికిపోయి గౌరవముగా కొన్నిసంవత్సరములు ఆదరించుకొనియుండెను. తరువాత నతనికుమారుడును, సకలవిద్యాపారంగతుడును, రసికాగ్రేస రుడును, ఔదార్యస్వరూపుడునైన వెంకటకృష్ణుడను చిన్నయా మొదలారు రామస్వామిదీక్షి తులచే జేయబడిన నూటయెనిమిది రాగతాళమాలికను విని కనకాభిషేకముజేసి గారవించినది గాక అర్థపుష్టిగల ఆరాగమాలికను పాడివినిపించిన చిన్నస్వామి బాలస్వాములకు బహుసమ్మాన ములుజేసి యాదరించినారు. అక్కాలమున వేంకటమఖి ప్రపౌత్రులని వచ్చిన గోవిందదీక్షితు లను మొదలారు మిగులనాదరించి చతుర్దండి ప్రకాశిక మొదలయిన పుస్తకముల జూడవలెనని యడిగినందుకు మేమిచ్చెడు మూర్ఛనను ఈరాగమని జెప్పితే పుస్తకముల నిత్తునని అత డిచ్చిన మూర్ఛనను మొదలారిచేనందుకొని రామస్వామిదీక్షితులు మొదలారువచించినట్లు "నన్ను బరీక్షించనేలా'' అను పదమునుజూచి కడపటి స్వరమందు గోవిందదీక్షితులిచ్చిన మూర్ఛననమర్చి చిన్నసామి బాలసామి యను నిద్దరు కుమారులగొని వినిపింపజేసినది విని గోవిందదీక్షితులు మే మిచ్చిన రాగమే వీరు మావెంకటమఖి శిష్యులేయని పొగడినారు. తన రెండవకుమారుడైన చిన్న సామయ్యకు కండ్లు దెలియకపోయినందున మిక్కిలి చింతాక్రాంతుడై సకుటుంబముగా తిరుపతి కేగి వేంకటాచలపతిమీద "మనసా వేరితరుల దలచక" అను నలువదియెనిమిది రాగములుగల యొక రాగమాలికను, ''ఇంకా దయరాకున్నను'' అను కీర్తనమును వేగవాహినీ రాగములో జూచి నలువదియైదు దినములు భజించుకొనియుండగా కండ్లు దెలిసి చిన్న సామయ్యా తన కాలమువరకు సౌఖ్యముగానుండెను ఈ రామస్వామిదీక్షితులు ప్రత్యేకాదశులందును గీత

గోవింద (అష్టపది) ద్వాదశ సర్గమును తప్పక పారాయణము జేసి వ్రతముందురు. శ్రీ మీనాక్షీ దేవిమీద నలువదినాలుగు రాగములుగల ఒక రాగమాలికయును, రీతిగౌళ, హిందోళ, మనోహరి, పూర్ణచంద్రికరాగములలో చౌకవర్ణములును, శంకరాభరణ తానవర్ణమును, అనేక కీర్తనములును "వెంకటకృష్ణ" ముద్రతో జేసినదిగాక "హంసధ్వని" అను రాగమును గల్పించి ఆరాగములో ప్రబంధమురచించి ప్రసిద్ధిబొంది తనయవసానకాలము దెలిసి* రామస్వామిదీక్షితులు సకుటుంబముగా తిరువారూరికివచ్చి యశఃకాయులై శకాబ్దము 1739, క్రీ. శ. 1817 ధాతసంవత్సరము మాఘమాసము శివరాత్రి పుణ్యకాలమందు పరమపదము జెందెను.

## శ్యామాశాస్త్రిలు

శ్రీ కాంచి కామాక్షీదేవి యుత్సవమూర్తియైన శ్రీ బంగారు కామాక్షీదేవి దౌష్ట్య తురకల కలహమువలన పూజకులును, ద్రావిడ బ్రాహ్మణులలో ఔత్తురులునైన కొన్ని స్థానీకులతో వెడలి శ్రీపురమను తిరువారూరి క్షేత్రమునకువచ్చి రమారమి ముప్పదియైదు సంవత్సరముల వరకు తంజపురిరాజువలన నేర్పరుపబడిన పూజోపచారాదుల నంగీకరించుకొని యున్నపుడు ఈ శ్యామాశాస్త్రిల తలిదండ్రులు శ్రీ కామాక్షిని యత్యంతభక్తితో పూజించుకొనియుండుటయుగాక, తనకు పుత్రుడు లేనందున ప్రతిమాసములందును కడపటి స్థిరవారములో వెంకటాచలపతి ప్రీతిగా బ్రాహ్మణ సంతర్పణలు నడిపించుకొనివచ్చునపుడు ఒకస్థిరవార బ్రాహ్మణ సంతర్పణ నడచుచో నొకముదుసలి బ్రాహ్మణునిమీద వెంకటాచలపతి యావేశించి "ఓ దంపతులారా! మీకు ఒక సంవత్సరములోపల యశోవంతుడైన యొకసుపుత్రుడు గలుగును" అని చెప్పినట్లే ఇతనితల్లి గర్భవతియై పదినెలలునిండినతోడనే శకాబ్దము 1685, క్రీ. శ. 1763 చిత్రభానుసంవత్సర మేషరవి కృత్తికా నక్షత్రమందు శ్రీనగరము అను తిరువారూరిలో ఈ శ్యామాశాస్త్రిలు జన్మించెను. ఇతడు బాల్యమందే సంస్కృతాంధ్రభాషలలో మహాప్రౌఢుడై బంగారు కామాక్షితో తంజావూరికివచ్చి తనబంధువులలో నొకరివద్ద సరళిమొదలు స్వరజ్ఞానమువరకు నేర్చుకొనెను. అంతలో శ్రీవిద్యా పరమానుగ్రహమందెను. ఇతని భాగ్యవిశేషమువలన ఉత్తర దేశమునుండి సంగీతస్వాములని సంగీతవిద్యాపారంగతుడైన యొక యతీంద్రుడువచ్చి ఇతనిని అంతేవాసిగాగైకొని మూడుసంవత్సరపర్యంతము సంగీతలక్ష్యలక్షణ మర్మములన్నియు క్రమముగా నభ్యసింపించి ఇతని గానసామర్థ్యములనెఱింగి మిక్కిలి యశోవంతుడవౌదువని అనుగ్రహించి ఆదిప్పయ్యపాటను కొన్నిదినములు వినుమని జెప్పి పండితస్వాములు కాశికివెళ్ళెను. కొంత కాలమునకు పిమ్మట శ్రీ కామాక్షీదేవి యనుగ్రహమువలన సాహిత్యచమత్కారములు గేయ కల్పనలు తాళవిషయములు వెలయ "శ్యామకృష్ణ" అను ముద్రతో బహుకీర్తనములు స్వర

* గాయకశ్రేష్ఠులని యశముబొందిన అళసూరుకృష్ణయ్య ఈ రామస్వామిదీక్షితులశిష్యులే.

జతులు తానవర్ణములు విరచించి బహుశిష్యులవలన ప్రకాశపరచి యశఃకాయులై శకాబ్దము 1749, క్రీ. శ. 1827 వ్యయసంవత్సర మకరరవి శుక్ల దశమినాడు శ్రీపురము జేరెను. నూటికి పైనుండు నితనికీర్తనముల నచ్చొత్తునపుడు ఇతని యద్భుతచరిత్రములనెల్ల విరివిగా వ్రాసెద.

ఇతని కీర్తనముల గేయఫణుతులు, అతీతానాగతగ్రహచమత్కారములతో నారికేళపాక రీతిగా నుండుటవలన గాయకులలో తెలియని కొన్ని సోమరులు రంజనముగలిగించుటకు సామర్థ్యములేక గడుసనిజెప్పుచున్నారు. దీనికి శ్రీనాథకవిచే తెనుగింపబడిన శృంగారనైషధ కావ్యములో ప్రథమాశ్వాసమునగల

> చ. పనివడి నారికేళ ఫలపాకమునం జవిఁయైన భట్టహ
> ర్షుని కవితాను గుంభములు సోమరిపోతులు కొందఱయ్యలా
> నని కొనియాడనేరరది యట్టిద! లేజవరాలు చెక్కు గీ
> టిన వసవల్చు!, బాలకుడు డెందమునం గరగంగనేర్చునే।

అను నీ పద్యార్థమే నిదర్శనముగానున్నది.

ఈ శ్యామాశాస్త్రిలకు ఇద్దరు కొమారులు. వారిలో, రెండవకుమారుడైన సుబ్బరాయ శాస్త్రిలు శకాబ్దము 1725, క్రీ. శ. 1803 దుందుభి సంవత్సర సింహారవికృత్తికా నక్షత్రంలో జన్మించెను. ఇతడు సంస్కృతాంధ్రమందును సంగీతమందును అతిసమర్థుడు. ఆంధ్ర వాగ్గేయచమత్కారములు ప్రకాశింపగా నితడు జేసిన బహుకీర్తన స్వరజతులు వాడుకలో ప్రసిద్ధముగానున్నవి. ఇతడు శకాబ్దము 1784, క్రీ. శ. 1862 దుర్మతి సంవత్సర చాపరవి కృష్ణదశమిలో శ్రీపురమేగెను.

ఈ సుబ్బరాయశాస్త్రిల అన్నకుమారుడైన అణ్ణాసామి శాస్త్రిలు కావ్యనాటకాలంకార వ్యాకరణములు సంగీతాంధ్రములు దెలిసిన వాగ్గేయకారకుడు. ఇతడు అనేక కీర్తన దరు తానవర్ణములు జేసియున్నదిగాక ఫిడేల్ వాద్యములో నతిసమర్థుడు. ఇతడు శకాబ్దము 1740, క్రీ. శ. 1827 వ్యయ సంవత్సర మీనరవి ఆశ్లేష నక్షత్రములో జన్మించి శకాబ్దము 1822, క్రీ. శ. 1900 లో తన డెబ్బదిమూడవ వయసున వికారి సంవత్సర కుంభరవి కృష్ణ తృతీయలో శ్రీపురమేగెను.

## గురుమూర్తి శాస్త్రిలు

ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుడు. మురికినాటివాడు. తిరునల్వేలిజిల్లా కయత్తారు అను గ్రామము ఇతని జన్మభూమి. చతుశ్శాస్త్ర పండితుడు. సంగీతములో నతిసమర్థుడు. ఇతని యెల ప్రాయములో చెన్నపట్టణము వెడలి మణలి చిన్నయ్యా మొదలారిచే బహు సన్మానము జెందిన

కీర్తివంతుడు. అనేక గీతప్రబంధకీర్తన రచనావిశారదుడు. బహురాగములలో ప్రతిభగల చతురుడు. ఇతడు రామస్వామి దీక్షితులవారి కాలములోనుండి నప్పటికిని ఆతనికి మిగులపిన్న.

## వీణ పెరుమాళయ్య

ఈ పెరుమాళయ్య అని వీణలో నసాధ్యపాండిత్యముగల ఒక మహానుభావుడుండెను. ఇతడు పూర్వమందున్న వీణకాళహస్తి అయ్యావంశస్థుడు. ఆంధ్రబ్రాహ్మణుడు. పరంపరాగత వైణికుడు. తంజావూరి సంస్థానపండితుడు. బహు సర్వమాన్యముల బొందినవాడు. ఘన రాగ తానములు వాయించుటయం దతి ప్రగల్భుడు. భైరవి మొదలయిన రక్తిరాగములలో నొక్కొక్క రాగమును ఒక్కొక్కరాత్రి రెండు జామమువంతున వచ్చినదిరాక పదిదినములవరకు క్రమముగా వాయించి పూర్తిజేసును. ఇటులనే ఉత్తరదేశ సంస్థానములందును వాయించి ఛత్రచామర పల్లకీలు రత్నఖచితవీణ మొదలైన యనేక సమ్మానములనెంది కొత్తకోటకువచ్చి రఘునాథ (తొండమాన్) మహారాజు సభలో నొకరాగము ఇరువదిదినములు క్రమముగా వాయించి పదివేలరూపాయలు సమ్మానము జెందెను. ఇదిగాక ఇతడు పెద్దలకీర్తనము మొదలయిన సాహిత్యములో నొక్కొక్కదినమునకు నొక్కొక్కరాగమున నున్నవానినే వాయించి వినికజేసును. ఇతడు సౌరాష్ట్రమందును, సావేరియందును, అటతాళములో రెండు తానవర్ణములు జూచియున్నాడు. ఆ గేయరచనాసామర్థ్యము లెవరికిని లభించదు. వీణలో తాళములు దప్పక వాయించుట యందతి సమర్థుడు. ఇతడు ముద్దుస్వామి దీక్షితులవారి ముప్పది యేండ్లవరకుండెను. ఇతని తమ్ముడైన వీణ నారాయణ సామయ్య ఇతనివలెనే యోగ్యతగలవాడు. ఇతనితమ్ముడు కొండయ్య. సావేరిలో నొక స్వరజతి జేసియున్నాడు.

## త్యాగరాజయ్య

రమారమి 250 సంవత్సరములకు మునుపు తిరువారూరిలో గిరిరాజకవియను నొక బ్రాహ్మణోత్తముడుండెను. ఆయనకు ఐదుగురు కుమారులు. కడపటివానికి రామబ్రహ్మము అని పేరు. ఇతడు వేదశాస్త్రములందు మహానిపుణుడు. ఇతనికి పంచాపకేశుడు, రామనాథుడు, త్యాగరాజుడు అని ముగ్గురుకుమారులు. రామబ్రహ్మము లేమిచే మిగుల కష్టబడి తన భార్యాపుత్రులతో తిరువారును విడచి తిరువైయేరు అనుపంచనదక్షేత్రమునకువచ్చి తన దుత్తమగుణశీలములే సహాయముగా గొని కాలక్షేపము జేసుకొనివచ్చెను. ఈతని కుమారులలో ముందటివారిద్దరును లౌకికకృత్యములందు కుదురుకొనిరి. మూడవకుమారుడు తండ్రికి అనుకూలుడై యుండు కొన్ని వేదాధ్యయనమును సంస్కృతమును నేర్చుకొనివచ్చెను. ఈతని పదునాలుగవ ప్రాయమున తండ్రియును డాసిన సంవత్సరమున తల్లియును కాలము జేసినారు. దీనిలోపల క్రమముగా అధ్యయనమును, కావ్యనాటకాలంకార వ్యుత్పత్తియును పొందెను. వెనుక సంగీతము అభ్యసింపవలెనను

అపేక్షచే తానువాసముచేయు వీధిలో వసించుకొనియున్న నగరి విద్వాంసుడైన సొంటి వెంకట రమణయ్య వద్ద సంగీతమభ్యసింపదొడగి ఏకసంతగ్రాహియై ఒకసంవత్సరములోపల సంగీతలక్షణ ములు రాగాలాపనము పల్లవి తాళము మొదలయిన సంగీతవిషయములో వీరికి సమానము ఎక్కడ లేరని విలసిల్లెను. ఇటు లుండునపుడు కాంచీపురమున నుండి పంచనదమునకు వచ్చియుండిన ఒక భాగవతోత్త మునివద్ద శ్రీరామనామ మంత్రోపదేశము బొందెను. ఆ భాగవతోత్తముడు తొంబది యారు కోటి నామముజేయువారు జీవన్ముక్తులగుదురనియు, నీవు అట్లు జేసితే ముక్తినందుదు వనియు అనుగ్రహించిన ప్రకారమే ప్రతిదినమును 1,25,000 నామమువంతునజేసి ఇరువదియొక సంవత్సరమున 96,0000000 నామముజేసి పూర్తిజేసెను. దీనికి పిమ్మట భగవంతుడైన శ్రీరాములు మూడుసార్లు ప్రత్యక్షమై సాహిత్యములు జేయునట్లనుగ్రహించెను. ఒకనాడు శ్రీరాముల సన్నిధానమందు గూర్చుండి నామముజేసుకొని యుండునపుడు వాకిలితలుపు సద్దు వినిన మాత్రమున గమనించి జూచుచో శ్రీ రాఘవులు లక్ష్మణ సమేతులై విశ్వామిత్రులతో యాగసంరక్షణార్థముగా వెడలి యేగుసమయముగా దర్శనమిచ్చి యొక నిమిషములో నంతర్ధా నముజెందెను. తోడనే ఒక ప్రయత్నమును లేక "బాలకనకమయచేల సుజన పరిపాల శ్రీరమా లోల" అను కీర్తనరూపముగా శ్రీరాముల స్తుతింప దొడంగెను. ఇదిగా ఈయన మొదటిసాహి త్యము. అఠాణారాగమున చమత్కారముగల వర్ణక్రమముతో నమర్చిన యీ కీర్తనమును వినిన సంగీతవిద్వాంసులును, అర్థపుష్టులతో నమర్చబడిన పదశయ్యల వినిన రామశేష శాస్త్రిలు, శ్యామం కృష్ణశాస్త్రిలు మొదలైన సంస్కృతపండితులును ఈయన గంధర్వుడో! నారదమునీం ద్రుడో! యనిభ్రమించి నుతించిరి. తరువాత "రామానిన్నే నమ్మినాను" అను హుశానికీర్తనము మొదలైన యనేకకీర్తనములు తెనుగు సాహిత్యముగా జేసుకొనివచ్చెను. ఇటులుండుతరి యొక నాడు నారదమహామునీంద్రులు సన్యాసివేషముతో ప్రాతఃకాలమున ఈ త్యాగరాజయ్య ఇంటికి వచ్చి యీతనిగని త్యాగరాజుడని యెవడో ఒకసంగీతవిద్వాంసు డున్నాడట. వానిగానము విన వలెనని వాంఛ నాకుగలిగియున్నది యనిజెప్పిన మాత్రమున తైలమంటుకొనియున్న త్యాగ రాజయ్య ఆ సన్యాసిని యుపచరించి నమస్కరించి నేనే త్యాగరాజుడని దెలియపరచి ఒక ముహూర్తకాలము గాంధర్వ గానమని యెంచునట్లు అమ్మునీంద్రులముందట గానముజేసెను. యతిశ్రేష్ఠులు ఉల్లమలరి నీకు సదృశముగా గానరసమెఱిగినవాడు యీ భువిలో నెవరును లేరని బలికి యీ పుస్తకము నీవద్ద నుండనీ యని యొకపుస్తకమునిచ్చి అనుష్ఠానముదీర్చి తిరిగి భిక్షకు వచ్చెదనని వెళ్లి యంతర్ధానమందెను. వెనుక నాయతిని యెక్కడ వెతకియు గానక చంచలబడి సూర్యాస్తమయ సమయముదాక ఆహారములేక నుండి రాత్రినిపూజజేసి నిద్రబోవుచో స్వప్నమున పగలందు యతివేషముతో దర్శనమిచ్చిన మహాపురుషుడు దోచి అయ్యా! నేను నారదుడు. నీదు విద్యామహిమ భక్తి అనుష్ఠానము వీనికి కట్టుబడి సంతోషచిత్తుడై పగటిలో నీకు దర్శనమిచ్చితిని

నేను నీకిచ్చిన పుస్తకము "స్వరార్ణవము" అనెడి సంగీతగ్రంథము. ఇదివరకు భూలోకంనబు నెవరు నెఱుగరు. నిన్నుదక్క నెవరు నీ గ్రంథంబును జూడ సర్థులుగారు. నీవలన సంగీతము ఈ భువిలో ప్రసిద్ధిపడపలెనను మనసుతో నీ స్వరార్ణవమును నీకు నిచ్చితిని. ఇక నీచంచలము నివృత్తి యౌను" అనిబలికి మఱుగు జెందెను. ప్రాతఃకాలమైన తోడనేలేచి తాను పుస్తకంబునుజూడ స్వప్నమున గన్నట్లే యుండగ పరమానందమునుజెంది "నారదగురుస్వామి" అను దర్బార్ కీర్తన మును "శ్రీ నారద నాదసరసీరుహ" అను కానడ కీర్తనమును శ్రీ నారద "నారదగానలోల"* అను అఠాణాకీర్తనమును జేసెను. స్వరార్ణవమను గ్రంథమును జూడంగ జూడంగ సంగీతము యొక్క అద్భుతమైన రాగరహస్యములన్నియు బయలుపడి యనేకఅపూర్వరాగములందును, మేళకర్తలందును సంగీతలక్షణము దప్పక భక్తిమార్గము కాస్పదమై సహస్రసంఖ్యగల కీర్తనముల రచించి బ్రహ్మానంద వైభవముల బొందినారు. ఇవి వ్రాయసాధ్యముగాని విషయము.

షట్కాల గోవిందదాసుల విషయము. ఇతడు గొల్లడు. కేరళదేశస్థుడు. గాన విద్యయందును భక్తియందును శ్రేష్ఠుడు. వీడు అద్దేశంబున వసించుకొని యుండునపుడు ఒకనాడు రాత్రిలో "పంచనదక్షేత్రంబున నాదుభక్తశిరోమణియైన త్యాగరాజుడు గానమూర్తియై వెలయుచున్నాడు. వానివద్దవెడలి వానినిదర్శించి నీదుగాన విద్యాసమర్థతయుచు, భక్తినిజంబును జూపించగలవు" అని శ్రీరాఘవులు స్వప్నమందాజ్ఞాపింప నారీతిగానే † త్యాగరాజయ్యను వెతకికొనివచ్చి తన గానంబును వినిపించి యతనిగానంబును విని పరమానంద భరితుడై, ఇతడు భక్తిజ్ఞానము సంగీత శాస్త్రము వీనిని పరిపాలనంబుజేసి నిజభక్తుల కనుగ్రహించుట కొరకై యవతరించిన ఈశ్వరాంశమైన మూర్తియేగాని వేఱులేదని గొనియాడి తానుగనిన స్వప్నంబును తక్కిన వృత్తాంతంబులు నెవరు నెఱుగునట్లుబలికి త్యాగరాజయ్యకు పాదపూజజేసి నమస్కరించి యనుగ్రహమునుబొంది పండ్రాపురిజేరెను. అవతల ఇదేతీరున గంగాతీరంబున నుండి యొక భక్తశిరోమణి స్వప్నంబుగని తిరువైయేటికివచ్చి అయ్యవారిని దర్శించి యనుగ్రహంబుజెంది తన వృత్తాంబు నెఱుగించినతోడనే "దాశరథీ" అను తోడికీర్తనము జూచెను. ఇట్లు త్యాగరాజయ్య యొక్క అమానుషకృత్యంబులు లోకమందెల్ల వ్యాపించగానే మైసూరు తంజావూరు మొదలయిన దేశాధిపతులు ఈతని జూచుట కిచ్ఛించి పత్రికలఁబంపగా శ్రీ రాఘవులదప్ప తక్కినవారికృప తన కపేక్షలేదని యసడ్డజేసెను.

---

*ఇది సరిగాతోపదు. ఈ కీర్తన అనుపల్లవి 'నీరదసమనీలా'అని. నారదునిదిధవళవర్ణము. పాఠాంతరము లభించువఱకును ఇది మేఘశ్యాముడైన శ్రీరామునిగూర్చినదే అనుకోవలయును (రా అ)

†షట్కాల గోవిందసామి తిరువైయేటికి వెళ్ళునపుడు ఎట్టయపురంమునకువచ్చి బాలస్వామి దీక్షితులచే మహారాజు భేటిచేయించుకొని వీరిభక్తికిమెచ్చి కొన్ని నెలలిచటనే భజనజేసుకొనియుండి తిరువైయేటికి వెడలెను.

ఒక సమయమున తంజపురి శరభోజి మహారాజు తిరువైయేటికి వచ్చినపుడు త్యాగరాజయ్యను జూచుటకపేక్షించి దూతలనంప దానికి సమ్మతింపక "నిధిచాలసుఖమా రామునిసన్నిధి చాల సుఖమా'' అను కీర్తనము జేసియు "రామా! ఇటులనెల్ల నన్నన్యులు హింసించక నన్నుగ్రహించ తగదా'' అను నర్థముగల వేఱొకకీర్తనమును జేసి పూర్తికరించెను. ఇటుల పలువిధంబులుగా నాయా సమయంబులకు తగినట్లును, తనకు అనుగ్రహంబు జేసినట్లును అనేకకీర్తనములు జేసి యున్నారు. వానిని విస్తరించి జెప్పుటవలన పెరుగును. శ్రీరంగమునకేగిన సమయంబున ''ఓరంగశాయి'' అనియు, ''రాజు వెడలెజూతాము రారే'' అనియు శ్రీ రంగనాథుల స్తుతిగా కీర్తనములును, తిరుపతికిబోయిన సమయమున ''తెరతీయగరాదా'' అనుకీర్తనమును జేసి యున్నారు ఒకనాడు ఇతని అన్నలు ఈయనయందు వందురంది రాజులుజెప్పియంపినప్పటికిని పోనని జెప్పుచున్నాడు. విద్యగలిగిన నేమిఫలము సంపదయంద పేక్షలేక నొకపట్టాభిషేక విగ్రహమును గట్టుకొని తిరుగుచున్నాడు. ఈ విగ్రహముండుట బాధగానున్నది'యని ఇతనికి దెలియక విగ్రహమునెత్తి బావిలోవేసిరి. అదిదెలిసి "ఏ పాపము జేసితినో" అను కీర్తనమును జేసెను. ఇటువంటి సహోదరులు నా తోబుట్టి భక్తి సేయ విడువక నన్ను శ్రమపరచెదరని మొఱబెట్టెను. "ఎట్లా దొరికితివో" అని వేఱొకకీర్తన రూపముగా రామా! చుట్టుకామడ దూరమువరకు నన్ను జేరినవారు భక్తిమార్గము దెలియనివారుగానుండ మీరు నాకులభించినది యెట్లనియు "ఎంత రాని తనకెంతబోని, చింత విడువజాల శ్రీరామా" అని పలు విధములుగా పాడియున్నారు. ఇట్లు ఈతని ఆయుష్కాలమంతయు ప్రతిదినమును తనచే సేయబడిన సత్కర్మానుష్ఠానములును భజనమును విలసిల్ల "కొలువమరెగా" అనియు కీర్తనము జేసెను. త్యాగరాజయ్యకు భగవంతుడైన శ్రీ రఘునాథులు అత్యంత స్నేహితునివలె స్నేహభావముగాను ఉత్తరప్రత్యుత్తర రూపములుగా కీర్తనములు జేసెను. శ్రీ రఘునాథులు మూడుసార్లు దర్శనమిచ్చియున్నారు. ఇతని నిర్యాణమునకు పదినెలల మునుపొకనాడు స్వప్నమున శ్రీరాములు దర్శనమిచ్చి యింక పదినెలలు నీవు ఈ భువినినుండవలెనని యాజ్ఞాపించినారట. మరుసటి దినము వేకువయందు మొదటి దిన స్వప్నమున తనకును శ్రీరాములకును జరిగిన విషయమును ప్రకాశపరచి ''గిరిపై నెలకొన్న రాముని" అని కీర్తనము జేసెను.* పదినెలలు జరిగిన పిమ్మట నొనదినమందొకనాడు స్వప్నమయి నీ కింకొక జన్మమున్నదని జెప్ప 'నేను ఇంతకాలము మిమ్ము నారాధించి పునర్జన్మ మందను' అనినతోడనే శ్రీ రఘునాథులు కనికరమున 'మరునాడు సన్యాసాశ్రమము దీసికొమ్ము, డాసిన దినమే నిన్ను ఐక్యము జేసికొందును' అని వాక్రుక్కుచ్చెను. ఈసంగతి నెవరికిని దెలియపరచి భగవంతుడాజ్ఞాపించిన ప్రకారమే మరుసటి దినమందు అనేక విద్వాంసులు, భక్తులు, సాధువులు గూడి

---

*ఈ కీర్తనమున ఇప్పటి పాఠము 'పది పూటలపై' అనికలదు. ఇట్లే 'పరితాపము కనియాడిన' అను కీర్తనమందు 'పదిపూటలపై కరుణించెద?' ననియే శ్రీ రాముని మాటగానున్నది (రా.అ)

యుండగ పరమహంసాశ్రమము దీసికొనెను. మరునాడుదయ కాలములో "సా(శ్యా)మ సుంద రాంగ" అని కీర్తనమును జేసి పాడి తన శిష్యులు, విద్వాంసులు, భక్తులు, లౌకికులు, వైదికులు అందరియందును ఆనాటి పగలు పదిరెండు ఘంటలకు తాను నిర్యాణము జెందుదుననియు, అటు లనే తనకు భగవంతుడు నియమించియున్నాడనియు దెలిపింప తిరువైయేటికి చుట్టుపక్కలను తంజావూరు మొదలయిన చోటులందునుండి ఈ వైభవములగని సంతసించుటకై లెక్కలేనిజనులు వచ్చిగూడిరి. త్యాగరాజయ్య జెప్పినకాలము సమీపింపగ ననేకుల గానమును, వైదికుల వేద ఘోషమును, బహుభక్తుల నామావళియును వ్యాపించియున్న సమయములో శ్రీ త్యాగరాజయ్య తననోటిచే 'భగవంతుడు నిర్ణయించిన కాలమిదిదా దీపారాధన సేయుడీ' అని యాజ్ఞాపించిన ప్రకారమే పట్టాభిరాములకు దీపారాధన జేసినారు. తోడనే తనవాక్కుచే "జానకీకాంతస్మరణే" అని నామావళిసేయ సకలజనులును "జయజయ రామా" అని జెప్పగ అంజలి హస్తములతో భగవంతునిముందర నమస్కరించిన పిమ్మట సకలజనులును సమీపించిజూడగ ప్రాణము విడిచిన వారుగా గనుబడిరి. తోడనే అనేక వైభవములతో తిరువైయేటి శ్రీ జానాస్వామి మెట్లగట్టున త్యాగరాజయ్య పుణ్యశరీరము నణగింపబడెను. వీరు డెబ్బదియేడవ వయస్సులో దేహవియోగ మైనారు. ఇతనికి పురుష సంతతిలేదు. ఈయన ముప్పదియైదవ వయస్సులో మొదటిభార్య లోకాంతరమందెను. పిమ్మట వివాహము జేసుకొన్న రెండవభార్య వీరికాలమునకు కొంగమునుపే ఒక ఆడుపడుచును విడిచిబెట్టి గతించెను. ఆ బాలికకు ఒక మగబిడ్డ కలిగెను. వానిపేరు త్యాగ రాజుడు. వాడు ముప్పదైదవ వయసున లోకాంతరముజేరెను. ఇప్పుడు సంతతి యొకరును లేరు.

సంగీత రత్నాకరములో ఏనూరు సంవత్సరములుగా వాడుకలోలేని లక్షణములును, వాడుకలోలేని రాగవివేకాధ్యాయమునగల రాగములును, లక్ష్యలక్షణ సమన్వయముగా వాడు కకుగొనివచ్చుట కొఱకు బద్ధకంకణులై రత్నాకరాది సంగీత గ్రంథములను ఊహాపోహముతో పరిశోధించి వ్రాసికొనియున్న కొత్తకోట మహారాజు కాలేజీ ప్రిన్సిపాల్ మహారాజరాజ శ్రీ యస్. రాధాకృష్ణయ్యగారి వలన, ఈ త్యాగయ్యగారి చరిత్రము ద్రావిడవచన రూపముగా నాకు యీయబడెను.

సంగీతశాస్త్ర ప్రథమాచార్యుడును, తారకమంత్రోపదేశకర్తయును, సదాశివస్వరూపు డైన శ్రీ త్యాగరాజస్వామియే పండితపామరజన సమూహముల నుత్తమగతి జెందజేయవలెనను అభిప్రాయముతో కమలాలయమను తనక్షేత్రమందే పైజెప్పిన త్యాగరాజయ్యగా నవతరించి సంగీతవిద్యాసారామృతములను శ్రీరాముల భక్తమార్గములను ప్రకాశింపజేసిరి.

## త్యాగరాజయ్య శిష్యులు

(1) గాయకోత్తములును, వైణిక శ్రేష్ఠులును, తెనుగున గేయచమత్కార ఫణు తులు వెలయ బహుతానవర్ణ కీర్తనముల విరచించిన మహానుభావులునైన తిరువత్తూరు వీణ

కుప్పయ్య. ఇతడు తన పుత్రునికి త్యాగయ్య అని తన గురువు పేరేబెట్టెను. ఈ త్యాగయ్య సంగీతమందును తెనుగందును ప్రజ్ఞగలవాడై కొన్ని తానవర్ణములును జేసినదిగాక "పల్లవి స్వర కల్పవల్లి" అనునొక పుస్తకము రచించి ముద్రింపించి ప్రకటీకరించెను. ఇతడిప్పుడునున్నారు.

(2) సంగీత విద్యాశిరోమణియైన శాలాజిపేట వెంకటరామ భాగవతులు. ఇతని వలన ననేక సౌరాష్ట్రులు సంగీతములో నేర్పరులై త్యాగరాజయ్య కృతుల ననేకములు పాఠముజేసి ప్రకాశపరచుకొనియున్నారు.

(3) అయ్యాభాగవతులు. (4) సుబ్బరామ భాగవతులు. (5) తిల్లస్థానం రామయ్యం గారు. (6) ఉమయాపురం కృష్ణభాగవతులు. (7) సుందరభాగవతులు. వీరిద్దరు నిప్పుడు నున్నారు.

## గోవిందసామయ్య

ఇతడు తైత్రిలింగ్య బ్రాహ్మణుడు. త్రిలింగభాషయందును, సంగీతమందును మంచి పాండిత్యముగలవాడు. ఇతని తెనుగుపదముల రచనలు మిగులనల్లికతోను శృంగారరస ప్రధాన ముగానుండును. కావేటినగర సంస్థానాధిపతులమీద జూచిన మోహనరాగమందొక వర్ణమును, పైజెప్పినట్లే దైవములమీద నవరోజు, కేదారగౌళ రాగములలో జూచిన వర్ణములును మిక్కిలి ప్రసిద్ధముగా విలసిల్లుకొనియున్నవి. గోవిందసామయ్య ఆదిప్పయ్యగారికి మునుపటివాడనియు, ఉనికి కావేటి నగరమనియు జెప్పుచున్నారు.

## కూవన సామయ్య

ఇతడు సంగీతాంధ్రరచనలందు మిక్కిలి ప్రౌఢుడు. ఈతనిచే నాటకురంజి రాగములో జేయబడినయొక తానవర్ణము మాత్రము ప్రసిద్ధమైయున్నది. ఇతనిని పైజెప్పిన గోవింద సామయ్య సహోదరుడని జెప్పుచున్నారు.

## వైకుంఠశాస్త్రులు

ఇతడు ద్రావిడ బ్రాహ్మణుడు. సంస్కృతభాషలో కావ్యనాటకాలంకారములు వ్యాక రణాదిశాస్త్రములు సంగీతము ఈ విద్యలలో నసాధారణ మహిమగలవాడు. సంస్కృత వాగ్గేయ కారులలో శ్రేష్ఠతముడు. ఇతడు సంస్కృతములో గేయకల్పనలతో రక్తిదేశీయ రాగములందు బహుకీర్తనములు జేసియున్నాడు. ఇతడు చోళదేశస్థుడనియు, రామస్వామి దీక్షితులకు సమ కాలీయుడనియు జెప్పుచున్నారు. "వైకుంఠ" ముద్ర ఇతని కీర్తనములందు గనుబడును.

## విజయగోపాలులు

ఈ విజయగోపాలం అనువారు మహాభక్తులు. సంస్కృతాంధ్ర సంగీతములలో నతిసమర్థులు. భక్తిరసములొలుకునటుల "విజయగోపాల" ముద్రతో సంస్కృతాంధ్ర సాహిత్యకీర్తనములు పెక్కులు గనుబడుచున్నవి. ఈయన 200 సంవత్సరములకు మునుపు గలవారని జెప్పుచున్నారు. విచారణీయము.

## కుప్పుస్వామి అయ్య

ఇతడు ద్రావిడబ్రాహ్మణుడు. తెనుగున మంచి ప్రజ్ఞగలవాడు. ఇతడు అమరసింహ మహారాజు కాలమందును, శరభోజి మహారాజుయొక్క ఆరంభదశయందు నుండినట్లు జెప్పుచున్నారు. ఇతని కీర్తనములు భక్తిరసవ్యవహారములు గలిగియుండును. శృంగారరస ప్రధానములైనకొన్ని పదములు జెప్పియున్నాడు. గేయకల్పనలు మిక్కిలిచమత్కారముగాను పదలాలిత్యములతోడ "వరద వేంకటేశ" అను ముద్రతోను వెలయును.

## పల్లవి గోపాలయ్య

ఇతడు ద్రావిడ బ్రాహ్మణులలో నుత్తరుడు. తంజపురియే ఇతనికి వాసస్థానము. సంగీతమునందును తెనుగునందును విశేషప్రజ్ఞగలవాడు. గాయకులలో నేపండితుడును ప్రతిభతో పల్లవిపాడుటలో నితనికి సమానముగాలేనందున పల్లవి గోపాలయ్య అని ప్రసిద్ధిగలిగెను. ఇతని సంగీతకల్పనా చమత్కారములు అట తాళములో నితనివలన సేయబడిన "వనజాక్షి" అనుకళ్యాణి తానవర్ణమును గమనించితే ఒరిక మొదలయిన గమకములు స్వరకల్పనల శయ్యయుస్పష్టమగును. ఇదిగాక కాంభోజి తోడిరాగములలో అటతాళమందు తానవర్ణములు, కొన్ని రక్తిరాగములలో కీర్తనములు "వెంకట" అను ముద్రచే రచించి యశముబొందెను. ఇతడు అమరసింహ నరేంద్రుని కాలమందును శరభోజి మహారాజు కాలములో బహుకాలము నుండెను.

## ముద్దుస్వామి దీక్షితులు

ఇతడు రామస్వామిదీక్షితులకు శకాబ్దము 1697, క్రీ. శ. 1775 మన్మథ సంవత్సరమున తిరువారూరిలో పుత్రుడై జనించెను. ఇతని తల్లి సుబ్బమ్మ. పదియారువయసులోపల క్రమాంతము వేదాధ్యయనము, కావ్యనాటకాలంకారము కౌముదియు, కొన్ని వ్యాఖ్యానములు సంగీతమును నేర్చుకొని, జ్యోతిషము వైద్యము మాంత్రీకము ఈశాస్త్రములందు మిగులప్రజ్ఞగలవాడై ప్రఖ్యాతినొందెను. ఇతడు వివాహమై మణలి చిన్నయా మొదలారివద్దనున్నప్పుడు ఇతనిజన్మాంతర సుకృతవిశేషమువలన చిదంబరనాథయోగి యనునొక మహాసిద్ధులు మణలికివచ్చి కొన్ని దినములుండినప్పుడు ఇతనిభక్తికి సంతసిల్లి (శ్రీ)విద్యామహామంత్రము నుపదేశించి వెంటబెట్టుకొని

గంగాతీరమునకుచని ఐదువర్షములవరకు క్రమముగా మంత్రావృత్తిచే సిద్ధిబొందించి అష్టమహా సిద్ధుల నందజేసి యితను మహాపురుషునిగా నెఱిగి యనుభవముతో వేదాంతశాస్త్రమునుపదేశించిన తరువాత నామహాత్ముని యనుమతివలన తిరిగి మణలికివచ్చి దేవతలతృప్తికై క్రమముగా అంత ర్యాగ బహిర్యాగముల నడిపించి తిరుత్తణిక్షేత్రమునకువచ్చి సన్నిధిలో సుబ్రహ్మణ్య పంచదశా క్షరీమహామంత్రము నావృత్తిజేసుకొనియుండునపుడు ఒకదినమందు చెంగల్వరాయడు ఒక మహా పురుషునివలె వచ్చి నోరుదెరుచుమని జెప్పి నోటిలో కండచక్కెరనువేసి మఱుగుజెందెను. తోడనే దీక్షితులు మాళవగౌళరాగమున ప్రథమావిభక్త్యంతముగా "శ్రీనాథాది గురుగుహో జయతి" యని మొట్టమొదట సంస్కృతమున కీర్తనముజేయ ప్రారంభించెను. ఇదిగాక సంబుద్ధి ప్రథమ మొదలుకొని యేడుకీర్తనములు గురుగుహవిషయముగా జేసినారు. తరువాత కాంచీ పురమునకువచ్చి తన సహోదరులతో నాలుగుసంవత్సరములవరకు నచ్చట వసించుకొని శ్రీకామాక్షీ సన్నిధానమందు శ్రీవిద్యాఉపాస్తి జేసుకొని "కంజదళాయతాక్షీ" "ఏకామ్రనాథం భజేహం" మొదలైన అనేకకీర్తనములు గేయకల్పనలు విలసిల్ల విరచించి తనతమ్ములచే ప్రసిద్ధిపరచెను. ఆ క్షేత్రమున వసించుకొనియుండిన ఉపనిషద్బ్రహ్మముతో వేదాంతవిచారణ జేసుకొని యతనిచే సేయబడిన రామాష్టపదులకు వర్ణక్రమములతో రాగతాళములనేర్పరచెను. పిమ్మట కుటుంబము తో తిరువారూరికివచ్చి వసించునప్పుడు "గురుగుహ" ముద్రతో శ్రీత్యాగరాజస్వామిమీద ననేక కీర్తనములును, ఆనందేశ్వర, సిద్ధేశ్వర, అచలేశ్వర, హాటకేశ్వర, వల్మీకేశ్వరులమీదను, ఆక్షేత్ర మందున్న షోడశగణపతులమీదను, చోళమండలమున వెలయు శివక్షేత్ర విష్ణుక్షేత్రములగల దేవ తలమీదను పృథ్వ్యాదిపంచభూతక్షేత్రస్వాములమీదను, సంస్కృతమం దసాధారణములైన వాగ్ధోర ణులతో నద్వైతభావన దప్పక వెంకటమఖి సంప్రదాయ రాగముల విడువక గమకజాతీయములు, ఆయారాగజీవస్వరములు రాగనామము విలసిల్ల కీర్తనములు రచించినదిగాక సూళాది సప్తతాళ ములలో సేయబడిన నవగ్రహకీర్తనములను, కమలాంబావిషయమై నవావరణ పూజాక్రమముగా తొమ్మిది కీర్తనములును రచించి తనశిష్యులచే జగత్ప్రసిద్ధిగా నాచంద్రతారార్కముగా విలసిల్లు నట్లుజేసెను. తనతమ్ములు తనవద్దనుండి కీర్తనముల పాఠముజేసుకొనియుండునపుడు రసికులైన ప్రభువులచే మధురకు రమ్మనివచ్చిన పత్రికలవలన చిన్నసామి బాలసామి మధురకువచ్చి కొన్ని సంవత్సరములుండగా చిన్నసామిదీక్షితులు కాలముజెందెను. బాలస్వామిదీక్షితులు భ్రాతృవియో గమువలన విరక్తిజెంది హారియను శిష్యుని వెంటబెట్టుకొని సేతువునకువెడలి ఎట్టయపురమునకు వచ్చి మహారాజుచే నాదరింపబడియుండెను. దీక్షితులు తనభ్రాతృవియోగము లోకస్వభావమని దలంచి తనపినతమ్ముని సంతతిగా భావించుకొనియుండుటచేత తనతమ్ముడు విరక్తిచే నెక్కడ వెడలెనోయని చింతించుకొని తనభార్యలిద్దరితో శిష్యుడైన సుబ్రహ్మణ్యయ్యను తోడబెట్టుకొని మధురమార్గముగా శాత్తూరికివచ్చి శాత్తూరిపెరుమాళ్ళ గుడివాకిలిమంటపమున దిగి పూజచేసుకొని

యున్న సమయమున పదియారేండ్లుగల కొన్ని వైష్ణవబ్రాహ్మణులు ఎట్టయపురం మహారాజు వారు తిరువారూరిలోనుండివచ్చియున్న బాలస్వామియను నొక విద్వాంసునికిని రామేశ్వరములో నుండి రప్పించిన పడుచునకును రేపు వివాహము జరుగబోతున్నది. మనమందరముపోదమురండీ యనిజెప్పిన మాటవిని దీక్షితులు సంతోషపరవశులయి పెరుమాళ్లు సన్నిధియందే "వెంకటేశ్వర ఎట్టప్పభూపతిమాశ్రయేహం" అని మేఘరంజనిలో నొకకీర్తనముజేసి సుబ్రహ్మణ్యయ్యకుజెప్పి పెట్టెను. పిమ్మట నచ్చటనుండు వైష్ణవబ్రాహ్మణులజూచి ఎట్టయపురమునకు మమ్మును వెంట బెట్టుకొనిపొండీయనిజెప్పి వారలతో వెడలి ఎట్టయపురమునకు వచ్చుమార్గములో వానలేక వాడుచున్న పంటనుగని కనికరముగలిగి అమృతేశ్వరిని ధ్యానించి అమృతవర్షిణిరాగమున "ఆనందామృతకర్షిణి అమృతవర్షిణి'' అను కీర్తనమును రచించి తనశిష్యునికి జెప్పిబెట్టుకొని యుండునపుడే నిర్మలమైన ఆకాశమందు నీలమేఘ మొకటి దోచబడి రానురాను నభివృద్ధియై సయిచని వర్షము గురిసెనట. రేకటినేలగనుక బండిపారకనిలిచె. తనతోడవచ్చిన వైష్ణవబ్రాహ్మణులచే బండితోలబడి సంకటపడుకొని మెల్లమెల్లగ ఎట్టయపురమునకు సాయంకాలమువచ్చి చేరి తనతమ్మునిగని సంతసిల్లిరట. దీక్షితులవారు వచ్చినది తెలిసి మహారాజువారు తనచేకట్టి ఈయబడిన యింటికివచ్చి దీక్షితులవారిని యుపచరించి వారిచేజేయబడిన మేఘరంజికీర్తనమునువిని చాలా సంతసిల్లి మరునాడువచ్చి పెండ్లిని నడిపించిరి. పెండ్లి నడచినతోడనే దీక్షితులు తమ్మునిభార్యకు తోడుగ తన పెద్దభార్యనుంచి మహారాజువారి నంపించుకొని తిరువారూరికి వెడలి యచ్చట వసించెను. కొంతకాలమునకు పిమ్మట ఎట్టయపురమున మహారాజువారి జేష్ఠకుమారులకు జరుగు పెండ్లికై రమ్మని వచ్చిన పత్రికనుజూచి తనకవసానకాలము సమీపించియుండుటవలన తనస్నేహితులు శిష్యులు మొదలగువారివద్ద తిరుగరానని అంపించుకొని కుటుంబముతో ఎట్టయపురమునకు వచ్చి యువరాజుపెండ్లిజరిగిన మూడవనెలయైన శకాబ్దము 1757, క్రీ. శ. 1835 మన్మధసంవత్సరము తులాకృష్ణ చతుర్దశియందు యశఃకాయులై స్కందగిరిచేరిరి. ఈ ముద్దుస్వామిదీక్షితులు ఈ గ్రంథకర్తయొక్క పెత్తండ్రి.

## ముద్దుస్వామి దీక్షితులవారి శిష్యులు

(1) సంగీత ద్రావిడ పండితులైన తిరుక్కడయూరుభారతి. (2) ఆవడయారు గుడివీణ వెంకటరామయ్య, (3) తేవూరు సుబ్రహ్మణ్యయ్య, (4) సంగీతమృదంగ లక్ష్యలక్షణములలో సమర్థుడైన తిరువారూరు శుద్ధమృదంగం తంబియప్పడు, (5) భరతశ్రేష్ఠుడైన పంజపురి పొన్నయ్య, (6) వడివేలు, (7) భరత లక్ష్యలక్షణసమర్థుడైన కొరనాడు రామస్వామి, (8) నాగస్వరవాద్యమందలి ప్రతిభగల తిరువళుందూరు బిల్వవనం, (9) బహుతానవర్ణపదముల రచించిన తిరువారూరు అయ్యాసామి, (10) నాట్యగానవిద్యలో మిక్కిలి కీర్తిజెందిన తిరువారూరు కమలము, (11) గానమున సమర్థురాలైన వళ్ళలారుగుడి అమ్మణి.

## చిన్నసామి దీక్షితులు

ఇతడు ముద్దుస్వామి దీక్షితులసహోదరుడు. సంస్కృతాంధ్రభాషలలో మంచిచదువరి. సంగీతవిద్యలో ప్రగల్భుడు. వైణికశ్రేష్ఠుడు. జంత్రగాత్రములుగల మహానుభావుడు. మణలి చిన్నయామొదలారి సభయందును, తక్కినరాజసభలందును విశేషగౌరవము జెందిన యశోవంతుడు. ఇతడు తిరువారూరిలో కుటుంబముతోవచ్చి వసించుచున్నపుడు రసికులైన ప్రభువులు, పండితులు మొదలైనవారు వచ్చియున్నసభలో నొకరాత్రియందు "నాగవరాళి" అను రాగము నాలాపించుకొనియున్నపుడు ఇతని యెదుట నొకపెద్ద సర్పము పైగప్పుననుండిబడి పడగనెత్తి యాడుకొనియుండుచో జనులందరు వెఱవ నచ్చటనున్న దీక్షితులు 'వెఱవవద్దు వీణను నిలుపక వాయించవలె'నని జెప్పినట్లే వాయించుకొనియున్నపుడు, ఆ పాము జానెడు పొడుగు పడగనెత్తి యాడి శ్రమపడి రాగ రాగ తగ్గించుకొని భూమితో పడగనుజేర్చినదిజూచి "అందరును నమస్కరింపుడు వీణనుబెట్టి నమస్కరింపుము" అని దీక్షితులు జెప్పినట్లే నమస్కరించినారు. తోడనే సర్పము బోయెను. ఈసంగతి కనులారజూచిన సుబ్రహ్మణ్యయ్య మొదలైన దీక్షితులవారి శిష్యులు జెప్పుదురు. ఇతడు నారదులమీద తోడిరాగమున "గానలోల కరుణాలవాల" అనియు, కళ్యాణిరాగమున "నారాయణానంత" అనియు రెండు కీర్తనములు జేసియున్నారు. ఇతడు తనతమ్మునితో మధురకువచ్చి 45 వ వయసున లోకాంతరము జెందెను.

## బాలస్వామి దీక్షితులు

ఇతడు రామస్వామి దీక్షితుల మూడవ పుత్రుడై శకాబ్దము 1708, క్రీ. శ. 1786 పరాభవసంవత్సర మిథునరవి అశ్వినీనక్షత్రములో కన్యాలగ్నమున జనించెను. ముద్దుస్వామి దీక్షితులవారి కనిష్ఠ సహోదరుడు. బాలకృష్ణ శర్మడు. తెనుగున మంచి ప్రజ్ఞగలవాడు. సంగీతములో మిక్కిలి సమర్థుడు. వీణ, స్వరబత్తు, ఫిడిలు, చితార్, మృదంగము మొదలైన వాద్యములు వాయించుటయందు మిక్కిలి సమర్థుడు. సంగీత లక్ష్య లక్షణ మర్మముల లెస్సయెఱిగినవాడు. ఇతని బాల్యమందే మణలి చిన్నయా మొదలారువారు ఫిడిల్ వాద్యమందలి సమర్థుడైన యొక ఆంగ్లేయునివద్ద మొదట ఫిడిల్ అభ్యసింపుమని యితని నేర్పరచెను. మూడు సంవత్సరములభ్యసించి ఆంగ్లేయసంగీతమును, హిందూసంగీతమును లెస్సవాయించి మణలి మొదలారు మొదలయిన రసికుల తృప్తిబొందించెను. ఇతనిబాల్యములో నొకనాడు మొదలారి సభయందు సొంటి వెంకట సుబ్బయ్య టక్కారాగగీతతానములు వాయించి మొదలారిని జూచి 'ఈరాగము మా యింటిలోదాకద్ద' ని చెప్పినమాత్రమే చిన్నవయసుతో నా సభయందుండిన బాలసామి దీక్షితులు మొదలారిని గని 'ఈ టక్కారాగగీతమును నేనిదో పాడెద వినుడీ' యని "అరమర్జు అపరాధ" అని పాడినతోడనే ఒక ముత్యాల కంఠియును, జోడుసాల్వలును యిచ్చి బహుమానించెను.

కొంతకాలమునకుపిమ్మట మహాప్రౌఢులైన తన అన్నలతో కంచి మొదలైన క్షేత్రములందు వసించి తిరువారూరికివచ్చి యచ్చట కొన్ని సంవత్సరములుండి, తనవద్ద బాల్యము మొదలుకొని యుండిన హరి అను శిష్యునితోడను, తన రెండవ అన్నతోడను మధురకువచ్చి కొన్నాళ్ళుండి, తన అన్నకాలమునకు వెనుక హరిని వెంటబెట్టుకొని సేతువునకువెళ్ళి ఎట్టయపురమునకువచ్చి మహారాజునిగని, అప్పటికాలములో క్రొత్తవాద్యమైయున్న ఫిడిలును వాయించగా మహారాజు వారు సంతసిల్లి బహుమానించి యీతని సంగీత లక్ష్య లక్షణసామర్థ్యములను, వీణవాయించు మేలిమియునుగని ఇల్లుగట్టియిచ్చి తన ఆస్థానపండితులుగా నియమించి, రెండవ పెండ్లిజేసిపెట్టిరి. అప్పటి మహారాజు మొదటికుమారులైన కుమారఎట్టప్పమహారాజు ఈతనివలన సంగీతలక్ష్య లక్షణ ములనెఱిగెను. ఆమహారాజేపట్టాభిషిక్తులై సంస్కృతభాషలో బహురాగములందువర్ణక్రమములతో రచించిన కీర్తనములకు బహుచమత్కారకల్పనలుగల ముక్తాయిస్వరములు మహారాజువారు సంతసిల్లు నట్టితడేరచించినది గాక శ్రీగృధ్రాచల కార్తికేయవిషయమై సారంగ దర్బార్ కన్నడ రుద్రప్రియ రాగములలో తెనుగునకీర్తనములు జేసెను. జ్యోతిశ్శాస్త్రిములో మహాప్రౌఢులైన కుమార ఎట్టప్పమహారాజునసుమతిచే దౌహిత్రుడయిన నన్నుస్వీకరించి బ్రహ్మోపదేశముజేసిపెట్టి, వీణను నేర్పించి సంగీతలక్ష్యలక్షణములన్నియుదెలియజేసెను. కుమారఎట్టప్పమహారాజుమీద నాటరాగ ములో అటతాళమందు ఒకతానవర్ణ మురచించి, యీతానవర్ణమునగల ప్రతిస్వరములును బహు చమత్కృతితోనుండునట్లును, కడపటినాలుగావృత్తస్వరములో నాలుగుజాతులును క్రమముగా ఒక్కొక్క ఆవృత్తమందు నిమిడించియుండునట్లును స్వరమురచించిన తానవర్ణమును మహారాజు వారువిని వేయివరహాలు విలువగల కెంపులుచెక్కబడి సింహాలలాటముగల జోడితోడాలు బాలస్వామి దీక్షితుల రెండుచేతులలోదొడిగి జోడిసాలువబట్టలిచ్చిబహుమానించిరి. వర్ణముపాడినశిష్యులకు బహుమానమిచ్చిరి. ఆమహారాజునకుపిమ్మట నతనిసహోదరులు పట్టాభిషిక్తులై యితనివద్దనే సంగీతవిద్యనేర్చినవారై గాంధర్వస్వరూపులైన వెంకటేశ్వర ఎట్టప్పమహారాజుమీద రుద్రప్రియ, దర్బార్ వసంత యీరాగములలో పాటవసంబంధములైన ముక్తాయిస్వరములతో జూచినదరువులను మహారాజువారువినిదరువొకటికి జోడుసాల్వలును వెయ్యేసివరహాలునుఇచ్చి సమ్మానించిపోషించిరి. ఇతడు ఏకాదశితప్పక గీతగోవిందము ( అష్టపది ) పాడి భగవద్భజనజేసుకొనియుండును. ఇటు లుండగ నొకఉపాధియులేకనే శకాబ్దము 1781, క్రీ. శ. 1859 పింగళసంవత్సర కుంభరవిశుక్ల తృతీయయందు పరమపదము జెందెను.

## చౌకం సీనువయ్య

ఇతడు ద్రావిడబ్రాహ్మణుడు. సంగీతమందలిచతురుడు. ఇతనివలెచౌకముగా ( విళంబ ముగా ) రాగాలాపనము మొదలైనవి పాడుటలో నింకొకగాయకునివలకానేరదు. గనుక అప్పటి

ప్రభువులు పండితులు ఇతనికి చౌకముసీనువయ్యాఅనిపొగడిరి. ఇతడుశరభోజిమహారాజు కాలమందును, శివాజిమహారాజుని ఆరంభకాలమందునుండెను.

## దొరసామయ్య

ఇతడు ద్రవిడబ్రాహ్మణులలో నౌత్తరుడు. సంగీతమందును తెనుగునందునుపండితుడు. ఇతనికీర్తనములు "సుబ్రహ్మణ్య" ముద్రతో మిగులరంజనమును సులభశైలియునుగానుండును. ఇతడు శరభోజిమహారాజుకాలమందును, శివాజిమహారాజు ప్రారంభమందును పంచనదక్షేత్రమందు వసించియుండెను.

## మధ్యారుజనం ప్రతాపసింహ మహారాజు

తంజపురినేలిన అమరసింహామహారాజుకుమారులు. సంస్కృత మహారాష్ట్రి భాషా విచక్షణులు. సంగీతమందుమిగుల ప్రజ్ఞగలవారు. మృదంగవాద్యములో నతిసమర్థులు. ఈయన మహారాష్ట్రిభాషలో వర్ణక్రమములు విలసిల్ల "నవరత్నమాలిక" యను రాగతాళమాలిక యొకటి స్వరచమత్కృతులతో జేసియున్నారు. ఈమహారాజు శివాజిమహారాజునకు కొన్ని సంవత్సరములకుముందు కాలము జేసిరి.

## కులశేఖర పెరుమాళ్

ఈ కిరీటపతి తిరువనంతపురం సంస్థానమును పరిపాలించిన మహారాజు. ఈ కేరళదేశాధిపతి సంస్కృత ఆంధ్ర, హూణ, కేరళ, హిందుస్తానాద్యనేక భాషలనేర్చినసమర్థులు. సంగీతమందు విశేష ప్రతిభగలవారు. అనేకరక్తిరాగ దేశీయరాగములలో గేయకల్పనా చాతుర్యములు విలసిల్ల సంస్కృత సాహిత్యరూపములైన చౌకవర్ణములు సంఖ్యలేని కీర్తనములు "పద్మనాభ" ముద్రతో విరచించిన మహాత్ములు. సంస్కృతమందు చంపుమొదలయిన బహుకావ్యములు రచించి యున్నారట. తెనుగున చౌకవర్ణపదములు జేసియున్నారు. కేరళభాషయందును బహుకృతులు జేసియున్నారు. ఈపద్మనాభదాసులు శ్రీపద్మనాభ పాదారవిందైక్యమయి రమారమి యేబదియేండ్లగుచున్నది.

## వెంగు భాగవతులు

ఇతడు ద్రావిడ బ్రహ్మణులలో నౌత్తరుడు. ఇతని ఉనికి తిరునెల్వేలి. తెనుగునందును, సంగీతమందును విశేష ప్రజ్ఞగలదు. ఇతనికి ప్రాచీన కీర్తనములు సంఖ్యలేక పాఠములుగలవు. రాగాలాపన పల్లవి స్వరములు లెస్సపాడును. ఇదిగాక దరు, తానవర్ణములు రచించినాడు. మహాభక్తుడైన ఇతడు డెబ్బదియేండ్లవరకు జీవించియుండి గతించిన ఆనంద సంవత్సరములో లోకాంతరమొందెను.

## శేషాచల భాగవతులు

ఇతడు కొత్తకోట సంస్థాన గాయకపండితుడు. శ్యామాశాస్త్రిలశిష్యుడు. గానమందతి సమర్థుడు. తెనుగున గేయరూపముగా కృతులుజేసియున్నాడు. ఈతని సహోదరులైన రామ దాసులు సంగీతసాహిత్య విద్యావిశారదుడు. తెనుగున గేయకల్పనలుచెలగ "రామ" ముద్రతో జేసిన కీర్తనములుగలవు. ఇతనికుమారుడు మాతృభూతయ్య. ఇతడు సంగీతవిద్యాసంపన్నుడు. ఇతని కుమారుడు గోపాలసామిఅయ్య. ఇతడు సంగీత లక్షణ లక్ష్యముల నెఱిగిన గొప్పగాయ కోత్తముడు. ఇతడిప్పుడును కొత్తకోట సంస్థాన సంగీత విద్వాంసుడుగా నున్నాడు. ఇప్పటికాల ములో సంగీతజ్ఞులు ఇతనివలె ప్రాచీనకీర్తనములుగాని, పల్లవి మార్గములుగాని, ఆయారాగజీవ ములుచెలగ గమకజాత్యములతో పాడేవారెవ్వరును లేరని జెప్పవచ్చును.

## రామానంద యతీంద్రులు

ఈ రామానందయతులు సంస్కృత సంగీత రచనాసామర్థ్యములు గలిగినవారు. ఈయనవలన సేయబడిన గౌరీరాగ ప్రబంధమును గమనించితే యితనిపాండిత్యము స్పష్టమగును. అహోబల పండితునికి వెనకటివారని దోచుచున్నది.

## నారాయణ తీర్థులు

మహాశక్తిగల యీయతీంద్రుల సంస్కృత సంగీతసాహిత్య ఫణుతులు ఈయనవలన విర చింపబడిన తరంగములచే విశదమగును. వీరు 300 సంవత్సరములకు ముందుండినవారనియు నుత్తర దేశస్థులనియు జెప్పుచున్నారు.

## సదాశివబ్రహ్మము

అమరావతీ తీరమందుగల కరువూరందును, కావేరీతీరమైన నెరూరు కొడుముడి మొద లైన పుణ్యక్షేత్రములందును 163 సంవత్సరములకు మునుపు దిగంబరులై సంచరించు జ్ఞానపరు లైన సదాశివబ్రహ్మము అను మహాపురుషులు బ్రహ్మానంద పరవశులైయున్న సమయములందు గేయవాగ్రూపముగా సంస్కృత కీర్తనములనేకము జేసియున్నారు. అవి యిప్పుడును ప్రసిద్ధ ముగానున్నవి. ఇతనియద్భుత చరిత్రముల నేకములు గలవు. క్రీస్తుశకము 1890 అక్టోబరు నెల 20 తేదీలో కొత్తకోట సంస్థానమున బ్రహదంబా విలాసయంత్రశాలలో సదాశివబ్రహ్మము యొక్క చరిత్రము ద్రావిడవచనరూపముగా నచ్చొత్తబడియున్నది, ఆచరిత్ర పుస్తకమునుజూచితే ఈమహా పురుషుని మాహాత్మ్యము స్పష్టమగును. ఈమహాత్ముల పరమానుగ్రహమువలననే కొత్తకోట సంస్థానము రానురాను మిక్కిలి శ్రేయస్సును పొందుకొనియున్నది. ఈ సంస్థానరాజులవలన నేటి కిని నెరూరిలోనున్న ఈమహాపురుషుని సమాధికి సంవత్సరోత్సవ నిత్యోత్సవపూజలు నడిపించుకొని

వచ్చుచున్నవి. ఈయన ఆజ్ఞచొప్పున ప్రతిశుక్రవారమును కన్యకలకు స్వయంపాకమును, ప్రతి సంవత్సరమును బహుద్రవ్య వ్యయముతో నవరాత్రిపూజా సంతర్పణలును ఇప్పుడును నడుచుకొని వచ్చుచున్నవి.

## అక్కిళ్ స్వాములు

ఈ యతీంద్రులు రమారమి అఱువది సంవత్సరములకు మునుపుండినవారుగా జెప్పుచున్నారు. శ్రీకృష్ణభక్తులు. వీరుచిదంబరమునకు సమీపమున కొళ్లడమను కావేరీ తీరమందు గలయొక అగ్రహారములో తన జన్మాంతర కర్మవశమున ఒడలంత ప్రీలి ఉపాధిచే కష్టపడుకొని బహుదినములుండునపుడు, ఒకనాడు తన శిష్యులజూచి ప్రాతఃకాలమందు నన్నెత్తుకొనివెడలి కొల్లడయేటి యిసుకదిబ్బలో విడిచి సాయంకాలమువచ్చి నన్ను జూడుడీయనిన తోడనే శిష్యులట్లే విడిచి వచ్చిరి. ఆయతీంద్రులు మనసున శ్రీకృష్ణునిధ్యానించి "తావక కరకమలే" అనుకీర్తనము కళ్యాణిరాగమున రచించిపాడి భజించుకొనియుండుచో భగవంతుని కృపచే ఎండతగ్గుకొని వచ్చునట్లితడుయుపాధితీరిన శరీరముతో నుండునపుడు, శిష్యులువచ్చి యతీంద్రులను జూచి సంతసించి నమస్కరించి తమ యగ్రహారమునకు దోడ్కొనిపోయిరి. పిమ్మట అక్కిళ్‌స్వామి తనవలన సంస్కృతమున సేయబడిన కీర్తనములచే బహుకాలము భగవంతుని భజించుకొనియుండి సిద్ధిబొందెను.

## స్వయంప్రకాశయతీంద్రులు

సంస్కృత ఆంధ్రభాషలలో నతిపాండిత్యముగలవారు. సంగీతమందును అతిసమర్థులు. ఈయనచే సేయబడిన సంస్కృతకీర్తనములచే ఈతనివాగ్గేయఘణుతులు తేటయగును. ఏబది సంవత్సరములకు మునుపు మాయూరక్షేత్రములో వసించినవారు.

## శివరామాశ్రములు

ఈయతీంద్రులు రామనాథపురశాఖానగరమైన లక్ష్మీపురమున తైలింగ బ్రాహ్మణకులములోజన్మించి మరుదానల్లూరిస్వాములవారి శిష్యులై భక్తిమార్గకీర్తనములు, భాగవతోత్సవ సంప్రదాయ కీర్తనములు, అష్టపది, ద్రావిడరామాయణకీర్తనములు, సంస్కృతకావ్యములు నభ్యసించి ఇరువదేండ్లలో యతులై సకలక్షేత్రములదర్శించుకొని తిరువారూరికివచ్చి త్యాగేశ్వరునిపై గల భక్త్యాతిశయముచే యజ్ఞేశ్వరుని ఘట్టమునవసించుకొని సంస్కృతమందును తెనుగందు ననేక కీర్తనములు జేయుటయేగాక, గాంధర్వరూపముగా "నిజభజన సుఖపద్ధతి" అనునొకపుస్తకమును రచించి చెన్నపురిలో అచ్చొత్తబడి ప్రసిద్ధపరచి తిరువారూరియందే క్రీ. శ. 1897లో సిద్ధిబొందెను. ఈ శివరామాశ్రములు డెబ్బదియేండ్లుండెను.

## యువరంగుని పదములు

ఇవి తుళజామహారాజుకాలములో రసికాగ్రేసరుడై, వితరణశీలుడై, ఉడయార్పాళయ సంస్థానాధిపతియై వెలసిన యువరంగేంద్రునిమీద గేయకల్పనలతో తెనుగున ననేకవాగ్గేయకారులచే సేయబడినపదములను యువరంగునిపదములని జెప్పుచున్నారు.

## పరిమళరంగడు

"పరిమళరంగ" ముద్రతో గేయకల్పనలు విలసిల్లి తెనుగున ప్రాసయమకములతో పదములురచించిన గొప్పపండితుడు. ఈతడు చెన్నపట్టణమున కవతలిదేశస్థుడనియు, 200 సంవత్సరములకులోపలివాడనియు జెప్పుచున్నారు.

## సారంగపాణి

ఇతనిపదములు శృంగారరసముగాను, హాస్యరసముగాను పెక్కులుగలవు. హాస్యరస ప్రధానమైనపదములలో గ్రామ్యోక్తులుపెక్కులుగలిగి "వేణుగోపాల" ముద్రతోనుండును. ఇతడు 200 సంవత్సరములకులోబడు ఉత్తరదేశీయుడైన తెనుగుబ్రాహ్మణుడు.

## మెరటూరు వెంకటరామశాస్త్రులు

ఇతడు త్రైలింగ్యబ్రాహ్మణుడు. తంజావూరికిసమీపముననున్న మెరటూరిగ్రామవాస్తవ్యుడు. ఇతడు శరభోజిమహారాజు కాలమందును, శివాజిమహారాజుకాలములో కొన్నిసంవత్సరములునుండినవాడు. ఆంధ్రభాషలో నసాధారణమైనపాండిత్యముగలవాడు. ఇతనిపదములు కైశికిరీతిగా పదసౌష్ఠవముగలిగి శృంగారరసభూయిష్ఠమయియుండును.

## తెనుగుశృంగారరస పదకవులు

| | | |
|---|---|---|
| ఘటపల్లి వారు | ... | కైలాసపతిముద్ర |
| బొల్లపురమువారు | ... | బొల్లవరము ముద్ర |
| జటపల్లి వారు | ... | జటపల్లిగోపాలముద్ర |
| శోభనగిరివారు | ... | శోభనగిరిముద్ర |
| ఇనుకొండవారు | ... | ఇనుకొండ విజయరామముద్ర |
| శివరామపురమువారు | ... | శివరామపురము, రామపురముద్ర |
| వేణంగివారు | ... | వేణంగిముద్ర |
| మల్లికార్జునుడు | ... | మల్లికార్జునముద్ర |

వీరు ఆంధ్రదేశస్థులును, త్రైలింగబ్రాహ్మణులును, రమారమి 200 సంవత్సరములకు లోబడినవారుగా జెప్పుచున్నారు.

## తోడి సీతారామయ్య

తోడిరాగము ఇతనిసొమ్మట. తోడిరాగమునుకుదువబెట్టి వడ్డికి రూపాయలుతీసి సెలవు జేసునట. ఇతనివద్దపాటవినుటకు నభిలాషపడినరాజులు, ప్రభువులు కుదువబెట్టిన తోడిరాగమును వడ్డీతో మొదలునిచ్చి తోడిని త్రిప్పియిచ్చిపాడుమని జెప్పి సమ్మానింతురట. ఇతనిచే గేయకల్పనలు గలకొన్ని సాహిత్యములు గలవని జెప్పుచున్నారు. ఇతడు శరభోజిమహారాజు ఆరంభకాలమందుండిన వాడని జెప్పుచున్నారు.

## తచ్చూరు శింగరాచార్యులు

ఇతడు ఆంధ్రవైష్ణవ బ్రాహ్మణుడు. శ్యామాశాస్త్రులకుమారుడైన సుబ్బరాయ శాస్త్రులశిష్యుడు. సంగీతసంస్కృతాంధ్రములలో గొప్పవిద్వాంసుడు. గేయకల్పనలు వెలయ సంస్కృతమున నితనివలన సేయబడిన కీర్తనములుకొన్నిగలవు. ఫిడిల్ వాద్యములో మిక్కిలి సమర్థుడు. ఇతనిచేతను, ఫిడిల్ వాద్యములో నతిచతురుడైన తచ్చూరి చిన్నసింగరాచార్యులను తన తమ్మునిచేతను సంగ్రహముగా సంగీతలక్ష్య లక్షణములును, పెద్దలగీతవర్ణ కీర్తనపదములలో ననేక ములును ప్రకాశిలునట్లు బహుజనోపకారముగా మొట్టమొదట (1) స్వరమంజరి; (2) గాయక పారిజాతము; (3) సంగీతకళానిధి; (4) గాయకలోచనము; (5) గాయకసిద్ధాంజనములగు నీయైదు పుస్తకములనేర్పరచి అచ్చుకూర్పించి ప్రచురింపబడెను. చిన్నశింగరాచార్యులు ఇప్పు డున్నారు.

## ద్రావిడవాగ్గేయకారకులు

**అరుణాచలకవిరాయలు:** ఇతనియునికిశియ్యాళి. ద్రావిడభాషలో పంచలక్షణములు దెలి సిన విచక్షణుడు. కంబరామాయణమును అర్థప్రసంగము జేసుటయం దతిచతురుడు. ఇతడు తుళజా మహారాజుకాలమున నుండినవాడు. శ్రీమద్రామాయణమును కథా సందర్భములువిడువక ఆయా రసములకుదగిన రాగములతో వర్ణక్రమములు వెలయఆఱుకాండములవరకు ద్రావిడకీర్తనములుగా రచించి మణలి ముద్దుకృష్ణ మొదలారిసభలో నాదుపితామహులైన రామస్వామి దీక్షితులు మొద లైన విద్వాంసులుండుచో వినిపించి కనకాభిషేకము జెంది కీర్తిబొందెను. ఇతడు సంగీత విద్యా సమర్థుడు.

## ముత్తు త్తాండవరు

ఇతడు ద్రావిడ భాషయందును సంగీతమందును పండితుడు. శివభక్తాగ్రేసరుడు. చిదంబర సభాపతులమీద భక్తిరసముగాను శృంగారరసముగాను అనేకపదకీర్తనములు జేసినవాడు. ఇతడు అరుణాచలకవికి మునుపటివాడని జెప్పుచున్నారు.

## పాపవినాశ మొదలారు

ఇతడు సంగీతద్రావిడ భాషాపాండిత్యముగలవాడు. "పాపవినాశ" ముద్రతో నిందాస్తుతిగా బహుపదములు రచించినాడు. ఇతడు తుళజా మహారాజుకాలమందున్నవాడు.

## ఘనం కృష్ణయ్య

ఇతడుబ్రాహ్మణుడు. సంగీతమందును ద్రావిడమందును ప్రజ్ఞగలవాడు. పల్లవిపాడుటయం దతిసమర్థుడు. ఇతనిపదములు శృంగారరసములును, గడుసైన వర్ణక్రమములును, ఒరికయునుగలిగియుండును. ఇతని ఉనికిఉడయార్పాళయము. ఆరాజుమీద ఇతనిపదములు శానాగలవు. ఇతడు త్యాగరాజయ్య కాలముననుండినవాడు.

## శంకరాభరణం నరసయ్య

శంకరాభరణరాగము ఈ విప్రునిసొమ్మే. ద్రావిడముతో గేయకల్పనలుచెలంగ ఇతని పదములు కొన్నిగలవు ఇతడు శరభోజిమహారాజు కాలముననుండినవాడు.

## ఆనతాండవపురం బాలకృష్ణభారతి

ఈ విప్రుడుశివభక్తుడు. ద్రావిడభాషయందును సంగీతవిద్యయందును పండితుడు. రక్తిరాగదేశీయరాగములుగాక కొన్నిఅపూర్వరాగములందును గేయకల్పనాచమత్కారములు వెలయునట్లు అనేకకీర్తనములు "గోపాలకృష్ణ "ముద్రతోజేసియున్నాడు. నందన్అనుభక్తచరిత్రమును, మామినాటకమును గేయరూపముగా హాస్యరసకరముగాజేసి బ్రహ్మచారివ్రతముతో డెబ్బదియేండ్లవరకుండి నేటికిపదియాఱవసంవత్సరమునకు మునుపుకైలాసవాసియాయెను.

## వైద్దీశ్వరుని గుడి సుబ్బరామయ్య

ఈవిప్రుడు సంగీతద్రావిడములందును ప్రజ్ఞగలవాడు. శృంగారరసముగ శ్రీ "ముద్దుకొమరుని" ముద్రతోననేక పదములురచించుకొని నలువది సంవత్సరములకుముందుండెను.

## వెంకటేశ్వర ఎట్టప్పమహారాజు

శకాబ్దము 1738, క్రీ. శ. 1816 మొదలు, శకాబ్దము 1761, క్రీ. శ. 1839 వరకు ఈఎట్టయపురమునేలిన వెంకటేశ్వర ఎట్టప్పమహారాజులు గవర్నమెంటువారికి యుద్ధమందుమిగుల సహాయముజేసి పాంచాలంగురిచిసీమ, అనేకబిరుదులు, గౌరవములుజెందిన జగద్వీరరామకుమార ఎట్టప్పమహారాజులకుమారులు. ఈవెంకటేశ్వర ఎట్టప్పమహారాజులు సంస్కృతాంధ్రద్రావిడ సంగీతములందు నతిసమర్థులు. వైణికోత్తములు. ఈయనవలన 30000 రూపాయలు వ్యయముజేసి ఎట్టయపురములో ఉత్తరపుతెప్పగుంటను రాతిచే గట్లుమెట్లుగట్టించినదిగాక, శకాబ్దము 1755,

క్రీ. శ. 1833లో తిరునెల్వేలి శాలివాటీశ్వరస్వామికిని కాంతిమతీదేవికినిజరిగిన అష్టబంధనములో 50,000 రూపాయలు వ్యయముజేసి బ్రాహ్మణభోజనముసేయించినారు. గళుగుమలలో శ్రీకార్తికేయులకు 20,000 రూపాయలు విలువగల అపరంజిగలసిన కర్ణాటక దంతపల్లకియు, రజతమయ వాహనములు, స్వర్ణ దీపములు జేసిబెట్టినారు. ఇదిగాక ననేకధర్మములుజేసియున్నారు. ఈజగద్వీర రామవెంకటేశ్వర ఎట్టేంద్రులు ముఖారిరాగంబున " శివగురునాథనై "అనుద్రావిడకీర్తనమును, అనేకద్రావిడ వృత్తములును జేసియున్నారు.

## జగద్వీర రామకుమార ఎట్టప్పమహారాజు

ఈమహారాజు సంస్కృత ఆంధ్రద్రావిడసంగీత విద్యాసంపన్నులును మహాధర్మశీలులునై వేంకటేశ్వర ఎట్టప్ప మహారాజులవారి జేష్ఠపుత్రులు. కావ్యనాటకాలంకారాది విద్యలలో మహాసమర్థులు. షట్ఛాస్త్రముల్యాదదెలిసిన మహాపురుషులు. సంగీత లక్ష్యలక్షణముల బాగుగా నెఱిగిన వైణికోత్తములు. ఆంధ్రద్రావిడభాషలలో నతిచతురులు. శ్రీగణపతి మొదలయిన దేవతల విషయమై " శ్రీకార్తికేయ " ముద్రతో బహువర్ణికలు, బహుశ్లోకములు, అనేక రక్తిరాగ దేశీయరాగములలో గేయకల్పనలు విలసిలునట్లు బహుకీర్తనములురచించిన మహానుభావులు. తన సభలో చతుశ్శాస్త్రపండితుడైన విద్వాన్ శ్రీరంగం కుప్పనయ్యంగారు, చతుశ్శాస్త్రపండితులును అప్పయదీక్షితుల వంశస్థులునైన తిరువాలంగాడు విశ్వేపురిదీక్షితులు, మీమాంసాదిశాస్త్రసమర్థులైన తిరుకోడికావల్ కోదండరామశాస్త్రులు, వైయాకరణపండితులైన శ్రీవిలిపుత్తూరు వీరరాఘవ తాతాచార్యులు, తార్కికశిరోమణియైన విట్లాపురం మన్నారయ్యంగారు, సంస్కృతాంధ్రములందును, కామికాద్యష్టాదశాగమములందు నతిసమర్థులైన గళుగుమల అహోబలశాస్త్రులు, తక్కిన సంస్కృతపండితులును, ఆంధ్రవైయాకరణనిపుణులైన విశాత్తికుళం కృష్ణయామాత్యులు, ఆంధ్ర ద్రావిడములలో మహాకవియైన ఆవల్నత్తం రామలింగయ్య, ఆంధ్రపండితులైన బాలయ్య, గోపాలయ్య, ఆంధ్రకవీంద్రులగు కేశవరాజుమొదలైన క్షత్రాజులును, కడిక్కైప్పులవరు, మూక్కప్పులవరు, అష్టావధాని ముద్దుకుమారప్పులవరు, పరమశివప్పులవరు, నమశివాయప్పులవరు, పాండ్యప్పులవరు మొదలయిన ద్రావిడకవీంద్రులును, వాగ్గేయకారకోత్తములును, వైణికశ్రేష్ఠులునయిన బాలస్వామిదీక్షితులు, వైణికకులోత్తములయిన సుబ్బుకుట్టిఅయ్య, ఈసంస్థానమున పరంపరవైణికులును బాలస్వామిదీక్షితులవారి శిష్యులునైన వీణమీనాక్షీసుందరమయ్య, వీణలోనతి సమర్థులయి ఈసంస్థానపు సంగీతపండితులయిన వీణసుబ్బయ్య అణ్ణావి, గాయకోత్తములయిన తిరునెల్వేలి వెంకు భాగవతులు, మధురరామయ్యగాయకశ్రేష్ఠులు, ముద్దుస్వామిదీక్షితులవారి శిష్యులైన తేవూరు సుబ్రహ్మణ్యయ్య మొదలయినగాయక శిఖామణులును వెలయగా ప్రతిదినంబులందును వారి వారి విద్యాప్రసంగంబుల తారతమ్యంబులెఱింగి తగిన సమ్మానములనిచ్చి వారివారియోగ్యతకుదగిన జీతములనేర్పఱచినదిగాక వారివారి కుటుంబంబులనడుచు ప్రస్తుతవిశేషములకుదగినట్లిచ్చి గౌర

వంబుగ నాదరించుకొనియుండెను. ఇదిగాక గృధ్రాద్రి శ్రీకార్తికేయాలయ జీర్ణోద్ధారణమును, స్వర్ణ కలశములు వెలయ విమానములును, రజతమంటపంబులగు షోడశోపచారదీపంబులు, బహు వాహనాదులను, లక్షవరహాలు విలువగల రత్నఖచిత కిరీటకుండలములును, నవరత్నాభరణ ముక్తాహారంబులు మొదలైన అనేకాభరణంబులును, పూర్వమందున్న గ్రామములుగాక విశేషపూజా నైవేద్యోత్సవాద్యుపచారాదులకై బహుగ్రామములు సర్వమాన్యంబులుగ నేర్పఱచినారు. ఎట్టయపురిలోనున్న శివాలయవిష్ణ్వాలయ జీర్ణోద్ధారణంబులును, స్వర్ణకలశ విమానములును, ఉత్సవములు నడచివచ్చుటకై పూర్వమందున్న గ్రామములకంటెనధిక గ్రామములును. సర్వమాన్యములుగా విడచినది యిప్పుడును నడుచుకొనియున్నది. ఈమహారాజు తనసొంతమున రమారమి 25,000 రూపాయలు వెచ్చముజేసి గంగకొండాన్ చిత్రానదియందును, కయత్తారుపాశనదియందును, జనోపకారముగా వంతెనలు గట్టించిరి. ఈఎట్టయపురిలో సకలవీధులందును బురుదబడక గులకరాళ్లువేసి ఘట్టించి చెట్లుబెట్టించి తటాకములందు రాళ్ల మెట్లుగట్లు గట్టించి అర్థులకుముంగొంగుపసిండియై వెలింగెను. ఇటువంటి పుణ్యశ్లోకుడు ఈ రాజవంశములో మునుపుగలిగియుండరని నిశ్చయముగా జెప్పవచ్చును. ఈమహారాజునకవతల ఇతని మొదటి సహోదరులైన

## జగద్వీర రామ వెంకటేశ్వర ఎట్టప్పమహారాజు

ఈజగద్వీరరామ వెంకటేశ్వర ఎట్టేంద్రమహారాజు పట్టాభిషిక్తులై రాజ్యమేలెను. వీరు ద్రావిడభాషలో నతిసమర్థులు. ఇతరభాషలనెఱిగినవారు. సంగీతవిద్యాపారంగతులు. వీణ, స్వరపత్తు, సితార్, జలతరంగ మృదంగ ఘటవాద్యముల నతిచమత్కారకల్పనలు వెలయవాయించివినిపించును. గానమున రౌడవనారుదులో అనిజెప్పునట్లురాగాలాపన, మధ్యమకాలపల్లవి మొదలైనవి పాడుటైనది. బహుకల్పనాచాతుర్యములు విలసిల్ల ఆణిముత్తెముల నెత్తివిసరునట్లు మిక్కిలి శ్రావ్యముగానుండును. ఏవేళను గానరసమనుభవించుకొని యుండుటయుగాక వేదాంతవిచారణతో బ్రహ్మధ్యానపరులై జ్ఞానమూర్తియైబరగును. తనకులపురోహితులను, వైయాకరణపండితులును, చతుర్విధకవిత్వాతిశయవైభవముగలవారును వల్లీపరిణయచంపు ప్రబంధంబురచించి "కవికేసరి"యను బిరుదువహించిన సామిదీక్షితులకు 7000 రూపాయలు వెచ్చముజేసి శకాబ్దము 1778, క్రీ.శ. 1856 ఆనందసంవత్సరవైశాఖమున సోమయాగముజేయించిబెట్టిరి. తన అన్నవలెనే సకలవిద్వాంసుల నాదరించుకొని ధర్మపరిపాలనముజేసుకొని యాచకులకు తనభుజాదండము కల్పశాఖయై చెలగకీర్తిజెందెను. ఈజగద్వీరరామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజు రుద్రప్రియరాగమున "మురుగాఉనై నంబినేనయ్యా" అనుద్రావిడభాషలో నొకకీర్తనమును, స్వరజతులనురచించెను. కడపట నిర్వికల్పసమాధిజెంది పరంజ్యోతితోనైక్యమొందెను. తరువాత ఇతని సహోదరులైన

## ముద్దుస్వామి ఎట్టప్పమహారాజు

ఈముద్దుస్వామి ఎట్టప్పమహారాజు పట్టాభిషిక్తులై గానవిద్యాలోలులై రసభావాభినయ జ్ఞానవివేకచతురులై పరంపరగావచ్చుపండితుల నాదరించువారై దేశాంతరముననుండి వచ్చుచుండు పండితులకును అర్థులకును చింతామణియై ప్రకాశించి ఐరావతమే సాక్షాత్కరించి దివినుండి భువికి వచ్చెనోయనిజనులెంచునట్లు గృధ్రాద్రి శ్రీకార్తికేయ స్వాములకు రమారమి 10,000 రూపాయల లో రజతగజవాహనము, 10,000 రూపాయలలో మహారథమును జేయించిసమర్పించి ఖ్యాతి జెందెను. ఈమహారాజుకుమారులిద్దరు. వీరిలో జేష్ఠులైన

## రాజ జగద్వీర రామకుమార ఎట్టప్పమహారాజు

ఈ రాజ జగద్వీర రామకుమార ఎట్టప్పమహారాజు పట్టాభిషిక్తులై రాచరికముజేసెను. వీరు హూణ ఆంధ్రద్రావిడభాష లోనతిసమర్థులు. చట్టములను న్యాయశాస్త్రములెఱిగిన వివేక ధుర్యులు. తన అస్థానమందున్న పరంపరాగత సకలపండితులను బోషించినవాడు. శ్రీమహాభారత మందు బద్ధస్పృహులు. కవిత్రయమువారిచే తెనుంగింపబడిన ఆంధ్రమహాభారతము నీమహారాజు అనుమతివలన వచనరూపముగా నాచే ద్రవిడీకరించబడి అచ్చొత్తబడినది. శ్రీకాంచీకామకోటి పీఠాధిపతులగు జగద్గురు శ్రీశంకరాచార్యులస్వాములు దక్షిణదేశపుణ్యక్షేత్రయాత్రగా వెడలిన సమయమందు ఈమహారాజుయొక్క భక్త్యాతిశయమువలన నిచటికేతెంచిన జగద్గురువులవారికి రమారమి 10,000 రూపాయలు పాదపూజజేసి సమర్పించి ఆరాధించిరి. కొన్నిసంవత్సరములకు పిమ్మట ఈమహారాజుకుమారులైన

## రాజ జగద్వీర రామవెంకటేశ్వరఎట్టప్పమహారాజు

ఈరాజజగద్వీర రామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజు శకాబ్దము 1821, క్రి. శ. 1899 వికారివత్సరమార్గశిరమాసజ్యేష్ఠానక్షత్రమందు పట్టాభిషిక్తులైరి. ఈమహారాజుహూణాంధ్ర ద్రావిడ భాషాసమర్థులును, వీణావాదనతత్పరులును, శ్రీకార్తికేయ చరణాసక్తచిత్తులును, ఆశ్రితవిద్వజ్జన పోషకులును, మహాశాంత గుణసంపన్నులునై మనునీతిదప్పక రాజ్యమేలుచున్నసమయములో గృధ్రాద్రికార్తికేయుల ఉత్సవమూర్తికి రమారమి 12,000 రూపాయలలో స్వర్ణకవచమును, 10,000 రూపాయలలో రజతమయకైలాసవాహనమును చేయించిసమర్పించినదిగాక ద్రావిడ భాషలో ఖమాజురాగమునందు "మురుగాతరుగిలయా" అనియు, భైరవిరాగమందు "వావా వానీవళ్లిమణాలా" అనియు రెండుకీర్తనములుజేసియున్నారు. రమారమి క్రి. శ. 1885 సంవ త్సరముమొదలుకొని హిందూసంగీతమును ఒకభాషవలె సంగీతజ్ఞులు జూచినమాత్రమున నెఱిగి పాడునట్లు సేయవలెనను అభిప్రాయముతో చిన్నసామిమొదలారు M. A. బాలాజీపేట కృష్ణ భాగవతులవద్ద త్యాగరాజయ్యయొక్క 800 కీర్తనములు తానే నొట్టేషనులోవ్రాసి 40 కీర్తన

ములు వరకు స్టాఫ్‌నొటేషన్‌లో నచ్చొత్తించినదిగాక కొన్నిచిల్లర కీర్తనములు వారువారు జెప్పిన లక్షణములును వ్రాసిబహుద్రవ్యము వ్యయముజేసియచ్చొత్తించెను. తరువాతనన్ను దెలిసి రప్పించి వెంకటమఖి సంప్రదాయమునగల రాగాంగోపాంగ భాషాంగగీతములును, దీక్షితులవారి కీర్తనము లును స్టాఫ్‌నొటేషన్‌లోవ్రాసి అచ్చొత్తించవలెనని జెప్పెను. గమకస్వరూపములుదెలియక కీర్తన ములు మొదలైనవి యెటులపాడనగును అన్నదిమొదలు నాలుగుసంవత్సరములవరకు నావలన గమకస్వరూపములను లక్ష్యలక్షణములతో లెస్సగాదెలుసుకొని గమకములకు గుఱుతులేర్పఱచి పోయింపుచో నతనికి రాజవిద్వరమును నేత్రోపాధియునుగలిగెను. అపుడు నేనెట్టయపురమునకు వచ్చినపిమ్మట కొన్నిదినములలో చిన్నసామిమొదలారివటికివచ్చి మహారాజునుగని నేనెత్తినపనిని తెనుగుభాషలోనైన పూర్తిసేయింపవలెననికోరినదిగాక ఈమహారాజుల పినతండ్రియును, ద్రావిడ భాషాపంచలక్షణములును పంచకావ్యములునెఱిగిన మహా సమర్థులును, సంగీతసాహిత్యరసికులును, దీనజనులకును. ఆశ్రితజనులకును పెన్నిధియునుగా విలసిలుకొనియున్న పిన్నమహారాజయిన వెంక టేశ్వర ఎట్టపాండ్యులగని తనకోరికనుజెప్పివేడుకొనెను పిన్నమహారాజుగారు మహారాజు సము ఖమున దెలియజేసినతోడనే తెలుగుఅచ్చుక్షరములు రప్పించి ఈ '' సంగీతస ప్రదాయప్రదర్శిని ''ని అచ్చొత్తమని ఉత్తరవిచ్చినది మొదలు ఈపుస్తకము పూర్తియయ్యేవరకు రమారమి 10,000 రూపాయలకుపై వెచ్చముకావచ్చును. ఇప్పాటయేబది సంవత్సరముమొదలు నేటివరకుగలిగిన వాగ్గేయకారకుల సంగీతసాహిత్యగేయ ఫణుతులునశింపక ఆచంద్రతారార్కముగా భాషలవలె ప్రకాశిలునట్లును, ఇకమీదగలుగు వాగ్గేయకారకులు తమ సంగీతసాహిత్యగేయఫణతులను ఈపుస్త కమువలెనే చూచినమాత్రమునఅభిజ్ఞులు దెలుసుకొనునట్లేర్పఱచగల మార్గమును స్థాపించిన పుణ్య శ్లోకులైన ఈమహారాజును ఈసంగీతసంప్రదాయప్రదర్శినినిజూచిన సకలపండితులును కొనియాడి పుత్రపౌత్ర దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలుగవలెనని ఆశీర్వదింతురుగాక!

ఈరాజ జగద్వీరరామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజులు యీ సంస్థానపుస్కూలును అభివృద్ధికి కొంచుకొనిరావలెనని యెంచియుండునప్పుడు ఇండ్యా (India) చక్రవర్తియొక్క ఏడవ ఎడ్వర్డు (Edward VII) పట్టాభిషేకమును కొనియాడవలసి ఢిల్లీ దరుబారునకురావలెనని గవర్నమెంటువారివద్దనుండి ఆహ్వానపత్రికవచ్చినది. తోడనేనెడలి 1903 సంవత్సరము జనవరినెల 1వతేది జరిగిన ఉత్సవమునకు మహారాజులు డిల్లీకియేగియున్న సమయమందు, వారిఆజ్ఞచొప్పున నిచ్చట ఎట్టయపురమందును రాజవర్గస్థులు చక్రవర్తిపట్టాభిషేకదినమును గొనియాడి ఆపట్టాభి షేక జ్ఞాపకము శాశ్వతముగానుండుకొఱకు స్కూలునుపూర్తిసేయుటకై మెట్రికులేషన్ క్లాసు నేర్పఱచిఅభివృద్ధిజేసిరి. స్కూలుయొక్క సౌధమునకుముందటి పందిలియందుగతించిన విక్టోరియా మహారాణియొక్క పేరిమి యెల్లప్పుడును జ్ఞాపకముండుటకయి. (Victoria Memorial Athen-aeum) అను సభయేర్పఱుపబడియున్నది. తరువాత చక్రవర్తి యొక్క పట్టాభిషేక దరుబారు

కేగియుండిన జ్ఞాపకముండుటకొఱకు స్కూలుయొక్క పెద్దహాలునకు పట్టాభిషేకహాల్ (Coronation Hall) అనినామకరణముచేయబడెను. దానియందు చక్రవర్తి చక్రవర్తిని, ఇతర చక్రవర్తులు వీరిపటములనుంచి అలంకరింపబడినది అహాలందే చదువువారికి నుపయోగపడునట్లు నొకపుస్తకశాల నుంచబడియున్నది. దానికి ఎడ్వర్డుహాల్ (Edward VII Alexandra Library) అనిపేరు. యంత్రములు పాఠముచెప్పి పెట్టుటకు తగినసామగ్రులును పూర్తియైనవెనుక మహారాజులవారి వుత్తరువు చొప్పున రికగ్నిషన్ (Recognition)కు అప్లికేషన్ జేసిన తోడనే గవర్నమెంటువారు సంతోషమొంది మొదటిసారియందే పర్మనెంటుసెక్షన్‌లో జేర్చుకొని స్కూలునొప్పుగొనిరి. ఈవర్షమందే 10 బాలకులు మెట్రికులేషనుకును, 15 బాలకులు లోయర్ శెకండరీపరీక్షకును పోయియున్నారు. ఇదిగాక నిచ్చటి సత్రమందు పైజెప్పిన స్కూలులోచదువుటకై లేమిగలఅనేకబాలులకు భోజనము మొదలైన సౌకర్యములుజేయించి ధర్మమునడిపించుచున్నారు. ఇదిగాక అనేకవిధములుగా నభివృద్ధిజేయవలెనని అభిప్రాయముతో క్రిక్కట్టు, టెన్నిస్, ఫుడ్‌బాల్ (Cricket, Tennis, Football) మొదలైన ఆంగ్లేయక్రీడలాడుటకై యీస్కూలుయొక్క ఉత్తరపు భాగములోగల కోవిల్పట్టికే గుమార్గమువరకు గల నేలలను స్కూలుతోజేర్చి ఆనేలలందే తక్కినచోటులనుండివచ్చెడు బాలురకు సౌకర్యముగానుండిచదువుటకును, సాపాడుబస (Hostel accommodation) యని అమర్చుటకు నేర్పాటుజేసుకొనియున్నారు. ఇవి మొదలైన కారణములవలన రాగరాగ స్కూలభివృద్ధికివచ్చి అనేకవిధములైన ఖ్యాతులు మహారాజులవారికి యెచ్చోటను వ్యాపించుటకు సందేహమేలేదు. ఇటులజేయుటకై మొదటనుంచియే యీజిల్లాలో మిక్కిలిప్రసిద్ధిజెందిన(Rev. C.A. Margoschis) దొరగారికి జాబువ్రాసి తెగనిప్రయత్నము, ధైర్యము, సత్యవచనము, శాంతముమొదలైన సద్గుణములతో 20 సంవత్సరములు హైస్కూల్‌కాలేజిమొదలైనతావుల నభివృద్ధిజేసుకొనివచ్చిన మహారాజరాజశ్రీ S. రామకృష్ణయ్య B. A. L. T. యనువారిని పంపవలెనని అడిగినతోడనే ఆదొరగారికి ప్రేమాస్పదులుగా నుండిన ఈతనిపంపెను. ఈయన తగినప్రయత్నమెత్తి అభివృద్ధికి గొంచువచ్చుటకు ఏర్పాటుచేసుకొనియున్నారు. మహారాజులు వేదశాస్త్రపాఠశాలలు నేర్పఱచియున్నారు.

## సుబ్బరామ దీక్షితులు

బాలసుబ్రహ్మణ్యశర్మమునుజెందిన నేను ముద్దుస్వామిదీక్షితుల కనిష్టసహోదరులైన బాలస్వామిదీక్షితులపుత్రుడు. బాలస్వామిదీక్షితుల పిన్నకూతురు అన్నపూర్ణియమ్మ, ఆమెపెనిమిటి భారద్వాజగోత్రులును ద్రాహ్యాయన సూత్రులునైన శివరామయ్య. అతనికి మొదటికుమారులై

జనించిన రామస్వామి అయ్యా* గానమందును వీణయందును అతిసమర్థులై బహురాజ సమ్మానములంది 45వ వయసున పరగతి జెందెను. నేనుశకాబ్దము 1761, క్రీ. శ. 1839 విళంబిసంవత్సర తులారవి హస్తానక్షత్రమున రెండవపుత్రుడై తిరువారూరినిజనించితి. బాలస్వామిదీక్షితులునను ఐదేండ్లలో ఎట్టయపురమునకు దోడ్కొనివచ్చిసంస్కృతాంధ్రములను సంగీతమును నేర్పించుకొని యుండుచో జ్యోతిశ్శాస్త్రములందలి సమర్థులైన జగద్వీరరామకుమార ఎట్టప్పమహారాజు జ్యోతిశ్శాస్త్రజ్ఞులరావించి నాజాతకమునుజూచి బాలస్వామిదీక్షితులగని "మీముగ్గురికిని ఈజాతకుడే పుత్రుడు. వీనిస్వీకరించుకొనుడు, దీక్షితులవలెప్రఖ్యాతివంతుడై యుండును." అని ఉత్తరవిచ్చిన ప్రకారమే నామాతామహులైన బాలస్వామి దీక్షితులు ప్లవంగసంవత్సర మకరరవిలో నన్నుస్వీకరించి బ్రహ్మోపదేశమును, శ్రీవిద్యోపదేశమును జేసిబెట్టెను. కావ్యనాటకాలంకారములును, మనుచరిత్ర, వసుచరిత్రాది మహాకావ్యములును, వ్యాకరణ ఛందస్సులును సంస్కృతాంధ్ర పండితులైన విశాత్తికోళం కృష్ణయామాత్యునివలన దెలుసుకొంటిని. నాతండ్రిగారివద్ద వీణనభ్యసించినదిగాక సంగీత లక్ష్యలక్షణ మర్మములు వివరముగాదెలుసుకొంటిని. పదియేడవవయసున శ్రీకార్తికేయుల మీద దరుబార్ రాగము అటతాళములో ఒకతానవర్ణము రచించి సంగీతవిద్యాపారంగతులైన జగద్వీరరామవెంకటేశ్వర ఎట్టప్పమహారాజుల సముఖమున వినిపించితి. సభలోనున్నకొందఱు ఈతని ప్రసిద్ధికై ఈవర్ణమును ఇతని తండ్రిగారే రచించియిచ్చియుండవచ్చును. అని జెప్పిన వెనుక ఒక నాడు మహారాజునన్ను బిలిపించి "ఇదిగో, స్వారివెళ్లెద. ఒక ఘంటలోవత్తును. ఇచటనేయుండి యమునారాగమందు ఒక జతిస్వరము సేయుటలో స్వరరూపముగా పల్లవి అనుపల్లవి పిమ్మట ధైవతము ఎడుపుగల స్వరము నవతలిస్వరములో క్రమముగా మొదటిది, రెండవది, మూడవది, మూడవది, రెండవది, మొదటిది యున్నైనకాలములతో కడపటముక్తాయినమర్చవలెను." అని జెప్పి కావలిబెట్టిస్వారిబోయిరి. పెద్దలయనుగ్రహమువలన మహారాజు సవారి వచ్చుటకొకఘడియకు మునుపే జతిస్వరమునుజూచి వ్రాసి మహారాజువచ్చినతోడనే సభలోవినిపించితి. సంతసిల్లి నన్ను బిలుచుకొని మాయింటికివేంచేసి నాతండ్రిగారినిగని "అయ్యా! యమునారాగములో నొకజతిస్వరమువినవలెను" అని నన్నుగనిపాడుమనిజెప్పినతోడనే నేనుపాడినజతిస్వరమునువిని నాతండ్రిగారు నారచనగానెంచి మహారాజుయొక్క సభావిశేషమేయని తెలియజేసెను. మహారాజువారు జోడుసాల్వులును పదిపవునులును సమ్మానముజేసిరి. కొన్ని సంవత్సరములకుపైన ముద్దుస్వామి జగద్వీరరామఎట్టప్ప మహారాజు తనపేరిట నృత్యోపయోగకరమైన ఆనందభైరవి సురటిరాగములందు చౌకవర్ణములును, తొమ్మిదిరాగములుగల ఒకరాగమాలికయునుజేయవలెనని ఉత్తరవిచ్చి

---

* ఈరామస్వామిఅయ్యకు, వీణచిన్నసామి, ఈసంస్థానం మహారాజా హైస్కూల్ త్రితియోపాధ్యాయుడును గానవిద్యాభిజ్ఞుడును అయిన వెంకట్రాముడు F. A, అని ఇద్దరు కుమారులున్నారు.

నట్లే రచించి వినిపించి సమ్మానములనందితి. రామక్రియరాగములో నొకతానవర్ణమును, శంకరాభరణములో శంకరాచార్యమను నొకకీర్తనమును రచించికుంభఘోణం జగద్గురువులదర్శించి, ఆసభలోవచ్చియుండిన వీణసుబ్బుకుట్టిఅయ్య, తిరుమలరాజన్ పట్టణం రాముడుభాగవతులు, తిరుక్కోడయూరు భారతి మొదలయిన సంగీతవిద్వాంసులును,చతుశ్శాస్త్రవేత్తలైన పండితులునువినునట్లువినిపించితి. తరువాత నిదివరకు నాచేరచింపబడిన అనేకచౌకవర్ణ తానవర్ణకీర్తన రాగమాలిక రాగసంచారులను ఈ పుస్తకమున కనుగొనవచ్చును. A. M. చిన్నసామిమొదలారు M. A., సంగీతమును ఒకభాషవలెనేర్పఁబచవలెనను అభిప్రాయముతో "ప్రాచీనగానము" అనునొక పుస్తకమును ఇంగ్లీషునొటేషన్‌లో 1895 సంవత్సరముప్రారంభించిఅచ్చొత్తించుకొనియున్నపుడు, నన్ను దెలిసిరప్పించి తానెత్తినపనినిచాలించుకొని మూడుసంవత్సరములదాక గమకవిషయములను, వెంకటమఖి సంప్రదాయముల నెఱిగికొనెను. అవతల ఎట్టయపురమునకువచ్చి మహారాజునుగని గమకముల గుఱుతులు, తాళకాలప్రమాణగుఱుతులు, ఇవిమొదలైనవానితోనే తెనుగందు సంస్థానపు విద్యావిలాసినీ ముద్రాక్షరశాలలో ముద్రింపించవలెననియు, వెంకటమఖి సంప్రదాయమైన లక్ష్యలక్షణముల మఱుగించకఅచ్చుకునిచ్చి ఈసంగీతసంప్రదాయప్రదర్శినిని పూర్తిజేయునట్లుసుబ్బరామదీక్షితులకు నుత్తరువుసేయవలెననియు ప్రార్థించినట్లే మహారాజువారు నాకుత్తరవిచ్చిన ప్రకారమే 1901 సంవత్సరము డిశెంబరునెల 21వతేదీప్రారంభించి పూర్వవాగ్గేయకారకుల చరిత్రముదాక పూర్తియైనదిగాక, ఈపుస్తకములో వెలయుగమక తాళముల గుఱుతులవివరములకు ఆధారమైన సంగీతలక్షణ సంగ్రహముయొక్కపని 1903సం॥ డిశెంబరునెల 17వతేది మొదలు జరుగుచున్నది. నాకు సంగీతవిద్యలో నేర్పరియైన ముద్దుస్వామియని ఒక కుమారుడున్నాడు.

## సదాశివరావు

ఇతడు మహారాష్ట్రబ్రాహ్మణుడు. ఇతనిఉనికి మహిసూరిసంస్థానము సంగీతసంస్కృతాంధ్రములలోపండితుడు. ఇతనిచేసేయబడిన అనేకకీర్తన వర్ణతిల్లానాలు ప్రసిద్ధిగనున్నవి. ఇతడు 20 సంవత్సరములకుమునుపుండెను.

## పట్ణణం సుబ్రహ్మణ్యయ్య

ఈద్రావిడ బ్రాహ్మణుని ఉనికి పంచనదము. సంగీతాంధ్రములలో విచక్షణుడు. ఇతడు తెనుగునజేసిన కీర్తనములనేకములున్నవి. ఈయన 5 సంవత్సరములకు మునుపుగతించెను.

## వెంకటేశ్వర శాస్త్రులు

ఇతడు సంగీతసంస్కృతాంధ్రములలో పండితుడు. వైణికుడు. ఈయన క్రీ శ. 1892లో సంగీతస్వయంబోధిని అనునొక పుస్తకము తెనుగున అచ్చొత్తిప్రకటీకరించెను. ఇతనిచే సేయఁబడిన సంస్కృత కీర్తనములు కొన్నిగలవు. ఈయన 7 సంవత్సరములకు మునుపుగతించెను.

## గర్భపురివారు, ధర్మపురివారు

వీరలు "గర్భపురి" "ధర్మపురి" ముద్రలతో తెనుగులో శృంగారరసప్రధానములుగా అనేక జావళులు జేసియున్నారు. వీరుగతించి స్వల్పకాలముండును.

## రావుబహదూరు C. నాగోజిరావు. B. A., F. M. U.

ఈయన మహారాష్ట్ర బ్రాహ్మణులు, ఆంగ్లేయభాషా విచక్షణులు. ఇదిగాక అనేక భాషలందును సంగీతమందు నతిసమర్థులు. ఈయన (Inspector of Schools, Southern Circle.) వీరు వర్ణక్రమములతో ద్రావిడభాషలోనొక సంగీత పుస్తకమురచించి క్రీ. శ. 1900లో అచ్చుగూర్చించి ప్రకటీకరించియున్నారు.

ఈరాయలవారి ప్రేరణచే, కొన్ని సంవత్సరములకు మునుపు సంగీతలక్షణ లక్ష్యము లెఱిగిన గాయకోత్తములై యశము జెందియుండిన మహావైద్యనాథయ్య శిష్యుడును, గానవిద్యా సమర్థుడునుగానుండు పశమాన హరిస్వామినాథయ్యగారివలన రాగవిబోధిని అను పుస్తకము ద్రావిడభాషలో సేయబడి రాయలవారిచే క్రీ. శ. 1901లో అచ్చొత్తించి ప్రకటీకరింపబడియున్నది.

# సంగీతలక్షణ ప్రాచీనపద్ధతి

శ్లో. బ్రహ్మగ్రంథిజ మారుతానుగతినా చిత్తేనహృత్పంకజే,
సూరిణా మనురంజకః శ్రుతిపదం యోయం స్వయంరాజతే,
యస్మాద్గ్రామ విభాగ వర్ణరచనాలంకార జాతిక్రమో,
వందే నాదతనుం తముద్ధుర జగద్గీతం ముదే శంకరం.

శ్లో. సదాశివ శ్శివాబ్రహ్మ భరతః కశ్యపోమునిః
మతంగో యాష్టికో దుర్గాశక్తిః శార్దూల కోహలౌ,
విశాఖిలో దత్తిలశ్చ కంబలోశ్వతర స్తథా
వాయుర్విశ్వావసూ రంభార్జున నారద తుంబరాః
ఆంజనేయో మాతృగుప్తో రావణో నందికేశ్వరః
స్వాతిర్గుణో బిందురాజః క్షేత్రరాజశ్చ రాహలః
రుద్రటో నాన్యభూపాలో భోజభూవల్లభ స్తథా
పరమర్ది చ సోమేశో జగదేక మహీపతిః
వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భట శంకుకాః
భద్రాభినవ గుప్తశ్చ శ్రీ మత్కీర్తిధరోపరః
అన్యేచ బహవః పూర్వే యే సంగీత విశారదాః.

ఈ శ్లోకంబుల గనియున్న సదాశివ భవాన్యాదులు సంగీత శాస్త్రకర్తలైన పూర్వాచార్యులనియు, వీరుగాక ఇతరులనేకులు గలరనియు సంగీతరత్నాకరమున జెప్పబడియున్నది.

శ్లో. నాదోపాసన యాదేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః,
భవన్త్యుపాసితా నూనం యస్మాదేతే తదాత్మకాః.

నాదబ్రహ్మ స్వరూపులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు నాదోపాసనవల్ల నిశ్చయముగా ఉపాసితులగుచున్నారు.

1\. శ్లో. నాదేనవ్యజ్యతేవర్ణః పదం వర్ణాత్పదాద్వచః,
వచసో వ్యవహారోయం నాదాధీనమతోజగత్.

నాదమువలన అక్షరమును, అక్షరమునుండి శబ్దములును, శబ్దమునుండి వ్యవహారమును కలిగెను గనుక లోకములన్నియు నాదస్వరూపముగా నున్నవని శార్ఙ్గదేవులు మొదలైన పండితులు జెప్పుచున్నారు. ఇప్పటి వాడుకలోగల సంగీతవిద్యను పలుకదొడగుటకు మునుపు ప్రాచీన

కాలమందుండిన సంగీతరీతిని గురించి లక్షణసంగ్రహముతో జెప్పని విషయములందు కొన్నిటిని సంగ్రహించి జెప్పుచున్నాము. మనుష్యుల శరీరమునుండి కలిగెడినాదము హృదయ కంఠ శిరస్సుల మంద్రమధ్యతారములను మూడు స్థాయిలయందు పెరిగి బయలు వెడలును. ఆనాదము ఒక్కొక్క స్థాయియందును ఇరువదిరెండు శ్రుతులుగా భాగింపబడి ఆశ్రుతి సమూహములచే షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదములను ఏడు శుద్ధ స్వరములు కలుగుచున్నవి. వీని సంకేతాక్షరములు స, రి, గ, మ, ప, ధ, ని అనియు, ఈస్వరములకు క్రమముగా 4, 3, 2, 4. 4, 3, 2, శ్రుతులనియు, ఇవియే శుద్ధ (ప్రకృతి) స్వరములనియు జెప్పబడియున్నది.

2. వికృత స్వరములు : శార్ఙ్గదేవులమతము. ఒక్కొక్కస్వరమును ఏశ్రుతులనుండి కలుగుచున్నదో ఆశ్రుతి ఆస్వరమునకు నియతశ్రుతియని జెప్పబడును. (1) ఒక శుద్ధ స్వరము తన నియతశ్రుతి యందుండునపుడు దానికేర్పడిన శ్రుతులు తగ్గినను కూడినను అది వికృతస్వరమని జెప్పబడును. ఉదాహరణము : (1) శుద్ధషడ్జము తనకేర్పడిన నాలుగు శ్రుతులలో రెండు శ్రుతిని తన రెండవశ్రుతియందు బుట్టెడు కాకలినిషాదమునకిచ్చి తాను రెండు శ్రుతితో తన నియతి శ్రుతియందుండియు శ్రుతి తగ్గినందువలన అచ్యుతషడ్జము అను వికృతస్వరమగుచున్నది. (2) శుద్ధ ఋషభము తన నియత శ్రుతిస్థానముననుండియు షడ్జము తన మూడవ శ్రుతియందు చ్యుతషడ్జమైనపుడు ఆషడ్జముయొక్క నాలుగవ శ్రుతినిగైకొని చతుశ్రుతి ఋషభము అను వికృత స్వరమగుచున్నది. (2) ఒక శుద్ధ స్వరము తన నియత శ్రుతిని విడిచి వేరొక శ్రుతియందు దోచినట్టయిన అదియును వికృత స్వరమేయగును. ఉదాహరణము : చ్యుతషడ్జము తనయొక్క నియతశ్రుతిని విడిచి మూడవశ్రుతిలో దోచినప్పుడు షడ్జము అనెడి నామమును వహించియుండియు చ్యుతషడ్జము అనెడి వికృతస్వరమగుచున్నది. ఈవిధముకలుగు వికృత స్వరములు పండ్రెండు. అవి ఏవియనిన? (1) కైశికినిషాదము; (2) కాకలినిషాదము; (3) చ్యుతషడ్జము; (4) అచ్యుతషడ్జము; (5) చతుశ్రుతి ఋషభము; (6) సాధారణగాంధారము; (7) అంతరగాంధారము; (8) చ్యుతమధ్యమము; (9) అచ్యుత మధ్యమము; (10) త్రిశ్రుతిపంచమము; (11) కైశికి పంచమము; (12) చతుశ్రుతి ధైవతము. ఇట్లు ఏడుశుద్ధస్వరములును, పదిరెండు వికృతస్వరములును ఇరువదిరెండు శ్రుతులలో పదునాలుగు శ్రుతిస్థానములనుండి కలుగుచున్నవి.

3 సోమనాథులమతము : శుద్ధ స్వరములు ఏడు, వికృతి స్వరములు ఏడు. ఈ పదునాలుగు స్వరములును పదునాలుగు స్థానములనుండి కలుగుచున్నవి. ఇతడు శార్ఙ్గదేవుల మతమునగల అచ్యుతషడ్జము, చతుశ్రుతిఋషభము, అచ్యుత మధ్యమము, కైశికి పంచమము, చతుశ్రుతి ధైవతములైన ఐదు వికృతిస్వరములను తోసి చ్యుతషడ్జమును మృదుషడ్జమనియు, చ్యుతమధ్యమమును మృదుమధ్యమమనియు, త్రిశ్రుతిపంచమమును మృదుపంచమమనియు, వేరుపేరులిచ్చి జెప్పియున్నాడు. ఈ రెండుమతముల శుద్ధ (ప్రకృతి) వికృతిస్వరములు ఏ ఏ శ్రుతులందు కలుగుచున్నవి అనుటయును, వాని పేళ్ళును క్రింద కనుపింపబడిన శ్రుతిపట్టికమునజూడుడు.

| సోమనాథుల మతము | | | శార్ఙ్గదేవుల మతము | |
|---|---|---|---|---|
| వికృతి స్వరములు, శ్రుతి సంఖ్యలును | ప్రకృతి స్వరములు, శ్రుతి సంఖ్యలు | | ప్రకృతి స్వరములు, శ్రుతి సంఖ్యలు | వికృతి స్వరములు శ్రుతి సంఖ్యలును |
| కైశికీ నిషాదము (3) | | 1 | | కైశికీ నిషాదము (3) |
| కాకలీ నిషాదము (4) | | 2 | | కాకలీ నిషాదము (4) |
| మృదుషడ్జము (2) | | 3 | | చ్యుత షడ్జము (2) |
| | స 4 | 4 | స 4 | అచ్యుత షడ్జము (2) |
| | | 5 | | |
| | | 6 | | |
| | రి 3 | 7 | రి 3 | చతుశ్రుతి ఋషభము (4) |
| | | 8 | | |
| | గ 2 | 9 | గ 2 | |
| సాధారణగాంధారము (3) | | 10 | | సాధారణగాంధారము (3) |
| అంతరగాంధారము (4) | | 11 | | అంతరగాంధారము (4) |
| మృదుమధ్యమము (2) | | 12 | | చ్యుతమధ్యమము (2) |
| | మ 4 | 13 | మ 4 | అచ్యుతమధ్యమము (2) |
| | | 14 | | |
| | | 15 | | |
| మృదుపంచమము (3) | | 16 | | త్రిశ్రుతి పంచమము (3) |
| | ప 4 | 17 | ప 4 | కైశికీ పంచమము (4) |
| | | 18 | | |
| | | 19 | | |
| | ధ 3 | 20 | ధ 3 | చతుశ్రుతిధైవతము (4) |
| | | 21 | | |
| | ని 2 | 22 | ని 2 | |

(3) ఇప్పటి వాడుకలోనుండు శుద్ధవికృతి స్వరముల వివరము, (4) గ్రామత్రయనిర్ణయం. (5) వాదిసంవాది లక్షణము. వీనిని లక్షణ సంగ్రహములో జూడుఁడు. (6) తానము. తానమనునది స్వరముల విస్తరింపు. అది శుద్ధతానము కూటతానములని రెండు విధంబులు. (1) శుద్ధ తానమనునది స్వరంబులు వరుసక్రమంబుగా వచ్చెడి తానము. ఇది ఔడవ, షాడవ, సంపూర్ణంబులుగా నుండును. (2) కూటతానంబనునది స్వరంబులు వరుసక్రమంబు దప్పికన్నట్లు (వక్రముగ) కలిసివచ్చుతానము. ఇది ఆర్చిక, గాథిక, సామిక, స్వరాంతర, ఔడవ, షాడవ, సంపూర్ణ భేదంబులు గలిసియుండును. వీని నామ, సంఖ్య, ఫలము మొదలైనవానిని గ్రంథవిస్తర భీతిచే నిచట జెప్పలేదు. గనుక, వీనిని సంగీత రత్నాకరము మొదలైన గ్రంథములచే దెలియదగినది. (7) గానక్రియలైన వర్ణములను లక్షణసంగ్రహములో జూడుడు. ఈ వర్ణక్రమంబుల ననుసరించి శార్ఙ్గదేవులు ప్రసన్నాది నామంబులతో 63 అలంకారములు జెప్పియున్నారు. అలంకారములు లేని గీతి ప్రకాశింపదనుటకు భరతమునులు

శ్లో. శశినారహితేవనిశా విజలేవనదీ లతావిపుష్పేవ,
అవిభూషితేవ కాంతా గీతిరలంకార హీనాస్యాత్.

(రాగవిబోధం)

(8) గమకము: శ్రోతృచిత్త సుఖావహమైనస్వరముల కదలింపు గమకము. అది లక్షణ సంగ్రహములో జెప్పినట్లే, తిరుపము మొదలు మిశ్రితము:వరకుగల పదియైదువిధంబులుగలవు. గమక వివరమునకు పిమ్మట గమకములతో జేర్చియు జేర్చకను సంగీతరత్నాకరమందు స్థాయములని పదివిధధ్వనిభేదములు జెప్పబడియున్నవి. ఏదైన ఒక స్వరశ్రుతిని అల్పముగా దగ్గించియు నెక్కించియు స్వరాంతరముగా (రెండు స్వరములకు నడిమివచ్చునట్లు) ఒకస్వరముకు గనుపింప బడినదైన స్వరకాకు అనుపదియు స్థాయభేదమే. ఆ పదిస్థాయభేదములును వాని అవాంతర భేదములును జెప్పునట్టయితే పెరుగును. (9) మేళము. మేళము అనునది పూర్వాచార్యులైన శార్ఙ్గదేవులకాలమందు జాతియను పేళ్ళచే ప్రకాశించుకొనియుండెను, శార్ఙ్గదేవులు జాతి పదునెనిమిదియని జెప్పియున్నారు. వానిలో పదునొకటి మధ్యమగ్రామము జేరినవియు, ఏడు జాతులు షడ్జగ్రామము జేరినవియుగా నగును. మధ్యమగ్రామజాతులు పదునొకండు. అవియేవి యనిన: 1. షడ్జకైశికీ 2. షడ్జోదీచ్యవా 3. షడ్జమధ్యమా 4. గాంధారోదీచ్యవా 5. రక్త గాంధారీ 6. కైశికీ 7. మధ్యమోదీచ్యవా 8. కార్మారవీ 9. గాంధారపంచమీ 10. ఆంధ్రీ 11. నందయంతీ. షడ్జగ్రామజాతులు ఏడు. అవి యెవ్వియనిన: 1. షాడ్జీ, 2. ఆర్షభీ, 3. గాంధారీ, 4. మధ్యమా, 5. పంచమీ, 6. ధైవతీ, 7. నైషాదీ.

(10) రాగము: ఈరెండుగ్రామములనుండి జనించిన రాగములు మార్గము, దేశీ యను భాగములవలన పదివిధములగును. మార్గరాగము లేవియనిన. 1. గ్రామరాగము, 2. ఉపరాగము, 3. రాగము, 4. భాష, 5. విభాష, 6. అంతరభాష అని ఆఱువిధములు. దేశీరాగము లేవియనిన. 1. రాగాంగము, 2. భాషాంగము, 3. ఉపాంగము, 4. క్రియాంగము అను నాలుగు విధములు. గ్రామరాగమైనది క్రమముగా షడ్జగ్రామ మధ్యమగ్రామ జాతులనుండి జనించిన రాగములు. ఉపరాగము మొదలైన ఐదువిధములు గ్రామరాగముల ననుసరించిన వేఱ్వేఱుభాగములు. ఈ రాగములు.

శ్లో. గ్రహాంశ మంద్రతారాశ్చ న్యాసాపన్యాసకౌతథా,
అల్పత్వంచ బహుత్వంచ షాడవౌడవయోరపి. (రత్నాకరం)

గ్రహ అంశ మంద్ర తార న్యాస అపన్యాస అల్పత్వ బహుత్వ షాడవ ఔడవమ్ములైన పదిలక్షణములతో విలసిల్లుకొనియుండును. శార్ఙ్గదేవులు 264 రాగములును వాని లక్షణములును సంగీతరత్నాకరములో జెప్పియున్నారు. అవి వాడుకలోనుండి తొలగినవని వెంకటమఖి జెప్పియున్నారు. పూర్వాచార్యులైన మతంగమునులచే ఇరువదిరాగములు జెప్పబడియున్నవి.

అవి శ్రీరాగము మొదలు నట్టనారాయణిని కడపటిదిగా గొనియున్నవి. 1. పూర్వమందు పురుషరాగము స్త్రీరాగము అని విభాగింపబడియున్నవి. ఇప్పటికిని బంగాళమందు పురుషరాగములు ఆఱు. స్త్రీరాగములు ఆఱు. ఒక్కొక్కటికి ఆఱువంతున పుత్రరాగములు ముప్పదియాఱు. అంతు నలువది యెనిమిదిగా జెప్పుచున్నారు. వానికి స్వరూపములైన పటములను ఏర్పఱచిబెట్టుకొనియున్నారు. దేశీరాగమునుజేరిన క్రియాంగరాగము దేవతాస్తుతి శోకోత్సాహయుద్ధవీరపరాక్రమములైన క్రియలకు ఉపయోగింపబడు రాగమనబడును. ఇది పూర్వకాలములో మిగులవాడుకలోనుండెను.

(2) శ్లో. శుద్ధంతు శివరూపేణ శక్తిరూపేణసాలగం. రాగము శుద్ధ, సాలగ, సంకీర్ణములని మూడువిధములందురు (1) శుద్ధమనునది శాస్త్రములో జెప్పినలక్షణములన్నియుగల రాగము. (2) సాలగమనునది అనేకముగా శుద్ధరాగమునుబోలి వేఱొక రాగచ్ఛాయయును జెంది రంజనము నిచ్చునదియగును. (ఛాయ = సదృశము, లగము = జెందుట.) (సాలగము అనునది ఛాయాలగపదవికారము.) (3) సంకీర్ణమనునది పలురాగములుగలిసి రంజనమును ఇచ్చుట యగును. ఇమ్మూటికిని క్రమముగా ఇప్పటివాడుకలోగల శంకరాభరణం, భైరవి, జుజావంతి మొదలైన కొన్నిరాగముల చెప్పవచ్చును. (3) ఉత్తమ మధ్యమ అధమరాగములు అని రాగములు మూడువిధములగును. (1) ఉత్తమరాగము గీతప్రబంధ తాయాలాపములు మొదలైనవి జేయుటకు యోగ్యమైనది. (2) మధ్యమరాగము గీతప్రబంధాలాప తాయములు

మొదలైనవానికి యోగ్యముగా నుండియు అధికప్రచారములోలేనిది. (3) అధమరాగము గీత ప్రబంధాలాప తాయములు మొదలైనవానికి యోగ్యము లేనిదియును, సంకీర్ణమును, పామరులు భ్రమింపదగినదియును ప్రచారముండుండు నదియునైనది.

(11) గీతి. గ్రామరాగంబులు శుద్ధ గ్రామరాగం, భిన్నగ్రామరాగం, గౌడగ్రామ రాగం, వేసరగ్రామరాగం, సాధారణీగ్రామరాగం అని యైదువిధంబులుగా భాగింపబడి శుద్ధగీతి, భిన్నగీతి, గౌడగీతి, వేసర గీతి, సాధారణిగీతి యని గీతులు పాడుటకుపయోగింపబడి వచ్చినవి.

(12) తాళము: మార్గం దేశీ యని రెండు విధంబులగును. (1) మార్గతాళము చచ్చత్పుట. చాచపుట, షట్పితాపుత్రక, సంపద్వేష్టాక, ఉద్ఘట్టంబులని ఐదువిధంబులగును. వాని అంగంబులును. అక్షరకాలంబును క్రింద గనుపింపబడుచున్నవి.

| తాళనామంబులు. | అంగములు. | అక్షరకాలంబులు |
|---|---|---|
| (1) చ చ్చ త్పు టం | 2 2 2 1 3 | 40 |
| (2) చా చ పు టం | 2 1 1 2 | 30 |
| (3) ష ట్పి తా పు త్ర కం | 3 1 2 2 1 2 | 60 |
| (4) సంపద్వేష్టాకం | 3 2 2 2 3 | 60 |
| (5) ఉ ద్ఘ ట్టం | 2 2 2 | 30 |

ఈ ఐదు మార్గతాళములును పరమేశ్వరుడు తాండవముజేసినకాలంబున ఈశానాదిపంచ ముఖములనుండి కలిగినవని సంగీతరత్నాకరంబున జెప్పబడియున్నవి. ఈ ఐదు తాళంబులే పూర్వ మందుండినవి. వీనికి తాళంబులకేర్పడిన పదిప్రాణంబులును గలవు. ఈ ఐదు తాళంబులకు

శ్లో. పంచలఘ్వక్షరోచ్చార మితిమాత్రేహకథ్యతే.

ఐదులఘ్వక్షరముల నుచ్చరించుకాలము ఒక మాత్రయగును. కాబట్టి ఒక లఘు 5 అక్షర కాలము, గురు పది అక్షరకాలము, ప్లుతము 15 అక్షరకాలము. ఇప్పటికాలమున ఈతాళములకు మాత్రయొకటి నాలుగు అక్షరకాలముగా బెట్టుకొని పాడుచున్నారు. కల. కల అనునది చచ్చ త్పుటము మొదలయిన మార్గతాళములందే ఉపయోగింపబడును. కల అనుట "గురుఃకలాత్ర" గురు అను అంగమని శార్ఙ్గదేవులు జెప్పియున్నారు. మార్గతాళములైదును ఒక్కొక్కటియు మూడువిధములగును. అవి యథాక్షరతాళము (ఏక కలాతాళము) ద్వికలాతాళము, చతుష్కలా తాళము. యథాక్షరతాళము అనునది చచ్చత్పుటము మొదలైన ఐదుతాళములకు నేర్పడిన ప్రమాణము. ద్వికలా తాళమనునది యథాక్షరతాళముయొక్క రెట్టింపు కలలను గలది. చతు ష్కలాతాళమనునది యథాక్షర తాళముయొక్క నాలుగుభాగములనుగలది. పై జెప్పిన కలలు

మార్గతాళముల గురువును దోపజేయుచున్నవి. తక్కిన దేశీతాళ లక్షణముల లక్షణ సంగ్రహ ములో జూడుడు.

### వాగ్గేయకారక లక్షణము

శ్లో. వాఙ్మాతురుచ్యతే గేయం ధాతురిత్యభిధీయతే,
వాచం గేయంచ కురుతే యస్సవాగ్గేయకారకః.

శబ్దరూపమైన సాహిత్యముమాతు. స్వరరూపమైనవర్ణమెట్టు ధాతు; ఈ రెంటిని జేయు వాడు వాగ్గేయకారకుడు. సుశబ్దాపశబ్దముల దెలియదగిన వ్యాకరణము, అమరకోశాదినిఘంటు వులు, అనుష్టుప్ మొదలైన ఛందస్సులు, ఉపమాద్యలంకారంబులు, శృంగారాదిరసంబులు, విభా వాది భావంబులు, సంగీతాదికలలు, తౌర్యత్రికంబులు, సుశారీరము, ద్రుతము మొదలైన లయ, చచ్చత్పుటాదితాళంబులు, అప్పటప్పటికి క్రొత్తక్రొత్తగా వికసింపగల ప్రజ్ఞయను ప్రతిభ, ద్వేష రోషపరిత్యాగము, చిత్తార్ద్రత (సరసత్వము), ఉచితజ్ఞత, ప్రబంధరచనా ప్రౌఢిమ, సభలో జయిం చుట, అన్యులచిత్తంబులెఱుగుట, శీఘ్రముగా గీతంబుల నిర్మించుట, త్రిస్థానంబులందు గమక వ్యాపకంబులతోను, రాగరూపకాది విశేషంబులతోను ఆలాపించుట, చిత్తైకాగ్రత ఇవికలిగినవాడే వాగ్గేయకారకుడు. (2) మిక్కిలి ధాతురచనకలగి మాతురచనయందు మందముగలవాడును, ధాతు మాతువులుదెలిసి ప్రబంధంబులందు ప్రౌఢము లేనివాడును మధ్యముడు. (3) రమ్య ముగ మాతురచనగలిగి మందమైన ధాతురచనగలవాడు అధముడు. (4) కథాసందర్భములతో ధాతుమాతువుల రచించు వస్తుకవివరుడనబడును. (5) వర్ణకవి. (వర్ణించుకవి) మధ్యముడు. ఒకరిపల్లవేయబడినమాతునకు వర్ణక్రమంబులతో ధాతునేర్పరించువాడనియు, లేక పల్లవిని మట్టు నెత్తుకొని దానినే క్రమనులు దప్పక కల్పనలతో వర్ణించి పాడువాడనియు కొందఱు. (6) మార్గదేశీయముల నెఱిగినవాడు గాంధర్వుడు. (7) మార్గముమాత్ర మెఱిగినవాడు స్వరాది, (8) ఇతరుల సాహిత్యపు ధాతులో (వర్ణమెట్టులో) మాతుకల్పన సేయువాడు కుట్టి కారుడు, వీడు అధమాధముడు. (9) మనోహరంబైన శబ్దోచ్చారణము, సుశారీరము, గీతా రంభపరిసమాప్తములుజేయుటయందు సమర్థత, రాగాంగాదిరాగంబుల ఎఱుక, ప్రబంధగానశీలత, బహువిధాలాపంబుల దెలియుట, సకలస్థానములందు నాయాసము లేక నుచ్చముగ గమకంబుల ప్రకాశపఱచుట, కంఠస్వాధీనము, సావధానము, శ్రమములేమి, సకలదోషంబుల వర్జించుట, అభ్యాసతత్పరత, దేశభాషాజ్ఞానము వినువారల మోహింపజేయుట, ఇవిగలిగినవాడే గాయనుడు. (10) గుణములు కొంచెము తక్కువగానుండినను దోషములేనివాడు మధ్యముడు. (11) దోష ముతోగూడినవాడు అధముడు. (12) శిక్షకారుడు అన్యులకునేర్పించును. (13) అనుకారుడు అన్యులభంగిననుసరించును. (14) రసికుడు రసంబులనెఱిగించును, (15) రంజకుడు వినువారిని

రంజింపజేయును. (16) భావుకుడు గానంబున మిక్కిలి ప్రకాశంబును జూపును. (17) ఏకలుడు ఒంటిగా గానముసేయును. (18) యమళుడు. ఇద్దఱు గానముసేయును. (19) బృందకుడు గుంపునజేరి గానముసేయును. (20) మీదజెప్పిన గాయనులవలెనే మాధుర్యముగల ధ్వనులును రూపయౌవనములును చాతుర్యములునుగల గాయనీమణులును గలరు.

## గాయక దోషంబులు

| | | |
|---|---|---|
| 1. సందష్టుడు | పండ్లు గఱచుకొని | పాడును. |
| 2. ఉద్ఘృష్టుడు | విరసంబుగనధికధ్వనితో | ,, |
| 3. భీతుడు | భయముతో | ,, |
| 4. శంకితుడు | సందేహంబుతో త్వరితంబుగ | ,, |
| 5. కంపితుడు | అవయవంబుల కంపముతో | ,, |
| 6. వికలుడు | స్వరంబుల హెచ్చుతగ్గులతో | ,, |
| 7. వితాళుడు | తాళమును విడిచి | ,, |
| 8. కరభుడు | ఒంటెపిల్లవలె గొంతును నిడిపించుకొని | ,, |
| 9. ఉద్వడుడు | *మేకనెమరువేయుటవలె నోరుకదలించి | ,, |
| 10. ఝోంబకుడు | గొంతు, నుదురు మొగంబులనరంబులు దెలియునట్లు | ,, |
| 11. నిమీలకుడు | కండ్లుమూసుకొని | ,, |
| 12. విరసుడు | రంజింపు (రుచి) రసములులేక | ,, |
| 13. అపస్వరుడు | స్వరశ్రుతులను విడిచి | ,, |
| 14. అవ్యక్తుడు | గద్గదకంఠంబుతో అక్షరము దెలియక | ,, |
| 15. స్థానభ్రష్టుడు | త్రిస్థానంబుల విడిచి | ,, |
| 16. అవ్యవస్థితుడు | స్వరస్థానంబుల విడిచి వ్యవస్థలేక | ,, |
| 17. మిశ్రకుడు | రాగంబుల గలిపి | ,, |
| 18 అనవధానుడు | గమకస్థానంబుల దప్పి | ,, |
| 19. అనునాసికుడు | ముక్కుతో | ,, |
| 20. సూత్కారి | ఉస్ ఉస్ అని సీత్కారముతో | ,, |
| 21. కరాళీ | భయముగలుగునట్లు నోరుదెఱచుకొని | ,, |
| 22, తుంబకి | సొరకాయవలె బుగ్గలనుబ్బజేసుకొని | ,, |
| 23. కాకి | కాకమువలె క్రూరధ్వనితో | ,, |

*దీనినే దవడతానము లేక మేక తాన మందురు.

| | | |
|---|---|---|
| 24. వక్రీ | గొంతును వక్రము జేసుకొని | ,, |
| 25. ప్రసారీ | గానప్రవర్తనమువలె కరాద్యవయవచేష్టలతో పాడును | ,, |

ఇవిగాక గాయన గుణదోషవిశేషంబులు మఱియు గలవు. వానిని రత్నాకరమున జూడుడు.

**శారీర లక్షణము**

శ్లో. తారానుధ్వని మాధుర్య రక్తి గాంభీర్యమార్దవైః
ఘనతాస్నిగ్ధతాకాంతి ప్రాచుర్యాది గుణైర్యుతం
తత్సుశారీరమిత్యుక్తం లక్ష్యలక్షణకోవిదైః.

తారస్థాయి ననుసరించునట్టి ధ్వని, చెవులకింపు, రంజనము, గంభీరత, మృదుత్వము, ఘనము, వినువారల మోహింపజేయుట, అధికశోభ ఇవి మొదలైన గుణములుగలది సుశారీరమని లక్ష్యలక్షణజ్ఞులు జెప్పుదురు. కుశారీరము.

శ్లో. అనుధ్వాన విహీనత్వం రూక్షత్వం త్యక్తరక్తితా
నిస్సారతా విస్వరతా కాకిత్వం స్థానవిచ్యుతిః
కార్శ్యం కార్కశ్య మిత్యాద్యైః కుశారీరం కుదూషణైః.

శ్రుతిని అనుసరించని ధ్వని, క్రూరత్వము, రంజనములేమి, రుచిలేమి, స్వరవిహీనము, కాకధ్వని, స్థానభ్రష్టము, కృశత్వము, కఠినము, ఇత్యాది దోషంబులుగలది కుశారీరమని జెప్పుదురు.

శ్లో. విద్యాదానేన తపసా భక్త్యావాపార్వతీపతేః
ప్రభూతభాగ్య విభవైః సుశారీర మవాప్యతే.

విద్యాదానము, తపస్సు, శివభక్తి. జన్మాంతరపుణ్యవిశేషము వీనిచేతనే మంచిశారీరము కలుగునని తాత్పర్యము.

# సంగీతలక్షణ సంగ్రహము

## సంగీత ప్రశంస

శ్లో. విఘ్నౌఘ హారిణం సర్వ భక్తాభిమతకారిణం,
వారణాస్య మహంవందే మౌళావర్ధేందు ధారిణం.

శ్రీమదఖండపరిపూర్ణ సచ్చిదానంద పరమాత్మ స్వరూపుడైన భగవంతునిచేత శ్రోత్రానందమును, ఆత్మానందమును గలిగించునాదముల రంజనములు గలుగునట్లు విభాగించి యేర్పఱచబడిన విద్యను సంగీతశాస్త్రమందురు. గీతము (గానము) వైదికగానము, వ్యాఖ్యాగానము, లౌకికగానము, కేవల లౌకికగానమని నాలుగువిధములు. సామగానమును వైదికగానమనియు, ఋషిప్రోక్తములైన గద్యము, పద్యము లేక గద్య పద్యములుగానుండు రామాయణాది గ్రంథముల గానమును వ్యాఖ్యాగానమనియు. సంస్కృతభాషచేతను దేశభాషలచేతను దేవతాస్తుతులుగా నిబద్ధములుగా గాని అనిబద్ధములుగాగాని సేయుగానమును లౌకికగానమనియు, దేవతాస్తుతులు లేకనే చేసెడిగానమును కేవల లౌకికగానమనియు సూతసంహితలో చెప్పబడియున్నది.

శ్లో. గీతిగానేన యోగస్స్యాత్ యోగాదేవ శివైక్యతా,
గీతిజ్ఞోయదియోగేన సయాతి పరమేశ్వరం. (సూతసంహిత)

గనుక, భక్తితో నొకదేవతనుగుఱించి గానముసేయు గాయనులకు చిత్తైకాగ్రత కలుగును. చిత్తైకాగ్రతయే యోగము. యోగముచేత పరమాత్మైక్యత్వము కలుగును.

శ్లో. కావ్యాలాపాశ్చయే కేచిద్గీతాని సకలానిచ
శబ్దమూర్తి ధరస్యైతే విష్ణోరంశా మహాత్మనః. (విష్ణుపురాణం.)
సంగీతము భగవదంశమని తాత్పర్యము.

శ్లో. నాహంవసామి వైకుంఠే నయోగిహృదయే రవౌ,
మద్భక్తాయత్రగాయంతే తత్రతిష్ఠామి నారద.

ఓయి నారద! నేను వైకుంఠమందును, యోగీశ్వరుల హృదయములందును, సూర్యమండలమందును వసింపలేను. నాదు భక్తులు యెచ్చోట గానము సేయుచున్నారో అచ్చటనే వసింపుచున్నాను. అని భగవద్వాక్యము.

శ్లో. త్రివర్గఫలదాస్సర్వే దానయజ్ఞ జపాదయః,
ఏకం సంగీతవిజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదం. (శివసర్వస్వము.)

దానయజ్ఞ జపాదులన్నియు త్రివర్గములైన ధర్మార్థకామ మోక్షముల నిచ్చుచున్నవి. సంగీతజ్ఞానమొకటియే చతుర్వర్గములైన ధర్మార్థ కామ మోక్షముల నిచ్చుచున్నదియని పరమేశ్వర వాక్యము. సంగీతమును గాంధర్వవేదమందురు. గాంధర్వము పదునెనిమిది విద్యలలో నొకటి. ఈపదునెనిమిది విద్యలకు సృష్టికర్త పరమేశ్వరుఁడే.

శ్లో. అష్టాదశానాం ఏతాసాం విద్యానాం భిన్నవర్త్మనాం,
ఆదికర్తాకవిస్సాక్షా చ్ఛూలపాణిరితి శ్రుతిః.

అని మహాభారతములో శాంతిపర్వమున రాజధర్మములో జెప్పబడియున్నది. ఎల్లప్పుడును గానము వినవలెనను కాంక్షచేతనే పరమేశ్వరుడు కంబళ అశ్వతరులనెడు నాగరాజులను కుండలరూపములుగా ధరించుకొనియున్నాడని సంగీతరత్నాకర వ్యాఖ్యానకారులైన కల్లినాథులు వచించియున్నారు. గానమువలన సరజ్ఞుడైన సదాశివుడును, వేణుగానమువలన విష్ణువును, సామగానంబువలన చతురాననుడును, వీణాగానమువలన సరస్వతియును ప్రీతిబొందుచున్నారు. జ్ఞానహీనములైన శిశుపశుఫణిమృగాదులు గానరస వశమగుచున్నవి. గానముచేత చేతనములు అచేతనములును, అచేతములు చేతనములునుగా నగుటవలన జ్ఞానముగల మానవులు* సంగీతజ్ఞానము నగరంగి తృప్తిబొందుట కేమిసందేహమున్నది!

సామవేదాదిదంగీతం సంజగ్రాహ పితామహః. (రత్నాకరం)

సంగీత రత్నాకరమందు శార్ఙ్గదేవులచే జెప్పబడిన సంగీతాచార్యులలో మూడవ ఆచార్యులైన బ్రహ్మదేవుడు సప్తస్వరములుగల సామవేదములోనుండి సంగీతమును గ్రహించెను.

తస్యగీతస్య మాహాత్మ్యం కేప్రశంసితుమీశతే,
ధర్మార్థకామ మోక్షాణా మిదమేవైకసాధనం. (రత్నాకరం)

ధర్మార్థకామ మోక్షములకు యీసంగీతమే ముఖ్యసాధనముగానున్నది. కాబట్టి యీ సంగీతవిద్యయైనది మిగులమహిమగలదిగానున్నది.

---

*శ్లో. సంగీతసాహిత్యరసానభిజ్ఞస్సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః
అనెడి ఈ ప్రాచీనశ్లోకమందు సంగీతరసము తెలియని మనుష్యుని తోఁక కొమ్ములులేని పశువుగా చెప్పియుండుటవలన యీపశువు అద్భుతమైన పశువని తలచవలెను ఇదిగాక ఆంగ్లేయ భాషా పండితుడైన షేక్స్పియర్ అనునొక మహాకవి సంగీతమువలన కరఁగని మనుష్యుడు ప్రాణిహింస, రాజద్రోహము మొదలైనవి సేయభయపడడని జెప్పియున్నాడు.

శ్లో. వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతి విశారదః,
తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం సగచ్ఛతి.

(యాజ్ఞవల్క్యస్మృతి)

వీణావాదనముల స్వభావమునెఱిగినవాడును, శ్రుతిజాతుల వివేచనములు దెలిసిన వాడును, తాళమును దెలిసినవాడుగా నెవడున్నాడో వాడుప్రయాసములేక మోక్షమును బొందుచున్నాడు, మహాభూతములును గానమునకు స్వాధీనముపడుచున్నవియని పలువిద్వాంసుల చరిత్రములువినబడుచున్నవి. రమారమి 400 సంవత్సరములకు మునుపుండిన గోపాలనాయకుడనే వారు* ఉత్తరదేశములో నొకరాజసభయందు దీపకరాగమునుపాడి దీపమునంటింప జేసినట్లును, తంజావూరి మహారాష్ట్రరాజసభయందు రమారమి 150 సంవత్సరములకు మునుపుండిన వీరరాఘవయ్య యనువైణిక శ్రేష్ఠులు గాలిలేని వేసంగికాలములో వసంతరాగమును వాయించి చల్లగాలినిరప్పించినట్లును, దానివలన "చల్లగాలివీరరాఘవయ్య" యనిమహారాజు పేరిచ్చి నట్లును, ఈదక్షిణదేశములో ప్రబలవిద్వాంసులై 100 సంవత్సరములకు మునుపుండినవారును, నాదు పెత్తండ్రియునైన ముద్దుస్వామిదీక్షితులనేవారు వానలేనికాలమున అమృతవర్షిణియనేరాగమును పాడి వానను రప్పించినట్లును వాడుకొనుచున్నారు. గ్రంథవిస్తరభీతిచేత ఈసంగీతప్రశంసను ఇంత నుట్టుతో చాలించుకొంటిని.

శ్లో. శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణీ,
స ఏవశ్శంకరోవేత్తి సమగ్రం వేత్తినాపరః.

అను నీశ్లోకార్థమువలెనే సంగీతశాస్త్రములో జెప్పబడియున్న సకల లక్షణ లక్ష్యములను సకలవిద్యలకును ప్రథమాచార్యుడైన సదాశివుడొకడే యెఱుగునుగాక, తక్కినవారెవరునెఱుగ నేరరు. గనుక పెద్దల యనుగ్రహబలమువలన కొంత ఎఱిగిన నేను సమస్తమును జెప్ప నెంతయు శక్తుడుకాను. అయినను ప్రాచీనసంగీతశాస్త్రములు విశేషముగానుండినప్పటికిని తనకు మునుపటిది యైన 300 సంవత్సరముల సంప్రదాయము ననుసరించినవారును. 250 సంవత్సరములకు మునుపుం డినవారును, సంస్కృతభాషలో విశేషపాండిత్యముగలవారును, గంగావతరణ కావ్యగ్రంథకర్తలైన నీలకంఠదీక్షితులవారి గురువును, దక్షిణదేశ సంగీత సంప్రదాయోద్ధారక మూలపురుషులునైన వెంకటమఖిచే తనచతుర్దండి ప్రకాశికలో జెప్పబడిన సంప్రదాయములైన లక్ష్యలక్షణములు మిక్కిలి

---

* ఈ గోపాలనాయకులు తాళార్ణవరాగకదంబములను ప్రబంధంబులు జేసియున్నాడని కల్లినాథులు సంగీతరత్నాకర తాళాధ్యాయ వ్యాఖ్యానమందును, గోపాలనాయకులే శ్రుతులనెఱిగినవారని వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశికలో శ్రుతిప్రకరణమందును జెప్పియున్నారు. ఈగోపాలనాయ కుడు కల్లినాథులకు మునుపటివారు.

దుర్లభముగా నుండుటవలన తెలిసినమట్టు ఆసంప్రదాయముల దెలియనివారికి దెలియపరచవలెనని కలిగినయపేక్షచే వ్రాయదొరగొంటిని. పూలతోజేరిన నారును మహానదులను జేరిన ఊరివరద నీరునుబోలె. "వెంకటేశ్వరదీక్షితులు" అను వెంకటమఖి మొదలయిన మహానుభావుల లక్షణ లక్ష్యములతో జేరిన నాదువచనములను, పసిబిడ్డలతొక్కుపలుకులవిని ఆనందించి లాలించు తల్లిదండ్రులవలె మహాత్ములు గ్రహించి నన్ను అనుగ్రహించి ఆదరింతురుగాక!

# లక్షణ సంగ్రహము

## సంగీతము

శ్లో. చైతన్యం సర్వభూతానాం వివృతింజగదాత్మనాం,
నాదబ్రహ్మతదానంద మద్వితీయ ముపాస్మహే.
గీతం వాద్యం తథానృత్యం త్రయం సంగీతముచ్యతే. ( రత్నాకరం )
గీతము, వాద్యము, నృత్యము ఈమూటిని సంగీతమందురు.
గీతవాద్యోభయం యత్ర సంగీతమితి కేచన.
గీతవాద్యముల మాత్రము కొందఱు సంగీతమని చెప్పుచున్నారు.

**నాదము:**- సంగీతమునకాధారము నాదము.

శ్లో. నకారం ప్రాణనామానం దకారమనలంవిదుః,
జాతః ప్రాణాగ్ని సంయోగాత్తేన నాదోఽభిధీయతే.

నాదశబ్దమునగల నకారము ప్రాణమనియు, దకారము అగ్నియనియు సంజ్ఞగావున ప్రాణాగ్ని సంయోగమువలన నాదము కలుగుచున్నది.

శ్లో. ననాదేన వినాగీతం ననాదేనవినాస్వరః,
ననాదేన వినారాగః తస్మాన్నాదాత్మకంజగత్.

నాదములేనిచో గీతమును, నాదములేనిచో స్వరమును, నాదములేనిచో రాగమును లేవు. గనుక ప్రపంచము నాదస్వరూపముగానున్నది. మనుష్యశరీరములో ఆకాశాగ్నులు సంబంధించి వాయుకంపమువలనగలిగెడి సూక్ష్మధ్వనులేనాదములు. ఆనాదములు హృదయము కంఠము శిరస్సు అనెడి మూడుస్థానములలో వ్యాపించి ముఖమువలన వెడలుచున్నవి.

శ్లో. నాదాచ్ఛ్రుతయోజాతాస్తేభ్యోషడ్జాదయస్స్వరాః,
తేభ్యోరాగ స్సముత్పన్నో గీతం తస్మాచ్ఛజాయతే,
అతోనాదాత్మకం గీతం వాద్యంగీతానువర్తిచ.

నాదమువలన శ్రుతులును. శ్రుతులవలనషడ్జాదిస్వరములును, స్వరములవలన రాగమును, రాగమువలన గీతమును. కలుగుచున్నది కాబట్టి, గీతమునాదస్వరూపము వాద్యము గీతము ననుసరించినది.*

శ్రుతి:- నాదమెప్పుడును ఒకేరీతిగానుండక నతిమందముగాను అత్యుచ్చముగానుండును. ఈ విధమైవేల్వేలు విధముగాసేయదగిననాదములలో నతిమందమైన నాదముమొదలుఅత్యుచ్చమైన నాదమువరకు నొకటికొకటిహెచ్చై విడివిడిగాసేయదగిన నాదములు అఱువదియాఱువిధములౌను. వీనిలో మొదటి ఇరువదిరెండునాదములు మంద్రభాగనాదములనియు, రెండవయిరువదిరెండునాదములు మధ్యభాగనాదములనియు, మూడవయిరువదిరెండునాదములు తారభాగనాదములనియు జెప్పబడును. ఈవిధ వ్యత్యాసములగు నొక్కొక్కభాగమందుగల ఇరువదిరెండు నాదములును పూర్వాచార్యులచే శ్రుతులని వ్యవహరింపబడియున్నవి. "శ్రూయంత ఇతి శ్రుతయతిః" అను వ్యుత్పత్తిచేత శ్రుతి యనిపేరొందెను. (శ్రుతి = వినదగినది.)

[స్థాయి. శ్లో.- మంద్రోహృన్మధ్యమః కంఠశ్శిరస్తారక సంజ్ఞికం. అనునట్లు మంద్రశ్రుతులు ఇరువదిరెండును హృదయమందును, మధ్యశ్రుతులు ఇరువదిరెండును కంఠమందును, తారశ్రుతులు ఇరువదిరెండును శిరస్సునందును కలుగుచున్నవియని జెప్పుచున్నారు. ఈ మంద్రమధ్యతారములు క్రమముగా మంద్రస్థాయి, మధ్యస్థాయి. తారస్థాయి *యనివచింపబడును. (స్థాయి—స్వరములు నిలిచెడి చోటు.)

[స్వరము:- ఈ శ్రుతులు విడివిడిగాను వ్యక్తముగాను శబ్దించవు గనుక వ్యక్తముగ వినదగినదియును, ఇంపుగలదియునుగా నుండునటుల శ్రుతులను పంచి పూర్వాచార్యులచే రంజనముగల యక్షరములచే జేర్చిపలికింపబడియుండుటయే స్వరమనబడును.

1. స్వతోరంజయతి శ్రోత్రం స్వరఇత్యభిధీయతే. తానే రంజనమునీయగలది స్వరమని తాత్పర్యము. (౨) మధుకణలేశ మొక్కొకటియును స్వభావమున తీపుగలదిగా నుండినప్పటికిని కొన్ని కణలేశములు జేరియొకబిందుమాత్రమైతేకాని యనుభవించువారికి తీపునీయనేరదు. అటు

---

* గ్రద్దపక్కియొక్క ఛాయ యెటుల నాగ్రద్దపులుగు ననుసరించియేగునోఅటులనే వాద్యగాని వాచనము గాయకునిగానము ననుసరించి యేగును.

* మంద్రమును తగ్గుస్థాయియనియు, మధ్యమును సమస్థాయియనియు, తారమును హెచ్చుస్థాయి యనియు, జెప్పుదురు. ఈమూటిని త్రిస్థాయియనిపలుకుదురు. ఒకజంత్రమందు మంద్రమునకు క్రిందను తారమునకు మీదను ఎన్నిస్థాయిలు యుండినప్పటికిని స్థాయి యొకటికి యిరువదిరెండేసి శ్రుతులు గలవని యెంచవలెను.

వలెనే మధుకణలేశములుబోలిన కొన్ని శ్రుతులనొకటిగా గూర్చి యింపుగల యొక స్వరరూపముగా గావింపబడెను. (3) ఒక రస స్వరూపముగానే యన్ని స్వరములునుండినట్టయితే తేనెను మాటిమాటికి విడువక భుజించువారికి యెటులరుచింపనోపదో అటులనే రంజనముగలిగింపదు. ఆహారసుఖ మపేక్షించువారును వేలువేలు రుచులనీయగల షడ్రసపదార్థముల జేర్చి భుజించి తృప్తిబొందుదురు. కాబట్టి యొకటికొకటి హెచ్చువేలుబడిన కొన్నికొన్ని శ్రుతులచేరికవలనగలిగిన ప్రత్యేకరకములైన ఋషభము మొదలగు ఆఱుస్వరములును షడ్రుచుల జేర్చి భుజించుటకు ఆధారమైన అన్నముబోలిక షడ్జస్వరమునొకటిగా జేర్చియేడుస్వరములుగా ప్రాచీనాచార్యులైనపరమశివుడమర్చియున్నాడు. (4) మీద జెప్పబడిన శ్రుతులచేకూర్పబడిన సప్తస్వరములునుమంద్రమధ్యతారములనెడు మూడుస్థాయిలయందును గానము సేయబడును. శ్రుతుల సంబంధముగల ఏడు స్వరముల పేళ్లును, వానిసంకేతాక్షరములును. ఒక్కొక్కస్వరము ఇన్నిఇన్ని శ్రుతులుగలవియనియు క్రింద జూపింపబడియున్నవి.

| | | | |
|---|---|---|---|
| మొదటి స్వరము | షడ్జము | స | ( 4 శ్రుతులు ) |
| రెండవ స్వరము | ఋషభము | రి | ( 3 ,, ) |
| మూడవ స్వరము | గాంధారము | గ | ( 2 ,, ) |
| నాల్గవస్వరము | మధ్యమము | మ | ( 4 ,, ) |
| ఐదవ స్వరము | పంచమము | ప | ( 4 ,, ) |
| ఆఱవస్వరము | ధైవతము | ధ | ( 3 ,, ) |
| ఏడవస్వరము | నిషాదము | ని* | ( 2 శ్రుతులు ) |

ఈ సప్తస్వరముల సంకేతాక్షరములు ఆదిమొదలు వాడబడివచ్చుచున్నవి యనుటయివి ఛందస్సు, శిక్షయను వేదాంగములందును, అధర్వణవేదమునుజేరిన ప్రాచీనఉపనిషత్తు ( గర్భోపనిషత్తు ) ఒకటియందును గనబడుటచేత ప్రకాశించును.

౫. ఒకస్థాయియందుగల ఏడుస్వరములకు సప్తకము అనియు, వీనితో నీస్థాయికిపైనిగల స్థాయిషడ్జమును జేర్చుటవలనగలుగు స, రి. గ, మ, ప, ధ, ని, స, అనుఎనిమిది స్వరములకు అష్టకము అనియుపేరు.

---

*ఈ సప్తస్వర సంకేతాక్షరములలో (స) అను అక్షరము పరమశివునియందును, (రి, గ, మ, ప, ధ,) యను అక్షరములు క్రమముగా సదాశివుని యొక్క సద్యోజాతాది పంచముఖములందును, (ని) అను అక్షరము మహేశ్వరునియందును ఉద్భవించినట్లు గోవిందామాత్యులు తనరాగతాళ చింతామణియను పద్యకావ్యములో జెప్పియున్నారు.

శ్లో. తత్రతుర్యశ్రుతౌ షడ్జ స్సప్తమ్యాం ఋషభోమతః,
తతో నవమ్యాం గాంధార స్త్రయోదశ్యాంతు మధ్యమః,
పంచమ స్సప్తదశ్యాంతు ధైవతోవింశతిశ్రుతౌ,
ద్వావింశేతు నిషాదస్యాచ్ఛ్రుతిష్విత్థం స్వరోద్భవః,
ఏతేషడ్జాదయ స్సప్తస్వరాఃశుద్ధాఃప్రకీర్తితాః ( స్వరమేళ కళానిధి )

పైజెప్పబడిన ఏడుస్వరములును ఇరువదిరెండు శ్రుతులలో నాలుగవశ్రుతియందు షడ్జమును, ఏడవశ్రుతియందు ఋషభమును, తొమ్మిదవ శ్రుతియందు గాంధారమును, పదమూడవ శ్రుతియందు మధ్యమమును, పదునేడవశ్రుతియందు పంచమమును, ఇరువదవశ్రుతియందు ధైవతమును, ఇరువదిరెండవశ్రుతియందు నిషాదమునుకలుగుచున్నవి. షడ్జముమొదలైన ఈఏడును శుద్ధ స్వరములని రామామాత్యులచే తన స్వరమేళకళానిధిలో జెప్పబడియున్నది. ఇటులనే సంగీతరత్నాకరము మొదలైన గ్రంథములందును. జెప్పబడియున్నది.

7. ఈ ఏడుశుద్ధ స్వరములనే ప్రకృతిస్వరములని జెప్పుదురు.

8. ఈయేడుశుద్ధస్వరములలో షడ్జము పంచమము దక్క తక్కిన ఋషభగాంధార మధ్యమధైవతనిషాదములైన ఐదుశుద్ధస్వరములు ఎప్పుడును ఒకనాదముగానే శబ్దించక శ్రుతిభేదములవలన వేఱు వేఱు ధ్వనులుగలవిగా శబ్దించుచున్నవి. ఈరీతిగా శ్రుతిభేదములవలన వికారమందు స్వరములు వికృతిస్వరములని జెప్పబడును.

9. శుద్ధ ( ప్రకృతి ) స్వర వికృతిస్వర నిరూపణము: (1) శుద్ధస్వరములు తమజన్మస్థానములైన నియతశ్రుతులందే యుండునప్పుడు తమకుగలశ్రుతులు తగ్గినప్పటికిని వికృతిస్వరములుగా కానేరవు. అనగా వికారమందని శుద్ధస్వరములే. ఉదాహరణము- షడ్జమునకుగల నాలుగు శ్రుతులలో మూడవశ్రుతియందుకాకలి నిషాదముదోచియది షడ్జముయొక్క మూడుశ్రుతులజెంది నప్పుడు షడ్జము మిగిలిన ఒకేశ్రుతిగలదిగా యున్నప్పటికిని తన నియతశ్రుతిని విడిచిజారకుండుట వలన అదిశుద్ధస్వరమే. ఏస్వరముతనదు నియతశ్రుతినివిడిచి వేఱొకశుద్ధస్వరముగలుగు శ్రుతియందుగాని, శుద్ధస్వరములు గలుగనివేఱుశ్రుతియందుగాని కలుగుచున్నదో ఆస్వరము వికృతిస్వరమనబడును.

10. వికృతి స్వరములెవ్వియనిన:- 1. పంచశ్రుతిఋషభము, 2. షట్ఛ్రుతి ఋషభము, (3) సాధారణగాంధారము, (4) అంతరగాంధారము, (5) వరాళిమధ్యమము, (6) పంచశ్రుతి ధైవతము, (7) షట్ఛ్రుతిధైవతము, (8) కైశికినిషాదము, (9) కాకలినిషాదము.

11. మీద గనుపించిన ఇరువదిరెండు శ్రుతుల పేళ్లును, వానినుండి ఏడుస్వరములును, తొమ్మిదివికృతి స్వరములును గలిగించెడిరీతిని దీనిక్రింద ఈ కాలవ్యవహారమువలె వెంకటమఖి విరచిత చతుర్దండి ప్రకాశిక ననుసరించి గనుపింపబడిన శ్రుతిపథకమున జూడుడు.

| | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని |
| I | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| | తీవ్ర | కుముద్వతి | మంద | ఛందోవతి | దయావతి | రంజని | రక్తిక | రౌద్రి | క్రోధ | వజ్రిక | ప్రసారిణి | ప్రీతి | మార్జని | క్షితి | రక్త | సందీపని | ఆలాపని | మదంతి | రోహిణి | రమ్య | ఉగ్ర | క్షోభిణి |
| | ధ<br>ని | | ని | | | | | | రి | రి<br>గ | | గ | | | | మ | | | | | | ని |

12 ఈ పథకములో శ్రుతిబంతులకుపైన శుద్ధస్వరములును, శ్రుతిబంతులకు క్రింద వికృతిస్వరములును వ్రాయబడియున్నవి.

13. పైగనుపించిన శ్రుతిపథకమునగలఇరువదిరెండు శ్రుతులలో మొదటి శ్రుతియందు కాకలినిషాదమును; నాలుగవశ్రుతియందుషడ్జమును; ఏడవశ్రుతియందు శుద్ధఋషభమును; తొమ్మిదవశ్రుతియందు శుద్ధగాంధారమును, పంచశ్రుతిఋషభమును; పదియవశ్రుతియందు సాధారణ గాంధారమును, షట్ఛ్రుతి ఋషభమును; పన్నెండవశ్రుతియందు అంతరగాంధారమును; పదమూడవ శ్రుతియందు శుద్ధమధ్యమమును; పదునారవశ్రుతియందు వరాళిమధ్యమమును;*, పదియేడవ శ్రుతియందు పంచమమును; ఇరువదియవ శ్రుతియందుశుద్ధధైవతమును; ఇరువదిరెండవశ్రుతియందు శుద్ధనిషాదమును, పంచశ్రుతిధైవతమును గలుగుచున్నవి.

14. శుద్ధస్వరములు ఏడు, వికృతిస్వరములుతొమ్మిది. అంతుపదియారు స్వరములు మీద జూపించినట్లు ఇరువదిరెండుశ్రుతులలో పదిరెండు (12) స్థానములనుండికలుగుచున్నవి. అందువల్లనే వీణమొదలైన జంత్రవాద్యములలో నీపదియాఱుశుద్ధవికృతస్వరముల నుపయోగ పఱచుటకై పదిరెండుస్థానములేర్పడినవి. వీనినిక్రిందజూడుడు.

---

* ఇది ఈకాలమున ప్రతిమధ్యమమని వాడబడుచున్నది.

(1) శుద్ధఋషభము (2) శుద్ధగాంధారము, లేకపంచశ్రుతిఋషభము; (3) సాధారణ గాంధారము, లేకషట్ఛ్రుతిఋషభము; (4) అంతరగాంధారము; (5) శుద్ధమధ్యమము; (6) వరాళి మధ్యమము; (7) పంచమము; (8) శుద్ధధైవతము; (9) శుద్ధనిషాదము, లేక పంచశ్రుతిధైవతము; (10) కైశికినిషాదము, లేక షట్ఛ్రుతిధైవతము; (11) కాకలినిషాదము; (12) షడ్జము*

15. ఈస్వరములు వీణలోమేరువుగాక పదిరెండుమెట్లలో పదిరెండుస్థానములందు గలవు. ఈస్థానములవీణలోజూడుడు.

16. ఒక్కొక్క ప్రకృతివికృతిస్వరములకుఇన్ని ఇన్ని శ్రుతులు గలవనుటను శ్రుతివీణవలననెఱుగ నగును. ఆశ్రుతివీణ ఇపుడు వాడుకలోగల సర్వరాగమేళవీణయందు మధ్యస్థాయిని* 1-6-8వ మెట్లకు నడిమిని రెండేసిమెట్లను, 2-4-9-11వ మెట్లకు నడిమిని యొక్కొక్కమెట్టను, 3-5-7-10-12 ఈమెట్లులుండినట్లును బెట్టితే శ్రుతి వీణయగునని వెంకటమఖి జెప్పియున్నారు. అటుల బెట్టుటవలన నొక్కొక్క ప్రకృతి స్వరములకును, అలప్రకృతి స్వరస్థానము నాశ్రయించుటవలన గలుగు నొక్కొక్క వికృతిస్వరములకును ఇన్ని ఇన్ని శ్రుతులుగలవని యెఱుగుటయుగాక నుచ్చోచ్చ తరమైన నాదభేదముల నెఱుగవచ్చును. ఇవియన్నియు నీక్రిందగనుపింపబడిన శ్రుతివీణాపథకమున జూడుడు.

## శ్రుతివీణా పథకము

II 1 2 3 4 5 6 7 8 9 10 11 12

మేరువు

* మధ్యస్థాయిషడ్జము స్థానములేక సారణితంతినుండి కలుగుటవలన స్థానములుగల మధ్యస్థాయి ఋషభము మొదలుకొని యెత్తుకొనబడినదియుగాక నిచ్చటషడ్జమునకై తారస్థాయిషడ్జ మెత్తుకొనబడినది.

* స్వరరాగమేళవీణలో మధ్యస్థాయినిగల స్వరస్థానములు (ఇండ్లు) విరివిగానుండుటవలన మధ్యస్థాయి యెత్తుకొనబడెను.

## వాది; సంవాది; అనువాది; వివాది

శ్లో. వాదీసయః ప్రయోగే బహుళోరాజా, యయోస్తుమధ్యేస్యుః,
ద్వాదశ వాష్టౌ శ్రుతయోఽమాత్యౌ సంవాదినౌ తౌస్తః,
ఏకశ్రుత్యంతరితౌ వివాదినౌ వైరిణౌ మిథోభవతః,
అనువాదినస్తు శేషాభృత్యా ఇత్థంయథార్థాస్తే (రాగవిబోధం)

(1) వాది, ఒకరాగమునగల అంశస్వర (జీవస్వర)మునుబోలి మాటిమాటికి నుపయోగ పరచెడి స్వరము వాదియనబడును. ఆవాదిరాజునకు సదృశమైనది (2) సంవాది రెండుస్వరములకు నడుమ నెనిమిది లేక పదిరెండు శ్రుతులుండితే ఆరెండుస్వరములును పరస్పరము సంవాదుల నబడును. ఆ సంవాది వాది యైనరాజునకు మంత్రిని బోలినది.

(ఉదాహరణము) i సమౌ, సపౌ, రిధౌచైవ నిగౌసంవాదినౌ మిథః,

ఏవంశుద్ధస్వరేషూక్త స్సంవాది స్వరనిర్ణయః. (చతుర్దండిప్రకాశిక)

శుద్ధస్వరములలో (స—మ), (స—ప), (రి—ధ), (ని—గ) ఇవిపరస్పరము సంవాదులగును.

ii శుద్ధశ్చ మధ్యమశ్శుద్ధ నిషాదశ్చేత్యుభౌస్వరౌ,
శ్రుత్యష్టకేనాం తరితావపి సంవాదినౌనహి. (చతు.ప్ర)
శుద్ధమధ్యమ శుద్ధనిషాదములు తమనడుమ నెనిమిదిశ్రుతులు గలిగియున్నప్పటికిని పరస్పరము సంవాదులుగా కానేరవు.

iii సాధారణాఖ్యగాంధార కైశికాఖ్యనిషాదయోః,
తథైవాంతర కాకల్యో స్సంవాదో వికృతేష్వపి,
శుద్ధర్షభేణ సంవాదీ వరాళీమధ్యమస్తథా. ( చతు. ప్ర )

వికృతిస్వరములలో సాధారణగాంధారమును, కైశికినిషాదమును; అంతరగాంధారమును కాకలి నిషాదమును, శుద్ధఋషభమును, వరాళిమధ్యమమును పరస్పరము సంవాదులగును.

(3) వివాది: రెండుస్వరములనడుమ నొకశ్రుతియుండితే ఆరెండుస్వరములును పరస్పరము వివాదులగును. ఆవివాది శత్రువునకు సదృశమైనది.

ఉదా : రిగౌధనీ చశుద్ధేషు స్వరౌస్యాతాం వివాదినౌ,
సాధారణాంతరౌచైవ కైశికీ కాకలీ, స్వరౌ,
మిథోవివాదినౌజ్ఞేయౌ వికృతేషుస్వరేష్వపి. (చ. ప్ర.)

శుద్ధస్వరములలో (రి—గ): (ధ—ని) ఇవిపరస్పరము వివాదులగును. వికృతస్వరములలో సాధారణగాంధారము లేక షట్ఛ్రుతి ఋషభమును, అంతరగాంధారమును; కైశికినిషాదము లేక షట్ఛ్రుతిధైవతమును, కాకలి నిషాదమును పరస్పరము వివాదులగును.

(4) అనువాది. వాది, సంవాది, వివాది, కానిస్వరములు అనువాదులగును. ఆ అను వాది శ్రుత్యునివంటిది. ఈ వాది సంవాది అనువాది వివాదులనుగనిపెట్టు మార్గమును యీ క్రింద జూపింపబడిన వీణాప్రస్తారపఠకమున జూడుడు.

III

1 2 3 4 5 6 7 8 9 10 11 12 13 14 15 16 17 18 19 20 21 22

(5) మీదజెప్పియుండుట పరిశోధించితే డెబ్బదిరెండు మేళములలో గలిగెడిరాగముల పాడుటయందు, 1. శుద్ధఋషభమునుండి శుద్ధగాంధారమునకు ఎక్కుట; 2. శుద్ధగాంధారమున నుండి శుద్ధఋషభమునకు దిగుట; 3. షట్ఛ్రుతిఋషభమునుండి అంతరగాంధారమునకు ఎక్కుట; 4. అంతరగాంధారముననుండి షట్ఛ్రుతిఋషభమునకు దిగుట; 5. శుద్ధధైవతమున నుండి శుద్ధ నిషాదమునకు ఎక్కుట; 6. శుద్ధనిషాదముననుండి శుద్ధధైవతమునకుదిగుట; 7. షట్ఛ్రుతిధైవత మున నుండి కాకలినిషాదమునకుఎక్కుట; 8. కాకలినిషాదముననుండి షట్ఛ్రుతి ధైవతమునకు దిగుట; ఈ ఎనిమిది విధములందును వివాదిదోషములు గనబడుచున్నవిగావున, ఈ ఎనిమిది విధ ములు దక్క తక్కిన స్వరపులను ఏరీతిగా బట్టిననురంజనము చెడదు.

6 ఈ ఎనిమిది విధములయిన వివాదిస్వర ఆరోహణ అవరోహణములు మొదటి చక్ర మును జేరిన మొదటి ఆరుమేళములందును, ఆఱవచక్రమును జేరిన 31, 32, 33, 34, 35, 36వ మేళములందును, ఏడవచక్రమును జేరిన 37, 38, 39, 40, 41, 42వ మేళములందును, పన్ రెండవచక్రమును జేరిన 67, 68, 69, 70, 71, 72వ మేళములందును, ఒక్కొక్కచక్రము యొక్క మొదటిదియు, కడపటిదియునైన మేళములందును, అనగామీదజూపించిన మేళములలో

1, 6, 31, 36, 37, 42, 67, 72వ మేళములు దక్క తక్కిన 7, 12, 13, 18, 19, 24, 25, 30, 43, 48, 49, 54, 55, 60, 61, 66వ మేళములందును గనుబడుచున్నవి. ఈ నలువది (40) మేళములందును పాడునప్పుడు వాదివివాది లక్షణముల ననుసరించియేపాడుట సంప్రదాయము గానున్నది. అదిఎటులనిన, వివాదిస్వరమును అనేకముగా వర్జించియైనను. లేక శత్రువునకు సదృశమైన వివాదిస్వరమందు వాది, సంవాది, అనువాది స్వరములలోనేదైననొక స్వరముయొక్క ఛాయను గమకముచే నెక్కించి (గమకములను కపటక్రియలచే) వివాదిని మిత్రునివలెజూపించియైనను పాడుటసంప్రదాయజ్ఞులవాడుకగానున్నది. ఇట్లు సేయనియెడల వివాదిస్వర ప్రయోగముచే గానముయొక్క రంజనముచెడును. ఇదియే భరతమతంగాదిమునులమతము.

## గ్రామము

శ్లో. యథాకుటుంబినస్సర్వే ఏకీభూతాభవంతిహి,
తథాస్వరాణాం సందోహోగ్రామఇత్యభిధీయతే.

కుటుంబముగలవారు అనేకులుచేరి ఒకగ్రామమెట్లగునో అటుల మూర్ఛనయును, మూర్ఛనాభేదములవలన గలుగుమేళములును సంభవించుటకుపయోగనులైన స్వరసముదాయముల చేరికయే గ్రామమనబడును. ఈగ్రామముగాంధార గ్రామము, మధ్యమగ్రామము, షడ్జగ్రామము లని మూడు విధములనబడును. ఈ గ్రామముక్రమముగా గాంధారము, మధ్యమము, షడ్జములను స్వరములను మొదలుగాగలవి. (1) గాంధారగ్రామము షడ్జముమొదలు ధైవతమువరకుగల సరిగమపధ యను స్వరములు మూడేసి శ్రుతులును, నిషాదమునాలుగు శ్రుతులునుగలదియగును.

(2) మధ్యమగ్రామము : సోపాంత్యశ్రుతి సంస్థేస్మిన్మధ్యమగ్రామ ఇష్యతే.

పంచమము సాందీపినియనెడు తనదు మూడవ శ్రుతి స్థానమును జెంది 4, 3, 2, 4, 3, 4, 2 శ్రుతులను క్రమముగా పొందిన స, రి, గ, మ, ప, ధ, ని, యను స్వరములు గలదియగును.

(3) షడ్జగ్రామము : షడ్జగ్రామఃపంచమేస్వచతుర్థశ్రుతి సంస్థితే, పంచమము నాలుగు శ్రుతులతో గూడి 4, 3, 2, 4. 4, 3, 2 శ్రుతులను క్రమముగాపొందిన స, రి, గ, మ, ప, ధ ని. యనుస్వరములు గలదియగును. వీనిక్రమములను క్రిందగనుపింపబడిన శ్రుతిగ్రామ పథకమున గమనించిజూడుడు.

| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గాంధార గ్రామము | | | స | | | రి | | | గ | | | మ | | | ప | | | ధ | | | | ని |
| మధ్యమ గ్రామము | | | | స | | | రి | | గ | | | | మ | | | ప | | | | ధ | | ని |
| షడ్జ గ్రామము | | | | స | | | రి | | గ | | | | మ | | | | ప | | | ధ | | ని |

(2) శ్లో॥ గాంధారగ్రామమూచష్టే తదాతం నారదోమునిః.
ప్రవర్త్తతే స్వర్గలోకే గ్రామోసౌన మహీతలే. (రత్నాకరం.)

గాంధారగ్రామము స్వర్గలోకములో ప్రకాశించుచున్నది యనినారదులుచెప్పినట్లు శార్ఙ్గదేవులచే రత్నాకరమున జెప్పబడియున్నది.

(3) ద్వౌగ్రామౌ విశ్రుతౌలోకే షడ్జమధ్యమసంజ్ఞకౌ, (భరతులు)

అనిభరతమునులుచెప్పినట్లు ఆమునీంద్రునికాలమందే షడ్జగ్రామము, మధ్యమగ్రామములను రెండు గ్రామములు మాత్రము వాడుకలోనుండినట్లు తెలియబడుచున్నది. పైజెప్పినరెండు గ్రామములును వాడుకయందున్నట్లు శార్ఙ్గదేవులును జెప్పియున్నారు. రమారమి 400 సంవత్సరములకు మునుపు గలిగిన సంగీతపారిజాతమను గ్రంథమందు

(4) మూర్ఛనాధారభూతాస్తేషడ్జగ్రామస్త్రిషూత్తమః (సంగీత పారిజాతం.)

ఈశ్లోకము చొప్పున ఆకాలమందే మధ్యమగ్రామము వాడుకలోలేనట్లును సంగీతజ్ఞులు శ్లాఘ్యముగా షడ్జగ్రామమును మాత్రము వాడుకలో బెట్టుకొనివచ్చినట్లును తెలియవచ్చుచున్నది.

(5) తథాహిమధ్యమగ్రామే త్రిశ్రుతిః పంచమఃఖలు,
అస్మాభిర్మధ్యమ గ్రామోప్యసత్వాయఇతీర్యతే,
ఏక ఏవతతష్షడ్జగ్రామ ఇత్యవధార్యతే. (చతుర్దండిప్రకాశిక)

మధ్యమ గ్రామమునగల త్రిశ్రుతి పంచమమైనది లక్ష్యమార్గమువలన వరాళీమధ్యమమగుచున్నది. కాబట్టి షడ్జగ్రామ మొకటియే గ్రహింపబడుచున్నదియని వెంకటమఖి జెప్పియున్నారు.

## మూర్ఛన

శ్లో. క్రమాత్స్వరాణాం సప్తానాం. ఆరోహశ్చావరోహణం,
మూర్ఛనేత్యుచ్యతేతాస్తు ప్రతిమేళంచసప్తధా. (చతుర్దండి.)

క్రమముగా సప్తస్వరములయొక్క ఆరోహణమును, అవరోహణమును మూర్ఛనయని చెప్పబడుచున్నది. (1) ఆరోహణము. స రి, గ, మ, ప, ధ, ని యనియెక్కుట. (2) అవరోహణము. ని, ధ, ప. మ. గ, రి, స యని దిగుట. (మూర్ఛనయను శబ్దమునకువినువారిని మోహింపజేయుటయని యర్థము,

(2) షడ్జము మొదలు నిషాదమువరకు ఆరోహణమువలనను, నిషాదము మొదలు షడ్జమువరకు అవరోహణమువలనను మొదటిమూర్ఛన కలుగుచున్నది. ఇటులనే ఋషభము మొదలు మీదిస్థాయిషడ్జమువరకు ఆరోహణమువలనను, ఆషడ్జముమొదలు ఋషభమువరకు అవరోహణమువలనను రెండవమూర్ఛన కలుగుచున్నది. ఇటులనే గాంధారముమొదలైన స్వరములొక్కొక్కటియందును ఒక్కొక్క మూర్ఛన కలుగుచున్నది. దీనిక్రమమును క్రిందజూడుడు.

| ఆరోహణము | అవరోహణము |
|---|---|
| స రి గ మ ప ధ ని , | ని ధ ప మ గ రి స . |
| రి గ మ ప ధ ని స , | స ని ధ ప మ గ రి . |
| గ మ ప ధ ని స రి , | రి స ని ధ ప మ గ . |
| మ ప ధ ని స రి గ , | గ రి స ని ధ ప మ . |
| ప ధ ని స రి గ మ , | మ గ రి స ని ధ ప . |
| ధ ని స రి గ మ ప , | ప మ గ రి స ని ధ . |
| ని స రి గ మ ప ధ , | ధ ప మ గ రి స ని . |

ఇటుల సప్తస్వర స్వరూపములు గలవిగా జెప్పబొయ్యేడి డెబ్బదిరెండు మేళములలో నొక్కొక మేళములందును ఏడేసి మూర్ఛనలు వెంకటమఖివల్ల జెప్పబడియున్నవి.

## తానము

స్వరముల విస్తరింపు, లేక గుణించుట. అదిశుద్ధతానము కూటతానములని రెండు విధములగును. (1) ఒకరాగము ప్రకాశిల్లునట్లు జూపించుటయే శుద్ధతానము. (2) రెండురాగములు ప్రకాశిల్లునట్లు జూపించుటయే కూటతానము. ఈకూటతానము భాషాంగరాగ స్ఫూర్తిచేగలుగు తానమని కొందరెంచెదరు. భాషాంగరాగము తనజనక రాగస్వరములుగాక ఏదైన వేఱొకరాగాంగ రాగ స్వరమును మాత్రము విధించినట్లుపాడుటయే యగును. ఉదాహరణము. రాగాంగమైన

హరికేదారగౌళగీతములో భాషాంగరాగములతో జేర్చి జెప్పబడియున్న కాంభోజిరాగమునకు కైశికి నిషాదమేవచ్చును. అటులుండినప్పటికిని (స ని ధ సా) అను ప్రయోగమందుమాత్రము కాకలి నిషాదము రావచ్చునని విధించియున్నారు. తక్కినచోటులన్నియు కైశికి నిషాదమే రావలెను. ఇటువంటి భాషాంగరాగముచేత రెండురాగప్రకాశములు గలుగనేరవు గనుక లక్షణ కారులు జెప్పినట్లు కూటతానములలో ముందటి సగమందొక రాగమును, మరుసటి సగమందొక రాగమును ప్రకాశింపవలెను. భాషాంగరాగమువలన కూటతానమును రెండు రాగప్రకాశము గలదిగా నెంచుట సరికాదని దోచుచున్నది. కాంభోజిబోలిన భాషాంగరాగముల రాగాంగ రాగ గీతములలో జేర్చి విరచించిన వెంకటమఖియే కూటతానము భాషాంగరాగ ప్రకాశముగలదియని జెప్పవచ్చును. అట్లు చెప్పక రెండు రాగవ్యక్తి గలదియని జెప్పియుండుట నూహింపుడీ.

## వర్ణము

శ్లో. గానక్రియోచ్యతే వర్ణస్స చతుర్ధా నిరూపితః
స్థాయ్యారోహ్యా వరోహీచ స్థాయీ సంచారిణౌతథా.

వర్ణమనునది గానముయొక్క క్రియ. అది స్థాయి, ఆరోహి. అవరోహి, సంచారి యని నాలుగువిధములగును. (1) స్థాయి వర్ణము. ఏ స్వరమందు ప్రారంభించునో ఆ స్వర మందే తిరుగవచ్చి నిలిచెడి గానక్రియ స్థాయీవర్ణమగును. ఉదాహరణము: సా సా సా; సా సా సా; సా పా సా; స గ రి స; రి గ మ ప మ గ రీ. (2) ఆరోహివర్ణము: ప్రారం భించిన స్వరమందుండి క్రమముగా నెక్కెడి గానక్రియ ఆరోహివర్ణ మగును. ఉదాహ రణము: సా రి గా; రీ గ మ ప ధా. (3) అవరోహివర్ణము: ప్రారంభించిన స్వరమందుండి క్రమముగా దిగెడి గానక్రియ అవరోహివర్ణ మగును. ఉదా: స ని ధ ప మ గ రీ; ని ధ ప మ గా; ధ ప మ గ రి సా. (4) సంచారి వర్ణము. పై జెప్పిన మూడు వర్ణములను కలిసెడి గాన క్రియ సంచారివర్ణ మగును. ఉదా: స మ గ ని దా; స ని ధ ప ధా; రి మ గ మ గ రి సా. ఈ కాలమందు పై జెప్పిన వర్ణక్రమముల ధాతువను స్వరములతో జేరిన మాతువను సాహిత్య ముల మాత్రము వర్ణమెట్టని జెప్పుచున్నారు.

## అలంకారము

శ్లో. క్రమేణ స్వరసందర్భ మలంకారం ప్రచక్షతే (రత్నాకరం.)

ఈ వర్ణ భేదములను అనుసరించి క్రమముగా స్వరముల జేర్చుటయే అలంకారము నబడును. గానమునకు అందమును గలుగజేయునది అలంకారమని తాత్పర్యము. అహోబల

పండితునిచే తన సంగీత పారిజాతమున జెప్పబడిన ఏడు ప్రసిధలంకారములతో స్వరావళి[1] (సరళి) అనెడి ఝోంపటా తాళముతో జేరిన అలంకారము ఒకటిని జేర్చి వెంకటమఖి ఎనిమిది అలంకారములుగా జెప్పియున్నారు. (1) ఝోంపటాలంకారము. ఇది ఝోంపటా తాళముతో జేరినది. ఈ ఝోంపటాతాళము[2] నాలుగక్షరకాలముగల ఒక లఘువును, రెండేసి అక్షరకాలముగల రెండు ద్రుతములును గలది యగును. ఇది రెండు మాత్రలు. స రి గ మ | ప ధ | ని స ॥ స ని ధ ప | మ గ | రి స ॥ ఇప్పుడు వాడుకలోనుండు సరళి, వరుసలు, జంట సరళి, జంట సరళి వరుసలు పై జెప్పిన ఝోంపటాతాళాలంకారముగానే యున్నవి. (2) ధ్రువాలంకారము. ఇది ధ్రువ తాళముతో జేరినది. ఈతాళము ఆఱు అక్షరకాలములుగల లఘు శేఖరమును[3] నాలుగేసి అక్షర కాలములుగల రెండు లఘువులను గలది. అంతు పదునాలుగు అక్షరముల కాలము స రి గ మ గ రి | స రి గ రి | స రి గ మ ॥ (3) మఠ్యాతాళాలంకారము. ఇది మఠ్యాతాళముతో జేరినది. ఈ తాళము నాలుగక్షర కాలముగల ఒక లఘువును రెండక్షరకాలముగల ఒక ద్రుతమును, నాలుగక్షరముగల ఒక లఘువును గలది. అంతు పది అక్షర కాలము. స రి గ రి | స రి | స రి

---

1. ఈ కాలమున వాడుకలో డెబ్బదిరెండు మేళములున్నప్పటికిని, పదునేనవ మేళమైన మాయామాళవ గౌళ మేళమునగల ఈ స్వరావళిని (సరళిని) మొట్టమొదట అభ్యాసమునకు ఎత్తుగొనియుండుటకు కారణమేమనిన? శుద్ధమధ్యమము ముఖ్యముగనుకను, ఋషభధైవత గాంధారనిషాద శుద్ధ వికృతస్వర భేదములలో ఈమేళమును జేరిన ఋషభ ధైవతస్వరములుడక్కు తగ్గిన ఋషభ ధైవతములును, హెచ్చైన ధ్వనిగల గాంధార నిషాదములును లేవుగనుక ఇవి పట్టుబడితే తక్కిన స్వరభేదములును సులభముగా పట్టుబడును. కాబట్టి యీ మేళస్వరములనే అభ్యాసము సేయవలెనని ప్రాచీన సంప్రదాయజ్ఞులు ఏర్పాటుజేసి యుండవచ్చును. ఇదిగాక మన పూర్వీకులు ఆస్తిక మతస్థులు గనుక మంగళమును గోరి నాశములేని శుద్ధ విక్రృతి స్వరములుగల ఈ మేళస్వరావళిని ప్రథమాభ్యాసమునకు ఎత్తుకొని యుండవచ్చునని సంప్రదాయజ్ఞులైన పెద్దలు జెప్పుచున్నారు.

2. వాడుకయందు ఈ ఝోంపటాతాళమును ఆదితాళము అని జెప్పుట ప్రసిద్ధిగా నున్నది ఈ ఝోంపటాతాళము చతురశ్రజాతి త్రిపుటయగును. ఈ ఆదితాళ లక్షణమును ఏకతాళాలంకారము జెప్పుచోట జూడుడు.

3. లఘుశేఖరము అనునది ఆఱక్షరకాలము గలది. నాలుగక్షరకాలముగల ఒక లఘువు రెండక్షర కాలముగల ఒక ద్రుతము అని జెప్పక లఘుశేఖరమని వెంకటమఖి జెప్పిన తాత్పర్యమేమనిన? వైణికులు రంజనముగలుగుటకై లఘుశేఖరముయొక్క ఆఱక్షరములలో మొదటి అక్షరమున తాళఘాతకు బదులు వేసెడి పక్కమీటును తక్కిన రెండు లఘువుల మొదటి అక్షరములందు రెండు పక్క మీట్లను వేసుకొని ధ్రువతాళమును వాయించుటయే. ఈ మార్గము ఇప్పుడును వాడుకగా నున్నది. గాయనులును పై జెప్పిన వాడుకగానే ధ్రువతాళముల వేసుకొని పాడుచున్నారు.

గ మ ॥ (4) రూపకతాళాలంకారము. ఇది రూపకతాళముతో జేరినది. ఈతాళము రెండక్షరకాలముగల ఒక ద్రుతము, నాలుగక్షరకాలముగల ఒక లఘువును గలది. అంతు ఆఱు అక్షరకాలము. స రి | స రి గ మ ॥ (5) జంపెతాళాలంకారము. ఇది జంపె తాళముతో జేరినది. ఈ తాళము ఏడక్షరకాలముగల ఒక లఘువును, ఒక అక్షరకాలము గల ఒక అనుద్రుతమును (విరామమును) రెండక్షరకాలముగల ఒక ద్రుతమును గలది. అంతు పది యక్షరకాలము. స రి గ స రి స రి | గ | మా ॥ (6) త్రిపుటతాళాలంకారము. ఇది త్రిపుట తాళముతో జేరినది. ఈ తాళము మూడక్షరకాలముగల ఒక లఘువును, రెండేసి అక్షరకాలము గల రెండు ద్రుతములును గలది. అంతు ఏడక్షరకాలము. స రి గ | స రి | గ మ ॥ (7) అట్టతాళాలంకారము. ఇది అట్ట తాళముతో జేరినది. ఈ తాళము ఐదేసి అక్షరకాలముగల రెండు లఘువులును, రెండేసి అక్షరకాలముగల రెండు ద్రుతములును గలది. అంతు పదునాలుగు అక్షరకాలము గలది. స రీ గా | సా రి గా | మా | మా ॥ (8) ఏక తాళాలంకారము. ఇది ఏక తాళముతో జేరినది. ఈ తాళము రెండక్షరకాలముగల ఒక ద్రుతముగలది. ఈ ఏకతాళము రంజనము గలిగింపదని ఏకతాళస్థానమునందు ఆది తాళము నుంచబడియున్నది. ఆదితాళము నాలుగక్షరకాలముగల ఒక లఘువుతో జేరినది. (స రి గ మ), ఈ అలంకారములు ఇప్పటి వాడుకలో నున్నవి. సూళాదిమార్గ ములైన పై జెప్పిన ధ్రువము మొదలుగల ఏడు తాళములును, ఝోంపటా తాళమును, ర గ ణ మత్యమను తాళమునుదక్క తక్కిన తాళములను గీతములందు జేర్పదగదని వెంకటమఖి జెప్పియున్నారు. (సూళయను శబ్దమునకు గీతమని యర్థము.) సూళయనునది దేశీయపదము "లడయోరభేదః" అని యుండుటవలన సూడశబ్దములోగల డకారమునకు లకారము వచ్చినది.

## గ మ క ము లు

సంగీత సాంప్రదాయజ్ఞులు గానముజేయునప్పుడు శుద్ధ వికృతి స్వరముల నాదములను ఏర్పడినట్లు బట్టక వినువారికి రంజనముగలుగుటకై మిక్కుటముగ స్వరములను గమకములతో జేర్చి పాడుటయే వాడుక.

శ్లో. (1) స్వరస్య కంపో గమకః శ్రోతృ చిత్తసుఖావహః (రత్నాకరము).
(2) స్వరస్వరంహిగమకః శ్రోతృచిత్త సుఖావహః (చతుర్దండి ప్రకాశిక)

వినువారి చిత్తములకు ఇంపుగలుగునట్లు స్వరములు కదలించుటయే గమకమందురు. చెవులకింపుగలుగునట్లు ఏ స్వరమందును గమకముల నెక్కించవచ్చును.

(2) స్వీయస్థాన శ్రుతిగతాం ఛాయాం హ్యాన్యాశ్రయామపి,
ఛాయాం గమయతీ త్యేష గమకః పరికీర్తితః. (చతుర్దండి.)

ఒక స్వరను ఏ శ్రుతియందు కలుగుచున్నదో ఆ శ్రుతినాదము వేఱుశ్రుతినాదచ్ఛాయ యును పొందజేయుటయే గమకమని జెప్పబడును (ఛాయా = శోభ.) ఈ గమకములు పదు నేను విధములని జెప్పబడి యున్నవి. ఇవి

తిరుపః స్ఫురితశ్చైవ కంపితోలీనఇత్యపి,
ఆందోలితో వలిశ్చాథ త్రిభిన్నః కురుళాహతౌ,
ఉల్లాసితః ప్లావితశ్చ హుంఫితో ముద్రితస్తథా,
నామితో మిశ్రితశ్చేతి భేదాః పంచదశ స్మృతాః (చతుర్దండి.)

1. (1) కంపితము. (—) ఒక స్వరమును ఒక అక్షరకాలము కదలించి దానికి డాసిన మీది స్వరముయొక్క ఛాయను వచ్చునట్లు జేయుట కంపితమగును. (కంపితము = కదలింపు.) (2) లీనము. ఒక స్వరమందే రెండక్షరకాలము నిలిచి కదలించి దానికి డాసిన మీది స్వరము యొక్క ఛాయను రప్పించి లయింపజేయుట లీనమగును. (లీనము = లయింపు, లేక సక్తము తగులజేయుట.) (3) ఆందోలితము. ఒక స్వరమందే నాలుగక్షరకాలమువరకు కదలించి దానికి డాసిన మీది స్వరముయొక్క ఛాయను రప్పించుట ఆందోలనమగును. (ఆందోలితము = ఊఁగడము). (4) ప్లావితము. ఒక స్వరమందే పది రెండక్షరకాలముకదలించి దానికి డాసిన మీది స్వరచ్ఛాయను రప్పించుటయే ప్లావిత మగును, (ప్లావితము = తేలుట)

2. (5) i స్ఫురితము. ( ) స స, రి రి మొదలగున ఆరోహణమునగల జంట స్వరముల వెనుకటి స్వరములందు రమారమి ముప్పాతిక అక్షరకాలము నిలిచి, దానిని గొట్టి దానికి డాసిన క్రింది స్వరముయొక్క ఛాయను రాజేయుట స్ఫురితమగును, ఉదాహరణము స స యొక్క వెనుకటి స ను గొట్టి స స ను స ని స అగునట్లు సేయుట. (స్ఫురితము = తోచుట లేక చలనము.)

ii ప్రత్యాఘాతము. (∵) స స, ని ని మొదలయున అవరోహణ జంట స్వరములందు రెండవ స్వరమును గొట్టి దానిమీది స్వరముయొక్క ఛాయను రాజేయుట ప్రత్యాఘాతమగును. ఉదా: స స యొక్క వెనుకటి స ను గొట్టి స స ను స రి స అగునట్లు వాయించుట. ఈ ప్రత్యాఘాతమును స్ఫురితమునకు మాఱుపాటుగా డోలము అని జెప్పబడియున్నది. డోలముయొక్క కదలింపును ముత్యములోపల నీరు పొరలునట్లుండునని జెప్పుచున్నారు. (డోలము = కదలింపు.)

(6) తిరుపము. ( w ) ఒక స్వరమందు అర అక్షరకాలము నిలిచి దానిని అదిమి దానికి డాసిన మీది స్వరముయొక్క ఛాయను రాజేయుట తిరుపమగును. (తిరుప్ = హింసపరచుట.) ఈ తిరుపము న్గొక్కు అని జెప్పుచున్నారు. (7) ఆహతము. ఇది రవ అనియు,

ఖండింపు అనియు రెండువిధములగును. (ఆహతము = కొట్టుట.) (i) రవ. (^) ఏదైన నొక స్వరముననుండి రాల్చుకొని రాలెడు స్వర చ్ఛాయతో క్రింది స్వరమునకు వచ్చుట. ఉదా: ప మ అని దిగునపుడు ప $\hat{ప}$ మ అని దిగుట.

(ii) ఖండింపు. ( ) ఒక స్వరముననుండి దానికి డాసిన స్వరము లేకనే వేఱొక క్రింది స్వరమునకు దిగునప్పుడు, నడిమినిగల ఏదైన నొక స్వరమును ఖండించి విడిచి, తోడనే దిగెడి స్వరమునకు ఖండింపబడిన స్వరముయొక్క ఛాయను గలుగసేయుట. ఉదా హారణము (మ రి = మ గ రి), (పరి = ప గ రి,)

(8) వళి. (∩) ఒక స్వరమును సుడియించిపట్టి, దాని మీది స్వరముయొక్క ఛాయను రాజేయుట. (వళి = సుడియింపు)

(iii) 9. ఉల్లసితము. దీనిని జారు అని జెప్పుచున్నారు. ఇది ఎక్కుజారు, దిగుజారు అని రెండువిధములగును. (i) ఎక్కుజారు: (/) ఒక స్వరముననుండి దానికి పైనిగల ఏదైన నొక స్వరమునకు ఎక్కునప్పుడు నడుమగల స్వరములను జారినట్లు రాచుకొని యేగుట. ఈ నడుమగల స్వరముల ఛాయ లోపల నణగియుండునేగాక, వ్యక్తముగా వినబడనేరదు. ఉదా: షడ్జముననుండి పంచమమున కెక్కునప్పుడు షడ్జమునందే, పంచమముయొక్క నాదము కలిగి, ఋషభ గాంధారస్వరములను లోపల నణగించుకొని యేగుటయే ఎక్కుజారువగును. (జారు = జారడము) (ii) దిగుజారు. (\) అవరోహణంబున వచ్చెడి ఈ గమకము ఎక్కు జారునకు ఎదురైనది. (10) హుంపితము. (గుంభితము) ఈ గమకము జారువును బోలినదే. వెడలినది మొదలు నిలుచువరకు నాదంబును హుం అని పెరిగించుకొని ఆరోహణ క్రమంబుగా నేగుటయును అవరోహణ క్రమంబుగా దిగుటయును గుంభితమగును. హుంపితము = హుం అని ధ్వనిని వర్ధిల్లజేయుట. (II) కురుళము. ఇది ఒదిగింపు, ఒరయుక అని రెండు విధంబు లగును. (i) ఒదిగింపు, (x) ఇది నోటిపాటయందు జారువును బోలినదే. ఒక స్వర స్థాన మందు దానికి పయినిగల డాసినదిగాని, లేక డాసిన రెండవ స్వరంబును గాని పలికించునట్లు సేయుట ఒదిగింపు అనబడును. ఉదా: ఋషభ స్వరమందు గాంధార స్వరంబునుగాని మధ్యమ స్వరంబునుగాని వీణలు పలికించునట్లు సేయుట.

(ii) ఒరయుక. (ఒరిక) (⌣) ఒక మీది స్వరంబుననుండి క్రిందిస్వరంబులకు దిగునప్పుడు ఒక్కొక్క స్వరములకు వెంబడి దానికి డాసిన మీది స్వరముయొక్క ఛాయను గనుపింప వానిని రాచుకొని దిగుట ఒరిక యనబడును. ఉదా: స ని ధ ప = స రి ని స ధ ని ప. (ఒరిక = రాచుట. (కురుళము = ముంగురులు.) ముంగురుల నుదుటబడక నెటుల ప్రక్క నొదిగించు

కొందరో అటువలె స్వరంబుల నొదిగించి పట్టుటకు ఒదిగింపు అని జెప్పుచున్నారు. (12) త్రిభిన్నము. వీణవాయించు సమయములో మంద్ర పంచమ సారణి తంత్రులందు అడ్డంబుగా డాచేతి వ్రేళ్ళను బెట్టుకొని వలచేతిచే మూడు తంత్రులను శేర్చి మీటుట త్రిభిన్నమగును. ఈ విధంబుగా రంజనమునకయి సేయుట గలదు. (13) ముద్రితము. నోటిని మూసుకొని పాడుటలో గలుగు స్వరముల కదలిక ముద్రితము అగును. ఈ గమకము నోటి పాటకుమాత్రము తగును. (14) నామితము. నాదమును తగ్గించి సూక్ష్మధ్వనితో పాడుటవలన గలుగు స్వరంబుల కదలిక నామితమగును. (15) మిశ్రితము పై జెప్పిన గమకంబులు రెండు మూడు కలసివచ్చునట్లు సేయుట మిశ్రితము అగును.[1]

శ్లో. స్ఫురితః ప్రతిఘాతశ్చ కంపితో లీనఇత్యపి,
ఆందోళితో వళిశ్చాథ హుంపితోల్లాసితౌ తథా.

ఈ శ్లోకంబున గమకంబులు పదియని చెప్పబడియున్నది. ఈ ప్రాచీన శ్లోకము సంప్రదాయజ్ఞులు చెప్పుచున్నారేగాక ఈ గ్రంథమందున్నదియని తెలియలేదు.

మే ళ ము

శ్లో. సప్తభిశ్చ స్వరైః పూర్ణష్షడ్భిస్తైః షాడవోమతః,
ఔడవః పంచభిః ప్రోక్త ఏవం మేళస్త్రిధామతః,
షాడవౌడవాష్షడ్జం వినామేళానతే మతాః,
శుద్ధత్వ వికృతాభ్యాంచ ఇతిమేళామయోదితాః.

(సంగీత పారిజాతం.)

అని 400 వర్షములకు ముందుండిన అహోబలులు తనదు సంగీత పారిజాతంబులో మేళము సంపూర్ణము, షాడవము, ఔడవము అని మూడువిధంబులు. అవి శుద్ధ స్వర వికృత స్వరంబులతో నుండుననియు, షాడవ ఔడవములో షడ్జస్వరము వర్జింపబడదనియు చెప్పియున్నారు. రమారమి ఇన్నూటయేబది సంవత్సరములకు మునుపుండిన వెంకటమఖి ప్రసిద్ధమేళములు పంతొమ్మిది యని తన చతుర్దండి ప్రకాశికలో జెప్పియుండుటయుగాక, డెబ్బదిరెండు మేళములును, తానే కల్పించినట్లును జెప్పియున్నారు. ఈ డెబ్బదిరెండు మేళములు సిద్ధించుటకొఱకై క్రింద గనుపించినట్లు శుద్ధ వికృతి స్వరముల పేళ్ళను, తనచే గల్పింపబడిన వాని సంకేతాక్షరములతో శేర్చి నిరూపించియున్నారు. శుద్ధ వికృతి స్వరములు పదియారుగా నుండినప్పటికిని అవి గలి

---

1. ఈ గమకంబుల వీణలో వాయించి జూపించు విధము ఈ పుస్తకముయొక్క వేఱొక భాగమందు [illegible] ప్రకాశపరచియున్నది.

గెడు స్థానములు పదిరెండు. ఆ పదియేడు స్వరములును వాడుకలో గల సర్వరాగమేళ వీణ లోని పదిరెండు స్థానములలో గనుపింపబడుచున్నవి.

వీణలో మధ్యస్థాయి

| | |
|---|---|
| 1. మొదటి స్థానమున | ర అను శుద్ధ ఋషభమును; |
| 2. రెండవ స్థానమున | రి అను పంచశ్రుతి ఋషభమును,<br>గ అను శుద్ధ గాంధారమును; |
| 3. మూడవ స్థానమున | రు అను షట్శ్రుతి ఋషభమును,<br>గి అను సాధారణ గాంధారమును; |
| 4. నాల్గవ స్థానమున | గు అను అంతర గాంధారమును; |
| 5. ఐదవ స్థానమున | మ అను శుద్ధ మధ్యమమును; |
| 6. ఆరవ స్థానమున | మి అను వరాళీ మధ్యమమును; |
| 7. ఏడవ స్థానమున | ప అను పంచమమును; |
| 8. ఎనిమిదవ స్థానమున | ధ అను శుద్ధ ధైవతమును; |
| 9. తొమ్మిదవ స్థానమున | ధి అను పంచశ్రుతి ధైవతమును,<br>న అను శుద్ధ నిషాదమును; |
| 10. పదియవ స్థానమున | ధు అను షట్శ్రుతి ధైవతమును,<br>ని అను కైశికి నిషాదమును; |
| 11. పదునొకండవ స్థానమున | ను అను కాకలి నిషాదమును; |
| 12. పదిరెండవ స్థానమున | స అను షడ్జమును కలుగుచున్నవి. |

వీనితో రెండవది మూడవదియైన స్థానములు కొన్ని సమయమున రి, రు అనెడి ఋషభములు గాను, కొన్ని సమయమున గ, గి అనెడి గాంధారములుగా నగుచున్నవి యనియు; తొమ్మిదవ పదియవ స్థానములు ధి, ధు అనెడిధైవతములుగాను, న, ని అనెడి నిషాదములుగాను అగుచున్నవి యనియు తెలియవచ్చుచున్నవి. ఒక సమయమునందే రెండవ మూడవ స్థానములు ఋషభ ములుగాను గాంధారములుగాను కానేరవు. ఇటులనే తొమ్మిదవ పదియవ స్థానములు ధైవత ములుగాను, నిషాదములుగాను కానేరవు. ఇట్లు కానేరవనునది స రి గ మ ప ధ ని యనుటలో ఋషభమునకు పైన గాంధారమును, ధైవతమునకు పైన నిషాదమునురావలెనను నియమమువలన స్పష్టమగును. స రి గ మ అనునది పూర్వాంగమనియు, ప ధ ని అనునది ఉత్తరాంగమనియు వెంకటమఖిచే చెప్పబడియున్నది. ఒకశ్రుతి, లేక స్థానము కొన్ని వేళలలో ఋషభముగాను, కొన్ని వేళలలో గాంధారముగాను కావచ్చును. ఉదా: * 1, 2, 3, 4 ఐన సహోదరులు నలుగురు.

* ఈ ఉదాహరణము వెంకటమఖి జెప్పియున్నారు.

వారిలో మొదటివానిపేరు, ర. 4వ వాని పేరు గు. వీరలొకప్పుడును పిన్న పెద్దకానేరరు గావున వేరు పేరులందరు. నడుమగల ఇద్దఱును 1 (ర) మొదలుగా క్రమమున నొక్కొక్కరు పిన్నలై 2 (గ) 3 (గి) అనియు, 4 (గు) మొదలుగా క్రమమున నొక్కొక్కరు పెద్దలై 3 (రు), 2 (రి) అనియు రెండేసిపేరులు వహించుచున్నారు. ర పెద్దవాడగునప్పుడు గ, గి, గు ఐన ముగ్గురిలో నొకడు పిన్నవాడై వెనుక రావచ్చును. రి పెద్దవాడగునప్పుడు గ, గి, గు ఐన ముగ్గురిలో నొకడు పిన్నవాడై వెనుకరావచ్చు. రి పెద్దవాడగు నప్పుడు గి, గు ఐన ఇద్దరిలో నొకడు పిన్నవాడై వెనుక రావచ్చును. రు పెద్దవాడగునప్పుడు గు అనువాడే పిన్నవాడగును. మరియు, గు పిన్నవాడగునప్పుడు ర, రి, రు ఐన ముగ్గురిలో నొకడు పెద్దవాడై ముందుగా వచ్చును. గి పిన్నవాడగునప్పుడు ర రి ఐన ఇద్దరిలో నొకడు పెద్దవాడై ముందుగావచ్చును; గ పిన్నవాడగునప్పుడు ర అనువాడే పెద్దవాడగును. కాబట్టి నడిమినిగల ఇద్దఱు పిన్నలుగాను పెద్దలుగా నగుటవలె పైని జూపించిన 1, 2, 3, 4 స్థానములలో 1 మొదటి స్థానము ఎప్పుడును శుద్ధ ఋషభమే. అది గాంధారము కానేరదు. 4 నాల్గవస్థానము ఎప్పుడును అంతరగాంధారమే. అది ఋషభము కానేరదు. నడుమగల 2, 3 డవ స్థానములు కొన్నిసమయమున ఋషభములుగాను, కొన్ని సమయముల గాంధారములుగాను అగుచున్నవి. ఈ పూర్వాంగము వలెనే ఉత్తరాంగములోగల 8, ,9 10, 11వ స్థానములందు 8వ స్థానము ఎప్పుడును ధ అను శుద్ధ ధైవతమే. అది నిషాదము కానేరదు. 11వ స్థానమెప్పుడును ను అను కాకలి నిషాదమే. అది ధైవతము కానేరదు. నడుమగల 9, 10 యవ స్థానములు కొన్ని సమయములలో న ని అను నిషాదములుగాను అగుచున్నవి. ఈ వివరణముల క్రిందగనుపింపబడిన వాడుకలో గల శుద్ధ వికృతస్వరపథకమున జూడుడు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | రి<br>గ | రు<br>గి | గు | మ | మి | ప | ధ | ధి<br>న | ధు<br>ని | ను | స |

పైజెప్పబడిన శుద్ధ వికృతిస్వరములకు లక్ష్యజ్ఞులిచ్చిన నామములును, లక్షణజ్ఞులిచ్చిన నామములును, వీనికి వెంకటమఖివల్ల నివ్వబడిన ర రి రు మొదలైన సంకేతాక్షరములును క్రింద గనుపింపబడిన పథకమున జూడుడు.

VI

| స్వరములు | లక్ష్యనామములు | లక్షణ నామములు | వెంకటమఖి ఇచ్చిన సంకేతాక్షరములు |
|---|---|---|---|
| షడ్జము | షడ్జము | షడ్జము | స |
| 1 ఋషభము<br>2 మొదటి వికృతి<br>3 రెండవ వికృతి | గౌళ ఋషభం<br>శ్రీరాగఋషభం<br>నాటఋషభం | శుద్ధఋషభం<br>పంచశ్రుతిఋషభం<br>షట్ఛ్రుతిఋషభం | ర<br>రి<br>రు |
| 1 గాంధారము<br>2 మొదటి వికృతి<br>3 రెండవ వికృతి | *ముఖారిగాంధారం<br>శ్రీరాగగాంధారం<br>గౌళగాంధారం | శుద్ధగాంధారం<br>సాధారణగాంధారం<br>అంతరగాంధారం | గ<br>గి<br>గు |
| 1 మధ్యమము<br>2 దీని వికృతి | శుద్ధ మధ్యమము<br>వరాళిమధ్యమము | శుద్ధమధ్యమము<br>ప్రతిమధ్యమము | మ<br>మి |
| పంచమము | పంచమము | పంచమము | ప |
| 1 ధైవతము<br>2 మొదటి వికృతి<br>3 రెండవ వికృతి | గౌళధైవతము<br>శ్రీరాగధైవతము<br>నాటధైవతము | శుద్ధధైవతము<br>పంచశ్రుతిధైవతము<br>షట్ఛ్రుతిధైవతము | ధ<br>ధి<br>ధు |
| 1 నిషాదము<br>2 మొదటివికృతి<br>3 రెండవవికృతి | ముఖారినిషాదం<br>శ్రీరాగనిషాదం<br>గౌళనిషాదం | శుద్ధనిషాదము<br>కైశికనిషాదం<br>కాకలినిషాదం | న<br>ని<br>ను |

*ముఖారి శుద్ధ స్వరములు గలదిగానుండియు వాడుకలో మాఱుబడియున్నది.

(కాని యిది సందిగ్ధము. షడ్జగ్రామమందలి సామవేదస్వరములు శుద్ధస్వరము లను కొన్నచో పాడుకలోని ముఖారిమూఱుపడలేదనవలెను. కనకాంబరి - 1వ మేళము - లోని స్వరములు శుద్ధములని గ్రహించిన తర్వాత ప్రస్తారవశమున వచ్చిన ఔడవ సంపూర్ణ మూర్ఛనను 'శుద్ధముఖారి' గా ఈవల గ్రహించుట జరిగినది, 72 మేళముల ప్రస్తారపద్ధతిలోకలిగిన లోపము లలో ఇది మొదటిదనవచ్చును, (రా. అ.)

ఈ ప్రకృతి వికృతిస్వరముల మాఱుపువలనగలుగు డెబ్బదిరెండు మేళములు ప్రస్తారక్రమ ముగా గనుపింపబడుచున్నవి.

పూర్వాంగము ఉత్తరాంగములైన ర గ మ, ప ధ న స అను శుద్ధ స్వరక్రమము వలన గలుగునది మొదటిమేళము.

ఇకను, ఒక పూర్వాంగమైన ర గ మ చేత ఉత్తరాంగమైన ప ధ న స ను ప్రస్తరించితే

| | | | |
|---|---|---|---|
| 1 ర గ మ | ప ధ న స | ర గ మ ప ధ న స | i |
| | ప ధ ని స | ర గ మ ప ధ ని స | ii |
| | ప ధ ను స | ర గ మ ప ధ ను స | iii |
| | అనగా | | |
| | ప ధి ని స | ర గ మ ప ధి ని స | iv |
| | ప ధి ను స | ర గ మ ప ధి ను స | v |
| | ప ధు ను స | ర గ మ ప ధు ను స | vi |

అని ర గ మ చేత మొదటి ఆఱు ప్రస్తారములుగలిగెను,

ఇటులనే

2 ర గి మ చేత 6 ను; 5 రి గు మ చేత 6 ను;

3 ర గు మ చేత 6 ను; 6 రు గు మ చేత 6 ను;

4 రి గి మ చేత 6 ను;

అంతు 6 × 6 = 36 ప్రస్తారములు మ అను శుద్ధ మధ్యమ ప్రస్తారముచేత గలిగెను. వీనిని పూర్వ మేళములని చెప్పియున్నారు.

ఈరీతిగా మి అను వరాళి మధ్యమమునుబెట్టి ప్రస్తరించితే 1 ర గ మి యను పూర్వాంగముచేత ధ న, ధ ని, ధ ను, ధి ని, ధి ను, ధు ను అని 6 ప్రస్తారములును.

2 ర గి మి చేత 6 ను; 5 రి గు మి చేత 6 ను;

3 ర గు మి చేత 6 ను; 6 రు గు మి చేత 6 ను;

4 రి గి మి చేత 6 ను;

అంతు 6 × 6 = 36 ప్రస్తారములు గలుగుచున్నవి. వీనిని ఉత్తర మేళములు అని జెప్పియున్నారు.

మ మి వలన 36 × 2 = 72 మేళములు కలిగినవి.

శ్లో. ప్రతి మేళమపి స్పష్టం శ్రుతి ర్ద్వావింశతి స్తథా. (చతుర్దండి.)

అను నీ శ్లోకములో జెప్పియున్నట్లు డెబ్బది రెండు మేళములలో నొక్కొక్క మేళమందును ఇరువది రెండు శ్రుతులుండుట స్పష్టమే. ఈ వివరము క్రిందగల మేళపథకమున జూడుడు.

## VII

| *పూర్వ మేళములు — 36 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్వాంగము | | | ఉత్తరాంగము | | |
| సంఖ్య | స్వర భేదము | శ్రుతి భేదము | పంచమ శ్రుతి | స్వర భేదము | శ్రుతి భేదము | శ్రుతుల మొత్తము |
| I | ♭ ర ♭ ♭ గ ♮ మ | 3-2-4 | 4 | ♭ ధ ♭ ♭ న స | 3-2-4 | 22 |
| II | ♭ ర ♭ గి ♮ మ | 3-3-3 | 4 | ♭ ధ ♭ ని స | 3-3-3 | 22 |
| III | ♭ ర ♮ గు ♮ మ | 3-5-1 | 4 | ♭ ధ ♮ ను స | 3-5-1 | 22 |
| IV | ♮ రి ♭ గి ♮ మి | 5-1-3 | 4 | ♮ ధి ♭ ని స | 5-1-3 | 22 |
| V | ♮ రి ♮ గు ♮ మ | 5-3-1 | 4 | ♮ ధి ♮ ను స | 5-3-1 | 22 |
| VI | ♯ రు ♮ గు ♮ మ | 6-2-1 | 4 | ♮ ధు ♮ ను స | 6-2-1 | 22 |

| *ఉత్తరమేళములు — 36 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| చక్రము | పూర్వాంగము | | | ఉత్తరాంగము | | |
| | స్వర భేదము | శ్రుతి భేదము | పంచమ శ్రుతి | స్వర భేదము | శ్రుతి భేదము | శ్రుతుల మొత్తము |
| I | ♭ర ♭♭గ ♯ మి | 3-2-7 | 1 | ♭ధ ♭♭న స | 3-2-4 | 22 |
| II | ♭ర ♭గి ♯ మి | 3-3-6 | 1 | ♭ధ ♭ని స | 3-3-3 | 22 |
| III | ♭ర ♮గు ♯ మి | 3-5-4 | 1 | ♭ధ ♮ను స | 3-5-1 | 22 |
| IV | ♮రి ♮గి ♯ మి | 5-1-6 | 1 | ♮ధి ♮ని స | 5-1-3 | 22 |
| V | ♮రి ♮గు ♯ మి | 5-3-4 | 1 | ♮ధి ♮ను స | 5-3-1 | 22 |
| VI | ♯రు ♮గు ♯ మి | 6-2-4 | 1 | ♯ధు ♮ను స | 6-2-1 | 22 |

*శుద్ధ వికృతి స్వరములకు ఈ సంగీత సంప్రదాయ ప్రదర్శనిలో గనిపించియుండు అంగ్లేయ గుఱుతులు ఈ పథకములందు గనుపింపబడి యున్నవి.

---

పూర్వ మేళములకును ఉత్తర మేళములకును 'మ' అనునదే 'మి' అని మాఱుబడినదిగాక వేఱు వ్యత్యాసములేదు. ఇటుల 'మి' అను నొకస్వర వ్యత్యాసమువలన మేళమే మాఱుబడునో యనిన, ఒక కుండ నిండిన పాలలో కొంచెము పెరుగు పోసితే పెరుగగునట్లు మేళము వేఱుబడు చున్నది యని వెంకటమఖి జెప్పియున్నారు. ఒక పూర్వాంగమువలన గలుగు 6 మేళములు జేరి ఒక చక్రము అగుచున్నది. ఇటులనే శుద్ధమధ్యమముయొక్క 6 పూర్వాంగములవలన గలుగు 36 మేళములకు 6 శుద్ధ మధ్యమచక్రములనియు, వరాళి మధ్యమముయొక్క 6 పూర్వాంగ ములవలన గలుగు 36 మేళములకు 6 వరాళి మధ్యమ చక్రములనియు పేరు. వెంకటమఖి తనచే గల్పింపబడిన డెబ్బది రెండు మేళములు గౌరవమునకని జెప్పిరేని వృత్త రత్నాకరము యొక్క వృత్తప్రస్తారమునగల ఒక వృత్తమును, తాళప్రస్తారమునగల ఒక తాళమును వ్యర్థము కానేరదనుటవలె నిదియు గౌరవమునకుగా, కానేరవు అని సమాధానము జెప్పియున్నారు.

శ్లో. నహితత్కల్పనే ఫాలలోచనోఽపి ప్రగల్భతే. (చతుర్దండి)

అను శ్లోకరీతిగా తనచే కల్పింపబడిన డెబ్బదిరెండు మేళములకంటె నధికముగా గాని, తక్కువగా గాని నుదుటకన్నుగల పరమశివునిచేతను కల్పింప నలవికాదనియు;

> తస్మాద్వ్యథైక పంచాశద్వర్ణాస్యుర్మాతృకాభిదాః,
> నహీయన్తే నవర్ధంతే తథామేళాద్విసప్తతిః. (చతుర్దండి)

ఏబదియొక అక్షరములకుపై నధికరింప శక్యముకానేరదువలె మేళములును డెబ్బదిరెంటికిపై గలుగ వనియు తనదు చతుర్దండి ప్రకాశికలో జెప్పియున్నారు. ఈరీతిని డెబ్బదిరెండు మేళములను వేంకటమఖి కల్పించునపుడు వారికాలములో ప్రసిద్ధముగానుండిన మేళము లిరువదియందు కొన్నిటిని వీనితోజేర్చవలెనను నపేక్షచే ఒక్కొక్క మేళమునకును ఇన్నోసంఖ్యయని దెలియునట్లు గణితశాస్త్రమందు ఉపయోగింపబడివచ్చెడు కటపయాదిసంఖ్యలచే రెండు అక్షరపదములను ఆ యా మేళములకు మునుపు జేర్చియున్నారు. ఉదా: (1) మాయా మాళవగౌళ, (2) ధీర శంకరాభరణము; (3) చల నాట మొదలగునవి. కటపయాది సంఖ్యావిధులు

> శ్లో. సంఖ్యాః అచశ్చశూన్యాని సంఖ్యాః కటపయాదయః
> మిశ్రేతూపాంత్య హల్సంఖ్యా గణోఽయం త్యో హల్తు సస్వరః (జ్యోతిషం)

అను ఆర్ష వాచ్యరీతిగా (1) విడిగాయున్న ప్రాణాక్షరములును, హల్లక్షరములును పూజ్యముల గనుపించును. (2) మిశ్రాక్షరములైన జడ్డక్కరములలో పూర్వాక్షరములతో సంబంధించిన రెండవ యక్షరముయొక్క హల్లును సంఖ్యలో జేర్చక విడిచి రెండవదియైన ప్రాణ్యాక్షరములను సంఖ్యలో జేర్చవలెను. ఉదా: (మిశ్ర అను పదములో శ్ అను హల్లును తోసి ర యను ప్రాణ్యాక్షరమును సంఖ్యకు ఎత్తుకోవలెను. (3) అక్షరముల లెక్కించుటయందు "అంకానాం వామతో గతిః" (సూర్య సిద్ధాంతము.) అన్న సూత్రప్రకారము క్రిందనుండి ఏక, దశ స్థానములుగా గైకొనవలెను. ఉదా: (1) "మాయామాళవగౌళ" అనుటలో మా = 5, యా = 1, అగుట వలన మా అను 5 ఏక స్థానమందును, యా అను 1 దశస్థానమందు నుంచితే 15 అగును. (2) "ధీర శంకరాభరణము" అనుటలో ధీ = 9, ర = 2 అగుటవలన ధీ అను 9 ఏకస్థానమందును, ర అను 2 దశస్థానమందు నుంచితే 29 అగును. (3) "చలనాట" అనుటలో చ = 6, ల = 3 అగుటవలన చ అను 6 ఏకస్థానమందును, ల అను 3 దశస్థానమందు నుంచితే 36 అగును. (4) "గీర్వాణి" అనుటలో గీ = 3, ర్వా లో ర్ అను హల్లు తోయబడి వా = 4 చేర్చబడెను గనుక గీ అను 3 ఏక స్థానమందును, వా అను 4 దశస్థానమందు నుంచితే 43 అగును. ఈవిధము గానే తక్కినవి యూహ్యంబులు.

క ట ప యాది సంఖ్యా పథకము

| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ | | | | | |
| య | ర | ల | వ | శ | ష | స | హ | ళ | † |

† కాది నవకము, టాదినవకము, పాదిపంచకము, యాద్యష్టకము - అని యప్పటి సంకేతము. కనుక ఞ - న అనునక్షరములు ఈపథకములో చేరవు. ఞ కారము ప్రత్యేకముగా నుండదు. నకారము పూజ్యముగా గ్రహింపబడును. కనుక 'కనకాంబరి' లోని 'కన' 10 సూచించగా 'వామతోగతి' ప్రకారము 01 యయి ఒకటిని దెలుపును. (రా. అ)

---

ఇటులుండగ గణితశాస్త్ర విధికి విరోధముగా హల్లక్షరములను సంఖ్యలో జేర్చుకొను నట్లును, ఋ అనుప్రాణాక్షరమును రి యను ప్రాణ్యక్షరముగా మార్చి దానికి దగినట్లు సంఖ్య జేర్చుకొననట్లును ఈకాలమున వాడబడుచున్న 72 మేళముల లోపల ౕ మేళములను గణితశాస్త్ర విధుల విచారించక జేర్చియున్నారు. అవి యెవ్వి యనిన.

(1) చక్రవాకము, ఇది 26 అగుచున్నది. దీనిని 16 గాను,
(2) దివ్యమణి, ,, 18 ,, 48 ,,
(3) విశ్వంభరి ,, 44 ,, 54 ,,
(4) చిత్రాంబరి ,, 26 ,, 66 ,,
(5) ఋషభప్రియ ,, 60 ,, 62 గాను జేర్చియున్నారు.

13. అంతర గాంధార కాకలీ నిషాద నిరూపణము.

ప్రాచీన పద్ధతిలో శార్ఙ్గదేవులమతమున జెప్పిన శ్రుతిపథకమందు 14 స్థానములలో 19 శుద్ధ వికృతి స్వరములు గలిగినవి యనుటను కనవచ్చును. శార దేవులకాలమందే సుదంమును

యొక్క రెండవ శ్రుతిని పొందిన అంతరగాంధారమును, షడ్జముయొక్క రెండవ శ్రుతిని పొందిన కాకలీనిషాదమును, అల్పప్రయోగములు గలవియని సంగీతరత్నాకరమందు జెప్పబడియున్నది. ఇటులనే రామామాత్యులును జెప్పియున్నారు. శార్ఙ్గదేవులకు వెనుకటివారును, వెంకటమఖికి ముందటివారున్నైన రామామాత్యులకాలమునకు మునుపే మధ్యమషడ్జముల రెండవ శ్రుతులును పొందిన అంతర గాంధార కాకలీనిషాదములు బొత్తిగా వాడుకలోనుండి తొలగినదనియు పిమ్మట నవి (అంతర గాంధార కాకలీనిషాదములు) మధ్యమ షడ్జముల మూడవ శ్రుతి స్థానములపొందినవి యనియు, రామామాత్యులు వీణలో పదిరెండు స్థానముల జెప్పుటవల్లను, చ్యుతమధ్యమ గాంధారము అని అంతర గాంధారమునకును, చ్యుత షడ్జ నిషాదమని కాకలీనిషాదమునకును పేరుపెట్టి యుండుటవల్లను స్పష్టమగును.

శ్లో. చ్యుతమధ్యమ గాంధార చ్యుతషడ్జనిషాదకౌ,
క్రమాదంతరకాకల్యోః స్థానే ప్రతినిధీ విదుః. (స్వర మేళకళానిధి)

రామామాత్యులకు వెనుకటివారైన వెంకటమఖి చ్యుతమధ్యమ గాంధారమని అంతరగాంధారమునకును చ్యుతషడ్జనిషాదమని కాకలి నిషాదమునకును జెప్పబడివచ్చిన నామములు తనకాలమునకు మునుపే లేక మాఱుబడినందువలన చ్యుతమధ్యమగాంధారము, చ్యుతషడ్జ నిషాదము అని జెప్ప నోపక మధ్యమ షడ్జముల మూడవ శ్రుతులందు గాంధార నిషాదములు ధ్వనించుటచేత అంతర గాంధారము కాకలీనిషాదము అను నామములనే నిర్ణయించినట్లుగా దెలియవచ్చుచున్నది. అవియే ఈకాలమందును వాడుకగా వచ్చుచున్నవి.

14. పంచమశ్రుతి ఋషభ ధైవత నిరూపణము.

ఇచ్చోట పంచశ్రుతి ఋషభము అనియు, పంచశ్రుతి ధైవతము అనియు జెప్పబడు రెండు స్వరములును, ఈకాలమున "చతుశ్రుతి ఋషభ" మనియు, "చతుశ్రుతి ధైవతము" అనియు జెప్పుచున్నారు. వానికి ఆనామములు (చతుశ్రుతి ఋషభ చతుశ్రుతి ధైవతములు) ఆదికాలములో నేర్పడి పిమ్మట నవి తొలగబడిన వివరమును ఇచట కొంత వివరింతుము.

పూర్వకాలములో శార్ఙ్గదేవుల మతమందు షడ్జము తననియత శ్రుతిని విడిచి తన మూడవశ్రుతి స్థానమందు చ్యుతషడ్జమైనప్పుడు శుద్ధ ఋషభము తన నియత శ్రుతియందే యుండుకొని తన మూడు శ్రుతులతో షడ్జముయొక్క నాలుగవ శ్రుతియైన ఒక శ్రుతిని జెంది చతుశ్రుతి ఋషభము అను వికారమును, పంచమము తన నియత శ్రుతిని విడిచి తన మూడవ

శ్రుతి స్థానమందు చ్యుత పంచమమైనప్పుడు శుద్ధ ధైవతము తన నియత శ్రుతియందేయుండుకొని తన మూడు శ్రుతులతో పంచమముయొక్క నాలుగవ శ్రుతియైన ఒక శ్రుతిని జెంది చతుశ్రుతి ధైవతము అను వికారమును పొందినవి. అవి బొత్తిగా తొలగిన వెనుక ఋషభము తన స్థానమును విడిచి తనకుపై నిగల శుద్ధగాంధారస్థానమును ఆశ్రయించి తనమూడు శ్రుతులతో ఆ శుద్ధ గాంధారముయొక్క రెండు శ్రుతుల జెంది "పంచశ్రుతి ఋషభము" అను నామమును, ధైవతము తన స్థానమును విడిచి తనకు పైనిగల శుద్ధనిషాద స్థానమును ఆశ్రయించి తన మూడు శ్రుతులతో ఆ శుద్ధ నిషాదముయొక్క రెండు శ్రుతుల జెంది "పంచశ్రుతి ధైవతము" అను నామమును జెందినవి. ఇటులనే రామామాత్యులును.

శ్లో. లక్ష్యేతుకుత్ర చిచ్ఛుద్ధ గాంధారస్థాన మాశ్రయన్,
ఋషభః కీర్త్యతే స్మాభిః పంచశ్రుత్యృషభాహ్వయః,
శుద్ధే నిషాదే నామాన్యత్వా త్పంచశ్రుతి ధైవతః. (స్వరమేళ కళానిధి)

అను శ్లోకరీతిగా పంచశ్రుతి ఋషభ, పంచశ్రుతి ధైవతములని తన స్వరమేళ కళానిధిలో కారణముతో జెప్పియున్నారు.

14. A. వేఱొకరు స్కాందములో తృతీయాధ్యాయమున

సంగ్రహ చూడామణియందు పరమశివుడు పార్వతికి ఉపదేశించినట్లు తెనుగున వచన రూపముగా ఎవరో వ్రాసియున్నారు అది యెటులనిన? ఋషభము మొదలు షడ్జమువరకుగల 12 స్థానములలో ఒక్కొకక్క స్థానమునకును రెండేసి శ్రుతులుగా శుద్ధ ఋషభము మొదలు వరాళి (ప్రతి) మధ్యమ స్థానమువరకుగల 6 స్థానములకు $6 \times 2 = 12$ శ్రుతులును, శుద్ధధైవతము మొదలు కాకలీనిషాదము వరకుగల 4 స్థానములకు $4 \times 2 = 8$ శ్రుతులను పంచమ షడ్జములు రెంటికిని ఒక్కొకక్క శ్రుతివంతున 1, $1 = 2$ శ్రుతులును అంతు 22 శ్రుతులుగా లెక్కజేసి ఈ లెక్కప్రకారము శుద్ధగాంధార స్థానమును జెందినది చతుశ్రుతి ఋషభమనియు, శుద్ధనిషాదస్థానమును జెందినది చతుశ్రుతి ధైవతమనియు చెప్పియున్నారు. ఈ వివరమును క్రింద గనుపింపబడియున్న పథకమున జూడుడు.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| తీవ్ర, కుముద్వతి | మంద, ఛందోవతి | దయావతి, రంజని | రక్తిక, రౌద్రి | క్రోధ, వజ్రిక | ప్రసారిణి, ప్రీతి |

| 7 | 8 | 9 | 10 | 11 | 12 |
|---|---|---|---|---|---|
| మార్జని | క్షితి, రక్త | సందీపని, ఆలాపిని | మదంతి, రోహిణి | రమ్య, ఉగ్ర | క్షోభిణి |

ఈ సంగ్రహ చూడామణిలోగల ఈ విషయములు స్కాందమున గనుబడమింజేసియు, ఈ మార్గము సంగీతరత్నాకరము మొదలయిన ప్రాచీన గ్రంథములలో లేనందునను, భరతమతంగాది మునులు ఇరువదిరెండు శ్రుతులలో ఏ యే శ్రుతులందు ఏ యే స్వరములు ఉద్భవించినట్లు చెప్పియున్నారో అట్లులేనందునను ఒక్కొక్క స్వరమునకు వివాదిదోషము లేర్పడుట వల్లను ఈ మతము నిజమని నమ్మదగినది కాదని యెంచుటకు సందేహమేలేదు.

15. I. రాగము

శ్లో. యోసౌ ధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః,
రంజకోజన చిత్తానాం, సరాగఃకథితో బుధైః. (రత్నాకరం).
రంజక స్వరసందర్భో రాగఇత్యభిధీయతే. (సంగీతపారిజాతం)
రంజయంతి మనాంసీతి రాగాస్తే దశలక్షణాః. (చతుర్దండి ప్రకాశిక)

వినువారి చిత్తమును సుఖపరచి ఇచ్ఛించినట్లు జేయు స్వరవర్ణముల చేరికకు రాగము అని పేరు. (రాగము = ఆస)

II. రాగములకు

శ్లో. గ్రహాంశ మంద్ర తారాశ్చ న్యాసాపన్యాస కౌతథా,
అపి సన్యాస విన్యాసౌ బహుత్వం చాల్పతా తథా. (చతుర్దండి)

(1) గ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస, బహుత్వ, అల్పత్వములను పదిలక్షణములు మతంగులు మొదలయిన మునీంద్రులచే జెప్పబడియున్నవి. వీని లక్షణములను సంగ్రహముగా జెప్పుచున్నాము. (1) గ్రహము. ఒక రాగము మొదట ఏ గ్రహముచే గ్రహింపబడుచున్నదో, ఆ స్వరమే గ్రహమనదగును. (గహము = గ్రహించుట.) రాగలక్షణము విధించుచో ఒక్కొక్క రాగమునకు ఈ ఈ స్వరము గ్రహమని విధింపబడి యున్నది. ఒక రాగమునకు షడ్జముదక్క ఒక స్వరము గ్రహముగా విధించినచో ఆ గ్రహ స్వరము ఏ స్వరముగా నుండినప్పటికిని షడ్జస్వర స్థానమునుంచియే పాడవలెను. షడ్జ గ్రహము నకు షడ్జస్వర స్థానమునే గొని పాడవలెను. ఈ పుస్తకములో ధుని భిన్న షడ్జరాగగీతము బౌళిరాగ శ్రీరంగ ప్రబంధము జూడుడు. ఇట్లు పాడుటయే గ్రహస్వరమగును. ఈ విధము గానే గ్రహస్వరలక్షణమును మున్నూరు సంవత్సరములకు మునుపుండిన గోవిందామాత్యులును తమ రాగ తాళ చింతామణి యను పద్యకావ్యములో జెప్పియున్నారు ఇట్లు గ్రహస్వరము పాడుట 400 సంవత్సరములకు మునుపు గలిగిన సంప్రదాయముగా నున్నది.†

(2) అంశము: ఒక రాగము పాడునపుడు ఆ రాగ రంజనమును ప్రకాశింపజేయుట యును, రాజువలె ముఖ్యముగానున్నదియునైన స్వరమే అంశమగును. అదియే జీవస్వరము. (3) మంద్రము: తగ్గు స్వరములవలన పాడుటయే మంద్రమగును. దీనినే మంద్రగతియం దురు. (4) తారము: ఉచ్చ స్వరములచే పాడుటయే తారమగును. దీనినే తారగతి యందురు. (5) న్యాసము: ఒక రాగమును పాడి ముగించు స్వరమే న్యాసమగును.

---

† ఈ గ్రహస్వర నియమము ఇప్పుడర్థములేనిది. పూర్వకాలమున నెప్పుడో వేలు వేలు షడ్జగ్రామ స్వరములకు వేలు వేలుగా తంతులనమర్చికట్టి, వ్రేళ్ళతోనో చిన్న పుల్లవంటి 'కోణము' తోనో వాయింపవలసిన హార్ప్ (Harp) వంటి వీణలో భిన్నరాగములను వాయించునపుడు, సరిగమ పధని స్వరతంత్రులలో ఒక్కొక్కదానికి ఆధారషడ్జముగా భావించుకొని నిర్వహించుచుండిరనుకో వలసియున్నది. ఇట్లు ఏర్పడినవే షాడ్జి ఆర్షభి మొదలైన యేడు ప్రాచీన జాతులని నాయూహ. ఆధారషడ్జమును స్థిరమైన గ్రహస్వరముగా ప్రతిష్ఠించి గానవాదనములు సాగించు ఇప్పటిపద్ధతిలో ఈ రాగమునకిది గ్రహస్వరమని విధించు శాస్త్రము వట్టి ఆడంబరము మాత్రమే. (రా. అ.)

శ్లో. గ్రహాంశా యత్రనోచ్యేతే తత్రషడ్జం విదుర్బుధాః. (రత్నాకరం)

ఒక రాగమునకు గ్రహ అంశన్యాసములు జెప్పబడని యెడల షడ్జమునే గ్రహ అంశ న్యాసములుగా గొనవలెను.

(6) అపన్యాసము : ఒక రాగమును పాడునపుడు నడుమ నడుమ ముగించు స్వరము అపన్యాసమగును సన్యాస విన్యాసములు దీనిలోపల నణగియున్నవి యని భరతమునిచలన జెప్పబడియున్నది. (7) సన్యాసము : ఒక రాగమును పాడునపుడు మొదట పలుఖండములుగా విభాగించి ఒక్కొక్క ఖండమును ముగించు స్వరము సన్యాసమగును. (8) విన్యాసము : ఒక రాగమును పాడునపుడు దాని ఖండముల అవయవములుగా నుండు స్వరము విన్యాసమగును. (9) బహుత్వము : ఒక రాగమును పాడునపుడు ఒక స్వరమును మాటిమాటికి గ్రహించి పాడుట బహుత్వమగును. ఇది అలంఘన మనియు, అభ్యాసమనియు రెండువిధములగును. (i) ఒక స్వరమును విడువక పాడుట అలంఘనమగును. (ii) ఒక స్వరమును ఎడతెగక నుచ్చరించుట లేక నడుమ ఎడ విడిచి మాటి మాటికి నుచ్చరించుట అభ్యాసమగును. (10) అల్పత్వము : ఒక రాగమును పాడునపుడు ఒక స్వరమును అధికముగా నుచ్చరింపక నుండుట అల్పత్వమగును. అది లంఘనము, అనభ్యాసము, అని రెండు విధములగును. (i) పాడునపుడు ఒక స్వరమును బొత్తిగా నుచ్చరింపక విడిచి దాటుట లంఘనమగును. (ii) పాడునపుడు ఒక స్వరమును అభ్యసించునట్లు ఎడతెగక (లేక మాటి మాటికి) నుచ్చరింపక ఏదైన నొక సమయమున నల్పముగ నుచ్చరించుట అనభ్యాసమగును. ఈ పదిలక్షణములును పూర్వకాలమున నుండిన రాగములకే గాక ఇప్పటి కాలరాగములకు గ్రహ అంశన్యాసములైన మూడు లక్షణములు మాత్రము గలవని వెంకటమఖి తన చతుర్దండి ప్రకాశికలో జెప్పియున్నారు.

III. రాగవిభాగము : మార్గరాగము, దేశీరాగము అను రెండు భాగములచే పది విధములగును. వానిలో మొదటిది మార్గరాగము, (1) గ్రామరాగము, (2) ఉపరాగము, (3) రాగము, (4) భాష, (5) విభాష, (6) అంతరభాష, అని ఆఱు విధములగును. రెండవది దేశీరాగము (1) రాగాంగము, (2) ఉపాంగము, (3) భాషాంగము, (4) క్రియాంగము అని నాలుగు విధములగును. మార్గ రాగములను ప్రాచీనపద్ధతిలో జూడుడు. అవి గంధర్వ లోకమున గలవు. రత్నాకరములో మధ్యమగ్రామ షడ్జగ్రామ సంబంధమైన రాగములు 264 జెప్పబడి యున్నవి. అవి అనుభవమున లేదని ఆ రాగముల దొలగించి దేశీరాగములలో ఇప్పటి కాలమందుగల లక్ష్యలక్షణములకును సరియైనదిగా వెంకటమఖిచే చెప్పబడిన రాగములే ఇచ్చోట చెప్పబడుచున్నవి.

IV. రాగాంగరాగము: రాగాంగరాగమనునది అనేకముగా గ్రామరాగముల ననుసరించి యున్న సంపూర్ణరాగము. ఇది జనక రాగము, మేళరాగమని చెప్పబడును. ఈ రాగాంగరాగము సంపూర్ణము, షాడవసంపూర్ణము, ఔడవసంపూర్ణము, వక్ర సంపూర్ణము గానుండును. (ఉదా.) షాడవసంపూర్ణము మూడవమేళము సరిమపధనిస, సనిధపమగరిస. ఔడవ సంపూర్ణము మొదటి మేళము సారిమపధసా, సానీధపమగారిరీస్సా. వక్ర సంపూర్ణము పదియవ మేళము సగమప్పా నిధనిససా, సనిధనిపానిపమగగరిరిసా. దీనిలో ధైవత వక్రము.

V. వెంకటమఖి ఈ రాగాంగ రాగంబులను ముందర చెప్పినట్లు శుద్ధ వికృతి స్వర ప్రస్తారంబులచే డెబ్బదిరెండు విధములుగా పంచి, ఒక్కొక్కటికిని లక్షణ శ్లోకంబును, లక్షణ గీతంబును జేసి ఆ గీత సాహిత్యంబులలో మొదటి ఖండమందు ఆయా మేళంబులకు గల శుద్ధ వికృతస్వరప్రతినిధులై చెప్పబడిన ర, రి, రు మొదలైన సంకేతాక్షరంబుల నొక్కొక ఆ వృత్తము యొక్క మొదటి అక్షరంబుగా నమర్చియు, రెండవ ఖండమందు ఆయారాగాంగ రాగంబుల పేళ్ళును, వానిలో జనించెడి ఉపాంగ రాగంబుల పేళ్ళును, ఆ యారాగాంగరాగము ఇన్నో చక్రంబున ఇన్నో మేళమను సంఖ్యయును, మూడవఖండమందు ఆ మేళములో జనించిన భాషాంగ రాగ నామంబులును అమర్చియున్నారు. వీనియొక్క వివరణము ఈ పుస్తకములో రాగాంగరాగ లక్షణగీతంబులలో జూడుడు. ఈ డెబ్బది రెండు రాగాంగరాగ నామంబులును వాని సాహిత్యంబుల మొదటి శబ్దంబులును అనుక్రమణికగా మాళవగౌళమేళజన్య ఉపాంగమైన గుండక్రియారాగగీతమందు చెప్పియున్నారు. ఆ గీతంబును ఈ పుస్తకములో జూడుడు. డెబ్బదిరెండు రాగాంగరాగములకు గల మూర్ఛనలు అనేకముగా నొకటి కొకటి భేదమై రంజన భేదము కలుగునట్లును, అభ్యసించువారికి వ్యక్తంబుగా భేదంబు దోచునట్లును పూర్వాచార్యులు ఏర్పరచియున్నారు. ఈ డెబ్బదిరెండు రాగాంగరాగముల పేళ్ళును, గణితశాస్త్ర విరోధమైన కొన్ని నామములతోను, అన్నియు సరిగమపధనిస సనిధపమగరిస అనియే ఇప్పటి వాడుకలోగల డెబ్బదిరెండు మేళ కర్తల పేళ్ళును దీనిక్రింద జూపించియున్న మేళపథకంబులో జూడుడు.

రాగాంగ రాగ పథకము.

వెంకటమఖిచే గల్పింపబడిన ఒక్కొక చక్ర సంజ్ఞలును, ఒక్కొక చక్రములోగల రాగాంగ రాగంబుల సంఖ్యలును ఈ మేళ పథకములో గనిపింపబడియున్నవి.

చక్ర సంజ్ఞలు :

ఇందు - 1, నేత్ర - 2, అగ్ని - 3, వేద - 4, బాణ - 5, ఋతు - 6,
ఋషి - 7, వసు - 8, బ్రహ్మ - 9, దిశి - 10, రుద్ర - 11, ఆదిత్య - 12.

మేళ సంజ్ఞలు :

పా - 1, శ్రీ - 2, గో - 3, భూ - 4, మా - 5, షా - 6.

## పూర్వ మేళములు 36

### ఇందు - ౧ - చక్రము

1. పా. కనకాంబరి
కనకాంగి
2. శ్రీ. ఫేనద్యుతి
రత్నాంగి
3. గౌ. గానసామవరాళి
గానమూర్తి
4. భూ. భానుమతి
వనస్పతి
5. మా. మనోరంజని
మానవతి
6. షా. తనుకీర్తి
తానరూపి.

### నేత్ర - ౨ - చక్రము

7. పా. సేనాగ్రణి
సేనావతి
8. శ్రీ. జనతోడి
హనుమత్తోడి
9. గౌ. ధునిభిన్నషడ్జం
ధేనుక
10. భూ. నటాభరణం
నాటకప్రియ
11. మా. కోకిలారవం
కోకిలప్రియ
12. షా. రూపవతి

### అగ్ని - ౩ - చక్రము.

13. పా. గేయహెజ్జిజ్జి
గాయకప్రియ
14. శ్రీ వాటీవసంతభైరవి
వకుళాభరణం
15. గౌ. మాయామాళవగౌళ
16. భూ. తోయవేగవాహిని
చక్రవాకము
17. మా. ఛాయావతి
సూర్యకాంతము
18. షా. జయశుద్ధమాళవి
హాటకాంబరి

### వేద - ౪ - చక్రము

19. పా. ఝంకారభ్రమరి
ఝంకారధ్వని
20. శ్రీ. నారీరీతిగౌళ
నఠభైరవి
21. గౌ. కిరణావళి
కీరవాణి
22. భూ. శ్రీరాగం
ఖరహరప్రియ
23. మా. గౌరీవేళావళి
గౌరీమనోహరి
24. షా. వీరవసంతం
వరుణప్రియ.

| బాణ - ౫ - చక్రము | | | ఋతు - ౬ - చక్రము | | |
|---|---|---|---|---|---|
| 25. | పా. | శరావతి<br>మారరంజని | 31. | పా. | కలావతి<br>యాగప్రియ |
| 26. | శ్రీ. | తరంగిణి<br>చారుకేశి | 32. | శ్రీ. | రాగచూడామణి<br>రాగవర్ధని |
| 27. | గో. | సౌరసేన<br>సరసాంగి | 33. | గో. | గంగాతరంగిణి<br>గాంగేయభూషణి |
| 28. | భూ. | హరికేదారగౌళ<br>హరికాంభోజి | 34. | భూ. | భోగచ్ఛాయానాట<br>వాగధీశ్వరి |
| 29. | మా. | ధీరశంకరాభరణము | 35. | మా. | శైలదేశాక్షి<br>శూలిని |
| 30. | షా. | నాగాభరణం<br>నాగానందిని. | 36. | షా. | చలనాట. |

ఉత్తర మేళములు 36.

| ఋషి - ౭ - చక్రము | | | వసు - ౮ - వ చక్రము | | |
|---|---|---|---|---|---|
| 37. | పా. | సౌగంధిని<br>సాలగము | 43. | పా. | గీర్వాణి<br>గవాంభోధి |
| 38. | శ్రీ. | జగన్మోహనం<br>జలార్ణవము | 44. | శ్రీ. | భవాని<br>భవప్రియ |
| 39. | గో. | ధాలివరాళి<br>ఝాలవరాళి | 45. | గో. | శివపంతువరాళి<br>శుభపంతువరాళి |
| 40. | భూ. | నభోమణి<br>నవనీతము | 46. | భూ. | స్తవరాజము<br>షడ్విధమార్గిణి |
| 41. | మా. | కుంభిని<br>పావని | 47. | మా. | సౌవీరము<br>సువర్ణాంగి |
| 42. | షా. | రవిక్రియ<br>రఘుప్రియ. | 48. | షా. | జీవంతిని<br>దివ్యమణి $ |

| బ్రహ్మ - ౯ - చక్రము | | |
|---|---|---|
| 49. | పా. | ధవళాంగము |
| | | ధవళాంబరి |
| 50. | శ్రీ. | నామదేశి |
| | | నామనారాయణి |
| 51. | గో. | కాశిరామక్రియ |
| | | కామవర్ధని |
| 52. | భూ. | రమామనోహరి |
| | | రామప్రియ |
| 53. | మా. | గమకక్రియ |
| | | గమనశ్రమ |
| 54. | షా. | వంశవతి |
| | | విశ్వంభరి$ |

| రుద్ర - ౧౧ - చక్రము | | |
|---|---|---|
| 61. | పా. | కుంతలము |
| | | కాంతామణి |
| 62. | శ్రీ. | రతిప్రియ |
| | | ఋషభప్రియ$ |
| 63. | గో. | గీతప్రియ |
| | | లతాంగి |
| 64. | భూ. | భూషావతి |
| | | వాచస్పతి |
| 65. | మా. | శాంతకల్యాణి |
| | | మేచకల్యాణి |
| 66. | షా. | చతురంగిణి |
| | | చిత్రాంబరి$ |

| దిశి - ౧౦ - చక్రము | | |
|---|---|---|
| 55. | పా. | శ్యామళ |
| | | శ్యామలాంగి |
| 56. | శ్రీ. | చామరము |
| | | షణ్ముఖప్రియ |
| 57. | గో. | సుమద్యుతి |
| | | సింహేంద్రమధ్యమము |
| 58. | భూ. | దేశిసింహారవము |
| | | హేమవతి |
| 59. | మా. | ధామవతి |
| | | ధర్మవతి |
| 60 | షా. | నిషధము |
| | | నీతిమతి |

| ఆదిత్య - ౧౨ - చక్రము | | |
|---|---|---|
| 67. | పా. | సంతానమంజరి |
| | | సుచరిత్ర |
| 68. | శ్రీ. | జోతిరాగము |
| | | జోతిస్వరూపిణి |
| 69. | గో. | ధౌతపంచమము |
| | | ధాతువర్ధని |
| 70. | భూ. | నాసామణి |
| | | నాసికాభూషణి |
| 71. | మా. | కుసుమాకరము |
| | | కోసలము |
| 72. | షా. | రసమంజరి |
| | | రసికప్రియ. |

$ ఈ మేళములు కటపయాది సంఖ్యలకు విరోధముగాన్నవి

VI. ఉపాంగరాగము: ఇది రాగాంగ రాగమునజనించి తన జనక రాగమునకుగల శుద్ధ వికృతి స్వరములనే గలదియై ఔడవ షాడవ సంపూర్ణ వక్రములుగా నుండును. ఈ ఉపాంగ రాగము రాగాంగ రాగమునకు సొంత పుత్రుని బోలినది.

VII. భాషాంగరాగము: ఇది తాను జనించిన రాగాంగ రాగమునకుగల శుద్ధ వికృతి స్వరములనే గొనియుండినప్పటికిని అన్యరాగాంగ శుద్ధ వికృతి స్వరములలో లక్షణమున విధించినట్లే, ఏదైన ఒకటి, లేక రెండు స్వరములను గొనియుండును. ఈ భాషాంగ రాగము రాగాంగ రాగమునకు స్వీకరించిన అన్యస్త్రీ పుత్రుని బోలినది.

VIII. క్రియాంగరాగము: దేశీరాగములు నాలుగు లోపల క్రియాంగమును జేర్చి వెంకటమఖి జెప్పియున్నారు. ఇప్పుడు క్రియాంగరాగము వాడుకలో లేనందున నిచట జెప్పబడలేదు. ప్రాచీన పద్ధతిలో జూడుడు.

IX. సంపూర్ణము, షాడవము, ఔడవము: అని రాగములు మూడు విధములు. (1) సంపూర్ణము అనునది ఏడు స్వరములుగల రాగము (2) షాడవము అనునది ఆఱు స్వరములు గల రాగము. (3) ఔడవము అనునది ఐదు స్వరములుగల రాగము.

X. వివాది స్వర దోష నివారణమార్గ నిర్ణయము. పై జెప్పినట్లే శుద్ధ వికృతి స్వర ప్రస్తరింపువలన గలుగు పూర్వమేళమందును, ఉత్తర మేళమందునుగల పంట్రెండు చక్రములలో మొదటి చక్రమునగల ఆఱు మేళములలోను, ఏడవ చక్రమునగల ఆఱు మేళములలోను వచ్చు (స రి గ మ) అను శుద్ధ ఋషభ శుద్ధ గాంధార ప్రయోగములందును, పంట్రెండు చక్రములు గల ఒక్కొక మొదటి మేళములలో వచ్చు (ప ధ ని స) అను శుద్ధ ధైవత శుద్ధనిషాదప్రయోగము లందును వివాది దోషముగలుటవలన ఆరోహణమందు గాంధారమును వర్జించియు, అవరోహణ మందు ఉల్లసిత గమకముయొక్క రెండవ భేదమైన దిగుజారుతోను కురుళ గమకముయొక్క రెండవ భేదమైన ఒరయకతోను గాంధారమును జేర్చియు, (ఉదాహరణము) అవరోహణము స ╲ నీ ధ ప మ ╲ గ రి స; ఆఱవచక్రమునగల ఆఱు మేళములలోను, పంట్రెండవ చక్రమునగల ఆఱు మేళములలోను వచ్చు షట్ఛ్రుతి ఋషభ అంతర గాంధార ప్రయోగములందును, పంట్రెండు చక్రములగల ఒక్కొక్క కడపటి మేళములో వచ్చు షట్ఛ్రుతి ధైవత కాకలీ నిషాద ప్రయోగములందును గలుగుచున్న వివాదిదోషముల ఆరోహణమందు తిరుపగమకమను నొక్కుచే షట్ఛ్రుతి ఋషభ ధైవతముల జేర్చియు, (ఉదా.) స రి(W) గ మ ప ధ(W) ని స; అవరోహణమందు షట్ఛ్రుతి ధైవత ఋషభముల వర్జించియు, లేక వీనితో నిషాద గాంధారముల వక్రముగా

జేర్చియు అంతు నలువది మేళములలో వచ్చు వివాదిదోషముల నిగ్రహించుటయే సంప్రదాయము. కొన్నిచోట్ల* స గ రి మ (స గ ర మ), (స రి గ రి మ), (స ర గ ర మ) అనియు, (ప ని ధ స), (ప న ధ స), (ప ధ ని ధ స), (ప ధ న ధ స), స మ రి గ మ (స మ రు గ మ), ప ని ధ ని స (ప ను ధు ను స), స ని ధ ని ప (స ను ధు ను ప) అను స్వర ప్రయోగములందు గమకములవలన వివాది దోషము తొలగును.

XI. వక్రరాగము : వక్రము అనునది స్వరములు క్రమముగా రాక నే క్రమము దప్పి వచ్చుట. ఉదా : మేఘరంజి అవరోహణము స ని మ గ స రి స. రి వక్రము. గౌళ అవరోహణము స ని ప మ రి గ మ రి స. గ వక్రము. సేనాగ్రణి ఆరోహణము స రి గ గ రి మ గ మ ప ని ధ స. మని వక్రం. రూపవతి అవరోహణము స ని ధ ని ప మ గ స. ధ వక్రము. ఫేనద్యుతి ఆరోహణము స రి మ ప ధ ధ ప ని ని స. ని వక్రము.

XII. ఘన, నయ (రక్తి), దేశీయములని రాగము మూడు విధములు. (1) ఘనరాగమనునది ఘనమైన నాభితానముగా గానక్రియలను చేయదగినది. ఇది శౌర్య వీర్యోత్సాహములు గల పురుషునిబోలినది. (2) నయరాగమనునది వినువారి చిత్తముల నీడ్చి రంజనమును జేయింపగలది. దీనిని రక్తిరాగము మార్గరాగము అని జెప్పుదురు. ఇది ఇంపు సొంపులుగల పలుకులచే చిత్తమును రంజించి మోహింపజేసెడి స్త్రీలను బోలినది. (3) దేశీయము లేక ఔత్తరరాగము అనునది ఉత్తరదేశమునుండివచ్చి రంజనమును సేయు స్వభావముగలది. ఇది అన్యదేశములనుండివచ్చి ఇంపుగల పలుకులచే మనస్సును గైకొని మోహింపజేయగల భోగ స్త్రీల బోలినది. ఈ ఘన, నయ, దేశీయరాగ శ్లోకంబుల గ్రంథవిస్తరభీతిచే ఇచట జెప్పలేదు.

16. తాళము : పాడునప్పుడు పాటయొక్క కాలప్రమాణమును కొలిచి చేతివలన గాని తాళయంత్రమువలనగాని కొట్టుటకు తాళమని పేరు. తాళము మార్గము, దేశీయము అని రెండువిధములగును. అవి దశప్రాణములను ఆధారములుగాగలవి, ప్రాణములనగవి శరీరంబున కాస్పదంబులగు ప్రాణము మొదలైన పంచమహాప్రాణంబులవలె కాలము మొదలు గ్రహము వరకు గల మహాప్రాణము లైదును, నాగము మొదలైన ఐదు ఉపప్రాణంబులవలె జాతి మొదలు ప్రస్తారమువరకుగల ఉపప్రాణము లైదును తాళంబునకు ఆధారంబులుగా నున్నవి. అవి——

*ఈ వక్రప్రయోగములుగల శుద్ధ గాంధార నిషాదములను కురుళ గమక ప్రథమ భేదమైన ఒదిగింపుతో పట్టవలెను

శ్లో. కాలోమార్గః క్రియాంగాని గ్రహోజాతిః కళాలయః,
యతిః ప్రస్తార కశ్చేతి తాళ ప్రాణా దశస్మృతాః.

1. కాలము, 2. మార్గము, 3. క్రియ, 4. అంగము 5. గ్రహము, 6. జాతి, 7. కళ, 8. లయ, 9. యతి, 10. ప్రస్తారము.

(1) కాలము : ఇది క్షణ. లవ, కాష్ఠా, నిమిష, త్రుటి, ద్రుత, లఘు, గురు, ప్లుత, కాకపదములని పదివిధములగును వీనిలో నూరు తామరరేకులను దొంతిగాబెట్టి దానిలో నొక రేకును సూదిచే పొడుచుకాలము క్షణము. అట్టి క్షణములు 8=లవము, లవములు 8=కాష్ఠ, కాష్ఠలు 8=నిమిషము, నిమిషములు8 = త్రుటి, లేక అనుద్రుతము అనియు విరామము అనియు జెప్పుదురు. అది ఒక అక్షరకాలము. త్రుటి 2=ద్రుతము (రెండక్షర కాలము) ద్రుతములు 2=లఘు (నాలుగక్షర కాలము), లఘు 2=గురు. (ఎనిమిది అక్షర కాలము) లఘు 3 = ప్లుతము (పండ్రెండక్షర కాలము), లఘు 4 = కాక పదము (పదియారు క్షరకాలము). ఒక అక్షరకాలము అనునది ఒక లఘ్వక్షరమును ఉచ్చరించుకాలము. ఈ రీతిగా నాలుగు లఘ్వక్షరముల నుచ్చరించు కాలమునకు ఒక మాత్రయందురు అనుద్రుతము పాతికమాత్ర, ద్రుతము అరమాత్ర. లఘు ఒక మాత్ర; గురు రెండు మాత్రలు; ప్లుతము మూడు మాత్రలు; కాకపదము నాల్గు మాత్రలు. లఘు ఎల్లప్పుడును ఒక మాత్రగల నాలుగ క్షరకాలముగానే యుండదు. అది జాతుల ననుసరించి 3 4, 5, 7, 9 అక్షరకాలములుగానగును.

(2) మార్గము ; ఒకటికొకటి భేదములుగల కాల ప్రమాణముతో పాడెడి మార్గములకు మార్గము అని పేరు. అది దక్షిణ, వార్తీక, చిత్ర, చిత్రతర, అర్ధచిత్ర, అతి చిత్రములను ఆరు విధములగును. 1/4 (పాతిక) మాత్రను ఒక కల (లేక కళ) గా గొనినది అతి చిత్రము. 1/2 (అర) మాత్రను ఒక కలగా గొనినది అర్ధచిత్రము. 1 (ఒక) మాత్రను ఒక కలగా గొనినది చిత్రతరము. 2 (రెండు) మాత్రలను ఒక కలగా గొనినది చిత్రము. 4 (నాలుగు) మాత్రలను ఒక కలగా గొనినది వార్తికము. 8 (ఎనిమిది మాత్రలను ఒకకలగా గొనినది దక్షిణము. శార్ఙ్గదేవులు రత్నాకరములో మార్గములు ధ్రువ, చిత్ర. వార్తీక. దక్షిణములను నాలుగువిధములగు ననియు, 1 (ఒక) మాత్రను ఒక కలగాగొనినది ధ్రువము; 2 (రెండు) మాత్రలను ఒక కలగా గొనినది చిత్రము; 3 (మూడు) మాత్రలను ఒక కలగాగొనినది వార్తీకము; 4 (నాలుగు) మాత్రలను ఒక కలగాగొనినది దక్షిణము లనియు జెప్పియున్నారు.

(3) క్రియ : ఒక తాళముయొక్క ఆవర్తమునందు కొట్టు విసరుట ఎంచుట మొదలయిన వ్యాపారములచే ఒక తాళములోగల అంగములను జూపించుట క్రియ అనంబడును. అది

సశబ్దక్రియ, నిశ్శబ్ద క్రియ యని రెండువిధములగును. 1. సశబ్దక్రియ ఎడమచేతిని కుడిచేతిచే శబ్దముగలుగునట్లు గొట్టుట 2. నిశ్శబ్దక్రియ వ్రేళ్ళచే నెంచుట, కుడిచేతిని క్రింద విడుచుట లేక విసరుట, చుట్టుట మొదలైనవి. (i) అనుద్రుతముయొక్క క్రియ ఎడమచేతిని కుడిచేతిచేకొట్టుట. ఇది సశబ్దము. (ii) ద్రుతముయొక్క క్రియ ఎడమచేతిని కుడిచేతిచేకొట్టి కుడిచేతిని విసరుట. ఇది సశబ్దమును, నిశ్శబ్దమును జేరినది. (iii) లఘువుయొక్క క్రియ ఒక అక్షరకాలము ఎడమ చేతిని కుడిచేతిచేకొట్టి ఒక లఘువులోగల తక్కిన అక్షరకాలమును ఎడమచేతిమీద కుడిచేతి చిటికెన మొదలైన వ్రేళ్ళను క్రమముగాబెట్టి యెంచుట (IV) గురువుయొక్క క్రియ ఎడమచేతిని కుడిచేతిచే గొట్టి మూడు వ్రేళ్ళచే నెంచి నాలుగక్షరకాలము కుడిచేతిని క్రింద విడుచుట. (V) ప్లుతము యొక్క క్రియ ఎడమచేతిని కుడిచేతిచే గొట్టి మూడు వ్రేళ్ళచే నెంచి నాలుగక్షరకాలము కుడి చేతినిచుట్టి నాలుగక్షరకాలము క్రింద విడుచుట. (Vi) కాకపదక్రియ. ఇది నిశ్శబ్ద క్రియ. ఇది నాలుగక్షర కాలము కుడిచేతిని ఎడమప్రక్క కొనివచ్చి (సర్పిణి), నాలుగక్షరకాలము త్రిప్పికొని వచ్చి (కృష్య), నాలుగక్షరకాలము కుడిచేతిని మీదికెత్తి (పతాకము), నాలుగక్షరకాలము క్రింద బడ (పతితము) జేయుట ఈ అంగమును జేరిన తాళమును అనంగళమని కొందఱు వాడుకలో నుండి తొలగించి యున్నారు. (3) A. ఆవర్తము: ఒక తాళములోగల అంగములను ఒకతడవ సేయబడిన క్రియలన్నియు ఆవర్తమగును. సశబ్ద క్రియల తాళము వేయునప్పుడు ఒక్కొక్క అంగముల ప్రారంభమునందు చేతికొట్టులుండుటచే ఒక్కొక ఆవర్తమందు ఎన్ని కొట్టులున్నవో అన్ని యంగములు ఆ తాళములో గలవని యెఱుగవచ్చును. ఉదా: ఒక తాళ ములో ఒక ఆవర్తము వేయునప్పుడు ఒక కొట్టును, మూడు వ్రేళ్ళచే నెంచుటయును, వెంబడి కొట్టి విసరుటయును, తిరుగనొకకొట్టును మూడువ్రేళ్ళచే నెంచుటయును గలిగినట్టయితే అది మూడు అంగముల తాళము మొదటి యంగము చతురశ్రజాతి లఘు. రెండవ అంగం ద్రుతం మూడవఅంగం చతురశ్రజాతి లఘు గనుక నిది చతురశ్రజాతి మఠ్యతాళం. (2) ఒక తాళములో నొక ఆవర్తము వేయునపుడు ఒకకొట్టును రెండువ్రేళ్ళచే నెంచుటయును, వెంబడికొట్టి విసరుట యును తిరుగకొట్టివిసరుటయును గలిగినట్టయితే అది మూడంగంబులుగల తాళము. మొదటియం గము త్ర్యశ్రజాతి లఘు, తక్కినవి రెండుద్రుతంబులు గనుకనిది త్ర్యశ్రజాతి త్రిపుటతాళము. ఈరీతిక్రియలలో కొట్టుట యెంచుట మొదలైనవి ఒక్కొక్క అక్షరకాలంబునుగుణించును. తాళము వేయుటలో శాస్త్రబునకను వాడుకకును విరోధమై ఇప్పటికాలంబులో తప్పైన కొన్ని వ్యాపా రంబులు ప్రకాశించుకొని యున్నవి. త్రిపుట చాపు, అటతాళచాపు, మిశ్రచాపు మొదలైన వానికి చాపు అని, శాస్త్రములో జెప్పబడని ఒక సాధారణమైన నామమునిచ్చి ఆయాతాళంబు లకు శాస్త్రంబులలో నేర్పడిన క్రియల తగ్గించి వచ్చినారు ఉదా: త్రిపుట చాపు దీనిలో జాతి నామము జెప్పబడలేదు. అటులుండినప్పటికిని దీనియొక్క జాతి త్ర్యశ్రమని యెఱుగవచ్చును.

గనుక నీతాళమునకు ఏడు అక్షరకాలం; దీనిని జూపించుటకు ఎడమచేతిని గొట్టి కుడిచేతి వ్రేళ్ళ నెంచక, రెండుఅక్షరకాలము బెట్టియుండి తిరుగ నెడమచేతినిగొట్టి మూడక్షరకాలం కాచియుండుట త్రిపుటచాపు అని జెప్పుచున్నారు. ఇట్లు తాళము శాస్త్రవిధికి విరోధంబుగా వేయుటయుగాక త్ర్యశ్రమను జాతినామమును విడిచినటులనే, త్రిపుటయను పేరును విడిచి శాపు (చాపు) అని మాత్రము జెప్పుచున్నారు. (శాపు అనునది కొట్టుతో మూడు అక్షరకాలముగాచి, నాలుగక్షర కాలము విసరుట.) దీనినే మిశ్రమని జెప్పువారును గలరు. (4) అంగము: ఒకతాళము యొక్క ఆవర్తములోగల అవయవంబులకు అంగము అని పేరు. (అంగము = అవయవము)

శ్లో. అనుద్రుతో ద్రుతశ్చైవ లఘు ర్గురు ప్లుత స్తథా,
కాకపాదం తథా ప్రోక్తం తాళాంగమితి షడ్విధం.

అనుద్రుత, ద్రుత లఘు, గురు, ప్లుత, కాకపాదములని ఆఱువిధంబులగును. వీనినిగుఱించి గుఱుతులు (సంకేతములు) ఉన్నవి. అనుద్రుతం, ◡. ద్రుతము, ౦. లఘు, |. గురు, 8. ప్లుతం, ३. కాకపాదం, ×. ఒకతాళం 100 అను గుఱుతులచేత వ్రాసితే దానిలో ఒక లఘువును రెండు ద్రుతంబులును గలవియని యెఱుగనగును. పై జెప్పిన ఆఱు అంగములలో అనుద్రుతం, ద్రుతం, లఘు. అను నీమూడు అంగములలో ఇపుడు వాడుకలోగల ధ్రువము మొదలైన సూళాది ఏడుతాళంబులందును విలసిల్లుకొనియున్నవి. తక్కినవి దేశీయతాళంబులైన 128 తాళంబులలో విలసిల్లుకొనియున్నవి.

(5) గ్రహము ॥ ఒక పాటలో తాళంబు నుపయోగించి యారంభించి యెత్తుటకు గ్రహము అని పేరు. (గ్రహం = గ్రహణం, ఎత్తుట.) గ్రహము, సమ విషమంబులని రెండు విధంబులగును. (1) సమము, పాటయును తాళంబును ఒక్కటిగా నెత్తుటకు సమము అని పేరు. (2) విషమము। పాటయును తాళంబును సమంబుగా నెత్తక ముందు వెనుకగా నెత్తుట ఇది అతీతము, అనాగతమని రెండు విధంబులగును. (i) అతీతము, పాటమునుపును తాళము వెనుకను ప్రారంభించుట. (ii) అనాగతము, తాళము మునుపును పాటవెనుకను ప్రారంభించుట

(6) జాతి : తాళంబులను పంచు విధంబులకు జాతియని పేరు. మార్గతాళంబులైన చచ్చత్పుటము మొదలగు నైదు తాళములను ప్రాచీనపద్ధతిలో జూడుడు. వేర్వేఱు దేశంబులలో గలిగిన పలువిధంబులైన తాళంబులకు దేశీతాళంబులని పేరు. అవి యనేకంబులు. వానిలో 120 తాళంబుల లక్షణంబులును, నామంబులును సంగీత రత్నాకరకారులు జెప్పియున్నారు. ఆదేశీ తాళంబులలో జేరిన ధ్రువము మొదలైన ఏడు తాళంబులే 400 సంవత్సరములకు పూర్వంబుననుండి అనేకంబుగా నేటి వరకు వాడుకలోనుండి వచ్చుచున్నవి.

శ్లో. ధ్రువోమత్యో రూపకళ్చ ఝుంపా త్రిపుట ఏవచ,
అట తాళశ్చైకతాళ స్సప్తతాళాః ప్రకీర్తితాః.

(1) ధ్రువతాళము, । ೦ । ।; (2) మఠ్యతాళం, । ೦ ।; (3) రూపకతాళం, ೦ ।; (4) ఝుంపతాళం, । ◡ ೦; (5) త్రిపుటతాళం, । ೦ ೦; (6) అటతాళం, । । ೦ ೦; (7) ఏకతాళం, ।. జాతి త్ర్యశ్ర, చతురశ్ర, ఖండ, మిశ్ర, సంకీర్ణంబులని ఐదు. ధ్రువము మొదలైన ఏడు తాళంబులలో నొక్కొక్కటియును ఈ ఐదు జాతులలో జేరి గలుగు తాళంబులు $7 \times 5 = 35$. ఇప్పుడు వాడుకలోగల తాళంబులలో నుపయోగింపబడు అంగంబులందు అను ద్రుత ద్రుతంబులు రెండును మాఱుబడక నెప్పుడును అనుద్రుతం ఒక అక్షరకాలంబును, ద్రుతం రెండక్షరకాలంబులు గాగలవి. లఘువు ఏజాతిని యనుసరింపుచున్నదో ఆజాతుల నామములను అక్షరకాలమును జెందుచున్నది. ఇవ్విధ జాతి భేదంబులగునపుడు—

| | జాతినామములు | అక్షరకాలము | లఘునామములు | అంగములు | మాత్రలు |
|---|---|---|---|---|---|
| i | త్ర్యశ్రం | 3 | త్ర్యశ్ర లఘు | ౩ | $\frac{3}{4}$ ముప్పాతిక మాత్ర |
| ii | చతురశ్రం | 4 | చతురశ్ర ,, | । | 1 ఒక మాత్ర |
| iii | ఖండం | 5 | ఖండ ,, | ೦ । | $1\frac{1}{4}$ ఒకటింపాతిక |
| iv | మిశ్రం | 7 | మిశ్ర ,, | ◡ । | $1\frac{3}{4}$ ఒకటిముప్పాతిక |
| v | సంకీర్ణం | 9 | సంకీర్ణ ,, | ೦ ౭ | $2\frac{1}{4}$ రెండుంపాతిక |

ఈ ఐదుజాతులతో ఏడు తాళములు జేరి గలిగెడు ముప్పదియైదు తాళములపేర్లును, అంగములను, అక్షరకాలమును క్రిందవ్రాయబడిన పథకమున జూడుడు.

| తాళము | అంగము | త్ర్యశ్రజాతి | చతురశ్రజాతి | ఖండజాతి | మిశ్రజాతి | సంకీర్ణ జాతి |
|---|---|---|---|---|---|---|
| ధ్రువము | । ० । । | 3,2,3,3=11 | 4,2,4,4=14 | 5,2,5,5=17 | 7,2,7,7=23 | 9,2,9,9=29 |
| మఠ్యము | । ० । | 3,2,3=8 | 4,2,4=10 | 5,2,5=12 | 7,2,7=16 | 9,2,9=20 |
| రూపకము | ० । | 2,3=5 | 2,4=6 | 2,5=7 | 2,7=9 | 2,9=11 |
| ఝంప | । ◡ ० | 3,1,2=6 | 4,1,2=7 | 5,1,2=8 | 7,1,2=10 | 9,1,2=12 |
| త్రిపుట | । ० ० | 3,2,2=7 | 4,2,2=8 | 5,2,2=9 | 7,2,2=11 | 9,2,2=13 |
| అటతాళం | । । ० ० | 3,3,2,2=10 | 4,4,2,2=12 | 5,5,2,2=14 | 7,7,2,2=18 | 9,9,2,2=22 |
| ఏకతాళం | । | 3 | 4 | 5 | 7 | 9 |

ఈ ముప్పది ఐదు తాళములును సూళాది తాళములందురు.

7. కళ : ఏక కళ, ద్వికళ, చతుష్కళ, అని మూడు విధములు. (1) ఏక కళ అనునది యథాక్షరకళ అని చెప్పబడును. అది ఒక క్రియ, ఒక అక్కరంబుగలది. (2) ద్వికళ ఒక క్రియ రెండు అక్కరంబులుగలది. (3) చతుష్కల. ఒక క్రియ నాలుగు అక్కరంబులు గలది.

8. లయ : గానముతోజేరి తాళము ఇంచుమించులేక నడచుటకు లయ యనిపేరు. అది విళంబలయ (చౌక), మధ్యలయ (సమం), ద్రుతలయ (వేగం) అని మూడువిధములు. (i) విళంబలయ అనునది ఏర్పడిన అక్షరక్రియతో మందగతిగా పాడుట (ii) మధ్యలయ అనునది ఏర్పడిన అక్షరక్రియలతో విళంబలయకు రెట్టింపు వేగముగలిగి సమగతిగా పాడుట. (iii) ద్రుతలయ అనునది ఏర్పడిన అక్కరక్రియలతో మధ్యలయకు రెట్టింపు వేగముగలిగి త్వరితగతిగా పాడుట.

9. యతి : ఒక తాళములోగల అంగముల వ్యత్యాసమైన చేరికకు యతియని పేరు. అది (i) సమయతి, (ii) గోపుచ్ఛయతి, (iii) స్రోతోవహాయతి, (iV) డమరు యతి, (లేక వేది మధ్యయతి), (v) మృదంగయతి (లేక యవ మధ్యయతి), (vi) విషమయతి, యని ఆఱు

విధములగును. i సమయతి అనునది ఒకతాళ ఆవర్తములోగల అంగములు ఒక రీతిగానే యుండుట. (సమముగాయుండుట) ఉదా: ౦ ౦ ౦ ౦ ౦ ౦ ౦ ౦. ఇటువలెనే తక్కిన అంగంబు లను జూచుకొనేది. ii గోపుచ్ఛయతి అనునది అంగములు ఆవుయొక్క తోకవలె మొదట పెరిగి రానురాను తగ్గుకొనిబోవుట. ఉదా: ౩ ౨ ၊ ౦ ౦. iii స్రోతోవహాయతి అనునది అంగములు ఒక నదివలె మొదట కుఱుచయై రానురాను పెరుగుకొనిబోవుట. ఉదా: ౦ ౦ ၊ ౨ ౩. iV డమరు యతి అనునది అంగంబులు ఉడుకవలె నడుమ కుఱుచబడి రెండుప్రక్కలును పెరిగి యుండుట. ఉదా: ౩ ౨ ၊ ౦ ౦ ౦ ၊ ౨ ౩. దీనినే వేది మధ్యయతియని జెప్పుదురు. v మృదంగయతి అనునది అంగములు నడుమపెరిగి యిరుప్రక్కలుకుఱుచగాయుండుట, ఉదా: ౦ ౦ ၊ ౨ ౩ ౨ ၊ ౦ ౦. vi విషమయతి అనునది అంగములు పలువిధములై కుఱుచబడియు పెరిగియు కలసియుండుట. ၊ ౦ ౨ ౦ ౩ ၊ ౨ ఒక తాళముయొక్క ఆవర్తములలోపల త్రికాలములైన గానక్రియలవలన పై జెప్పిన యతుల జూపింపవచ్చును అని సంప్రదాయజ్ఞులు జెప్పుచున్నారు.

10. ప్రస్తారము: ప్రస్తారము అనునది విస్తరించి గుణించుట. ఒక తాళములోగల అవయవముల అక్షరకాలముల గొని ఎన్ని విధముగా జేర్చి ప్రస్తరించి తాళభేదంబుల గల్పింప నగునని యెఱుగుట. ఉదా: ప్రస్తరించుక్రమము. ప్రస్తరించుటకు మొట్టమొదట బెట్టు కొనిన అంగమేదియో అదియే యథాంగము, లేక మూలాంగమందురు, ఆ మొదటి బంతినిగల పెద్ద అంగమునకు క్రింద పై గల పెద్ద అంగమునకు తగ్గిన సంఖ్యగల అంగమే బెట్టవలెను పెట్టిన అంగములో మిగిలిన సంఖ్యగల అంగముసు వామభాగమున నుంచవలెను, ఈ రెండవబంతిని గల పెద్ద అంగమునకు తగ్గిన అంగమును మూడవబంతిలో దానికి క్రింద నుంచవలెను, ఇందులో మిగిలిన సంఖ్యగల అంగమును వామభాగమున నుంచవలెను. ఇందులో మిగిలిన సంఖ్యగల అంగమును వామభాగమున నుంచవలెను. ఇటులనే ప్రస్తరించుకొని వచ్చుటలో మొదటి బంతిని బెట్టుకొనిన యథాంగ సంఖ్యకు తగిన తగ్గిన అంగములువచ్చినట్లయితే ప్రస్తారభేదములు లేవు. క్రింద లఘుప్రస్తారమువరకు గనిపించియున్న ప్రస్తారములను జూచి గమనించి ప్రస్తరించి జూచితే తెలియవచ్చును.

(1) విరామ ప్రస్తారము. ౦ ఇందులో భేదమొకటియే.

(2) ద్రుత ప్రస్తారము. ౦

౦ ౦ ఇందులో భేదము రెండు. పాతాళసంఖ్య (విరామము) 2. మహాపాతాళసంఖ్య (అంగములు) 3.

(3) ద్రుత విరామ ప్రస్తారము. ȣ

∪ o

o ∪

∪ ∪ ∪ ఇందులో భేదములు 4, పాతాళము విరామము 5, ద్రుతము 2, ద్రుతవిరామము 1, మహాపాతాళము (మూడు అంగములును జేరినది. 1, 2, 5) = 8.

(4) లఘు ప్రస్తారము 1 ఇది మూలాంగం

∪ ȣ

o o

∪ ∪ o యథాంగం

ȣ ∪ ఇందులో భేదములు 8. పాతాళము విరామము 12

∪ o ∪ ద్రుతము 5, ద్రుత విరామము 2, లఘు 1.

o ∪ ∪ మహాపాతాళము (నాలుగంగములును జేరినది)

∪ ∪ ∪ ∪ 1, 2, 5, 12 =) 20.

(5) షోడశాంగ ప్రస్తార పాతాళ మేరు.

| అంగము | భేదము | పాతాళము | మహాపాతాళము |
|---|---|---|---|
| విరామం | 1 | 1 | 1 |
| ద్రుతం | 2 | 2 | 3 |
| ద్రుతవిరామం | 4 | 5 | 8 |
| లఘు | 8 | 12 | 20 |
| లఘు విరామం | 16 | 28 | 48 |
| లఘు ద్రుతం | 32 | 64 | 112 |
| లఘు ద్రుత విరామం | 64 | 144 | 256 |
| గురు | 128 | 316 | 572 |
| గురు విరామం | 256 | 702 | 1274 |

17. ఆలాపనము లేక ఆలప్తి :

శ్లో. తత్రాలాపేషు సర్వత్రా ప్యాదావాక్షిప్తికా స్మృతా,
ఆక్షిప్తిశ్చైవ లోకేస్మిన్నాయి త్తమితి గీయతే. (చతుర్దండి ప్రకాశిక)

ఆలాపములో నెచ్చటను ఆక్షిప్తిక అను ఆలాపమే మొదటిదిగానున్నది. ఈ ఆక్షిప్తిక అనుదానినే ఆయిత్తము అని లోకులువాడెదరు. (1) ఆక్షిప్తిక లేక ఆయిత్తము.

శ్లో. పీనత్వేన యథాక్షిప్తం స్వనిర్వాహాయ భోజనం,
రాగేణాపి తథాక్షిప్తే త్యాదావాక్షిప్తికామతా. (చతుర్దండి ప్రకాశిక)

ఒకడు తాను పెరుగుటకై ఎట్లు భోజనము నపేక్షించునో అటులనే రాగము తాను వృద్ధిజెందుటకై ఆక్షిప్తికను అపేక్షించుచున్నది. గనుక రాగముయొక్క ఆరంభమందు మధ్యషడ్జమును ఆక్షిప్తికగా గొని మంద్రస్థాయియందును, మధ్యస్థాయి ఋషభ గాంధారస్వరము లోపలను గానముయొక్క క్రియను (వ్యాపారమును) జేసి రాగమునకును గాయకుని శక్తికిని దగినట్లు తారస్థాయి ఋషభగాంధార మధ్యమ పంచమముదాక నొకసారి పాడుకొనిపోయి మఱియు దిరిగి మధ్యస్థాయి షడ్జమునకువచ్చి పూర్తి సేయవలెను, ఇట్లు మీదబోయి వచ్చుటకు ఆక్షిప్తిక, లేక ఆయిత్తము అని జెప్పుదురు. (ఆక్షిప్తిక = (కొంచెము ముందుగా) ఉవ్వుట. ఆయిత్తము = (ఆరంభించుటకుగల) సన్నద్ధము లేక ప్రయత్నము. (2) మొదటి రాగవర్ధని లేక ఎడుపు; మొదటి విదారి లేక ముక్తాయి. (రాగవర్ధని = రాగమును పెంచుట. ఎడుపు = ఎత్తుట).

శ్లో. ఆక్షిప్తికానంతరంతు కర్తవ్యారాగవర్ధనీ,
ఇయమేవ జనైర్లోకే ఎడుప్పిత్యభిధీయతే,
తతోవిదారీ గాతవ్యాలోకే ముక్తాయిసంజ్ఞికా. (చతుర్దండి ప్రకాశిక)

పై జెప్పినట్లు ఆక్షిప్తికయైనతోడనే మొదటిరాగవర్ధనిని సేయవలెను. అది మధ్య షడ్జమునుండి వెడలి రాగమును పెంచుపనిని ముఖ్యముగా మంద్రస్థాయియందును అప్పటప్పటికి డాసిన స్థాయి యందును జేయవలెను. ఈ విధముగా సేయుటయందు స్వరములను గమకభేదములతో బట్టి ఉచితమైన వర్ణాలంకారముల నుపయోగించి విళంబకాలమే ముఖ్యముగా (చౌకముగా) పాడు నప్పుడు ఎడనెడ ద్రుతమధ్యమ కాలముల నిమిడించి ఆలాపింపవలెను, రాగ స్వరూపము వెలయునట్లు నిడిపింపగల స్వరముల నిడిపించి, తొలగింపగల స్వరముల దొలగించి, బహుత్వ మీయగల స్వరముల అల్పముగాబట్టక, అల్పత్వమీయగల స్వరముల బహుత్వముగాబట్టక [illegible]రో

హణావరోహణములలో వక్రములు గనుబడితే వానికిదగినట్లు వక్రముగా సంచరించి, రాగచ్ఛాయను జెఱుచు వివాదిస్వరములబట్టక, లేక గమకములచే వానిని వంచించి రంజనము గలుగునట్లు బట్టి, అన్యరాగస్వరములు కలియకను పాడి, పిమ్మట ద్రుతకాలముగానే పాడి పై జెప్పినట్లే తారస్థాయికేగి క్రమ్మఱతిరిగి క్రమముగా మధ్యషడ్జమునకు చీల్చుకొనిరావలెను. ఇట్లు తిరిగి చీల్చుకొనివచ్చుదానినే విదారి లేక ముక్తాయి అనిజెప్పుదురు. (విదారి = చీల్చగలది.) (3) రెండవ రాగవర్ధని, రెండవవిదారి: ఇది మొదటి రాగవర్ధనివలె తిరుగజేసుటయందు వేఱు విచిత్ర కల్పనలతో గమకవర్ణ అలంకారములు విలసిల్లునట్లు పనిజేసి ముఖ్యముగా మధ్యస్థాయియందును, మాటిమాటికి తక్కిన స్థాయిలయందును ఆలాపించి పిమ్మట తారమధ్యమ పంచమము వరకేగి అక్కడనుండి చీల్చుకొని క్రిందదిగవలసినది (4) మూడవరాగవర్ధని, మూడవ విదారి: ఇది పైగమనించినట్లు జేయుటలో ముఖ్యముగా పైస్థాయి స్వరములందే పనిజేయవలసినది. కొందఱు మూడుసార్లు రాగవర్ధని విదారికలనుపాడక రెండుసార్లే పాడి మూడుస్థాయిల స్వరములందును కలసిపాడి విడుచుటయును కద్దని జెప్పుచున్నారు.

శ్లో. యథాయోగ్యం సమాదాయ విన్యసేన్మధ్య షడ్జకే.

5. స్థాయి:

1. ఆరోహణస్థాయి: స్వరసంచారముజేయుటలో ఒకస్వరమున నారంభించి మఱియు ఆస్వరమునందేవచ్చి ముగించితే ఆస్వరముస్థాయి అనబడును. 1. మొదట మధ్యషడ్జస్థాయిని గనిపించుకొని దానికి పైనుండు స్వరములనంటక మంద్రస్వరములందును మంద్రషడ్జమందును పనిజేసి మధ్యషడ్జమునకువచ్చి కొంత నిలిచి మఱియు మధ్యషడ్జముననుండియే వెడలి మంద్ర షడ్జమువరకు పనిజేసి మధ్యషడ్జమున వచ్చినిలుచుట మధ్యషడ్జస్థాయి ఆలాపమగును. 2. వెనుక మధ్యస్థాయి ఋషభమును స్థాయిగాబెట్టుకొని ఈ ఋషభమునకు పై నిగల స్వరములలో నొకటిని ముట్టక క్రింది ఋషభమువఱకు పైనిజెప్పినట్లు రెండుసార్లు సంచారముజేసి విడిచి మధ్యఋషభమున న్యాసముజేసి; 3. మఱియు మధ్యస్థాయి గాంధారమును స్థాయిగా గైకొని మీది స్వరముల నంటక క్రిందిగల స్వరములందే మునుపుజెప్పినట్లు రెండుసార్లు సంచారముజేసి తిరిగి ఆగాంధారమందే న్యాసముజేసి ఈప్రకారమే, 4. మధ్యమ; 5. పంచమ; 6. ధైవత; 7. నిషాదము; 8. తారషడ్జమువరకు క్రమముగా రెండుసార్లు సంచారముజేసి తిరిగి ఆయాస్వరములందే న్యాసముజేయవలెను.

(ii) అవరోహణస్థాయి: 9 తరువాత తారషడ్జమును స్థాయిగాగొని దానికి క్రింద గల స్వరములనంటక షడ్జమందును, దానికిమీదగల తారస్థాయి స్వరములందే (ఆరోహణమునకు జెప్పినట్లు) రెండుసార్లు సంచరించి ఆతార షడ్జమందే న్యాసముజేసి, 10. పిమ్మట మధ్యస్థాయి

నిషాదమును స్థాయిగాగొని ఆనిషాదమందును దానికిమీదగల స్వరములందే రెండుసార్లు సంచారముజేసి మధ్యనిషాదమందు న్యాసముజేసి; ఈ ప్రకారమే, 11. ధైవతము, 12. పంచమము; 13. మధ్యమము; 14. గాంధారము; 15. ఋషభములను క్రమముగా స్థాయీలుగా గైకొని పైజెప్పినట్లు రెండు రెండు సంచారములను న్యాసములును జేసి; 16. మధ్యషడ్జమును స్థాయిగాగొని సంచారములు రెండుజేసి తారస్థాయిలోనుండి చీల్చుకొని (విదారికగా) దిగవలెను. ఆరోహణస్థాయీలు పాడునప్పుడు ఆ యా స్థాయీ స్వరములకు మీదగల స్వరములలో నొకటియు నుపయోగింపదగదు. అవరోహణస్థాయీలు పాడునప్పుడు ఆయాస్థాయి స్వరములకు క్రిందగల స్వరములలో నొకటియు నుపయోగింపదగదు. అవరోహణ స్థాయీలుపాడుట ద్రుత కాలముగానే యుండవలెను. దీనియందు వర్జస్వరముల తొలగించి, ఆరోహణావరోహణ స్వరములననుసరించి స్వరముల అల్పత్వబహుత్వ దీర్ఘత్వ హ్రాస్వత్వముల గమనించి, గమకముల చేతను నానావిధ వర్ణాలంకారములచేతనురాగము అను రామను (స్త్రీని) భూషణవతియు, మనోహరియుగా తోపించి వినువారి మనసుకరగి మోహించునట్లు సేయవలెను.

శ్లో. యత్రోపవిశ్యతే తానఃస్వరేస్థాయీ సకథ్యతే. (చతుర్దండి).

మీదగనిపించిన సంచారులను తానములని వచించి, తానములుండెడు స్వరము స్థాయి అనబడు ననియు వెంకటమఖి జెప్పియున్నారు. (6) నాలుగవరాగవర్ధని, నాలుగవ విదారిక : ఇది రెండవ మూడవ రాగవర్ధని విదారికలబోలినదే. (7) మకరిణి : రంజనాస్పదమైన జీవస్వరమును స్థాయిగాబెట్టుకొని ఆస్థాయిని అల్పముగా జూపించి ఏదైన ఒక స్వరమందు ముగించి, తిరుగ ఆలాపనముజేసి మునుపు ఎత్తిన స్థాయీస్వరమునే జూపింపవలెను. ఈరీతిగానే మూడుసార్లు ఆలాపనముజేసి, నాలుగవసారి ఇటుల ఆలాపించుకొని మంద్రమునుండి తారమువరకు ఆలాపనముజేసుకొని మధ్యషడ్జమున ఆలాపనమును ముగించవలెను. దీనినే భరతమునీంద్రులు మకరిణి అని జెప్పియున్నారు.

శ్లో. సాధారణం సర్వరాగేష్వేతదాలాప లక్షణం. (చతుర్దండి ప్రకాశిక)

పైగనిపించిన ఆలాపలక్షణము సకల రాగములకును సాధారణమైనదని వెంకటమఖి జెప్పియున్నారు. (8) ఆలాపనజేయుటలో తానం తానం తా అని ఆలాపించవలెనే గాని వేరు శబ్దోచ్చారణములు తగదని పూర్వాచార్యుల సమ్మతము. తానంతా అని విళంబముగా నాలాపనమున సేయునపుడు తానంతా అను అక్షరములు నెగ్గియుండక ఆకార అంకారములు దీర్ఘోచ్చారణములుగా నుండవలెను. సముద్రము ఎన్ని నదులు జేరినప్పటికిని ఎప్పటివలె నెట్లు ప్రకాశింపు చున్నదో, అటులనే ఎడనెడ ద్రుతమధ్యమకాలములు కొంత కొంత కలసి ఆలాపనము జేసినప్పటికిని చౌక (విళంబ) కాలమే స్థాయిగా ప్రకాశింపవలెను. కేవల విళంబకాలముగానే ఆలాపనము

జేసినట్టయితే శ్రావ్యముగా నుండదని సంప్రదాయజ్ఞుల సమ్మతము. (9) మధ్యమకాలము : తానం తా తానన్న తా నంన అని కొంత కొంతగా నెగ్గుకొని మధ్యకాలము గానముసేయునప్పుడు న్యాసము జేయునెడల కొంత విళంబకాలము రావచ్చును. దీనిలో మధ్యమకాలమే స్థాయిగా ప్రకాశింపవలెను. (10) ద్రుతకాలము తానంతా అని పాడుటలో విడివిడిగా అకార అంకారం బుల ఇమిడించి నాభితానముగా ద్రుతకాలము పాడునప్పుడు ద్రుతకాలమే స్థాయిగా నుండవలెను. న్యాసముజేయునప్పుడు మధ్యమ విళంబకాలంబులు రావచ్చును. ఈ ద్రుతకాలమునే ఘనం పాడుటందురు. ఈ మధ్యమ ద్రుతకాలములకును ఆ ఆలాపలక్షణమే.

18. తాయము : (తాయము = ఒక స్వరమును స్థాయిగా గొనుట) ఆయారాగముల ననుసరించి ఏదైన నొకస్వరమును స్థాయిగా గల్పించుకొని, దానిక్రిందగల స్వరములందు రాగ లక్షణమువలె సంచరించి మధ్యషడ్జమున న్యాసమొనరించి; (1) ఆ స్థాయికి పైని ఆరోహణ క్రమముగాగల మొదటిది, రెండవది, మూడవది, నాలుగవదియైన స్వరముల క్రమముగా నొక్కొక స్వరముగా చేర్చుకొని సంచారములుజేసి మధ్యషడ్జమందే న్యాసమొనరించవలెను. మఱియు, (2) అవరోహణ క్రమముగా ఆ నాలుగవ స్వరమందే తానమునారంభించి దానికి క్రిందగల స్వరములనంటక ఆ స్వరమందును, దానికి పయినిగల స్వరములందును సంచార మొన రించి మధ్యషడ్జంబున న్యాసంబులుచేసి, స్థాయికి మూడవది, రెండవది, మొదటిది యైన స్వరము లందు క్రమముగా ఒక్కొక్క స్వరముగా నెత్తుకొని సంచరించి మధ్యషడ్జమందే న్యాసములొన రించవలెను. ఈరీతిని యెనిమిది తానములు గానముచేసి స్థాయిస్వరము నెత్తుకొని ఆలాపలక్షణ ప్రకారముగా కొంచెమాలాపించి తారస్థాయినుండి విదారించుకొనివచ్చి మంద్ర (మధ్య) షడ్జమందు తాయము పాడుటను న్యాసంబుతో నిలువవలెను. అని వెంకటమఖి తమ చతుర్దండి ప్రకాశిక తాయ ప్రకరణములో జెప్పియున్నారు.

19. కటకము, తానము : వెంకటమఖి మొదలైన పూర్వికులు తానంబులను కటక మని జెప్పుచున్నారు. ఆలాపలక్షణంబువలె ప్రతిరాగంబులగల తానంబులకు ఆయుత్తము, ఎడుపు, ముక్తాయి; ఎడుపు, (ఆయా రాగంబునకు దగినట్లు) స్థాయి, (క్రమంబుగా) ఆరోహి, అవరోహి, సంచారి, మకరిణి, ముక్తాయి అను లక్షణంబులుగల తానంబులు ఈ సంగీత సంప్రదాయప్రదర్శిని లోగల రాగంబుల కన్నింటికిని ప్రాచీనపుస్తకంబులో యున్నవి. పూర్వికులచే వీణలో మిక్కిలి చేతిమార్పుల చమత్కారములు వెలయునట్లు సేయబడిన ఘనరాగ తానములను వైణికులు ముఖ్యంబుగా నభ్యసించి వాయించుట వాడుకగానున్నది.

20. గీతము : శుద్ధ ఛ్ఛాయాలగసూడ. సూడ అనునది గీతవాచకమైన దేశీయ పదము. శాస్త్ర నియమంబులుగల ఛాయనుపొందిన గీతము శుద్ధ సాలగసూడ. సాలగము

అనునది ఛాయాలగ పదవికారము. ఈ సాలగసూడ, ధ్రువ, మఠ్య, ప్రతిమఠ్య, నిస్సారుక, అట్టతాళ, రాసతాళ, ఏకతాళములైన ఏడు భేదంబులు. వీనిలో ధ్రువము అనునది మొదటి ధాతుమాతువులతోఁజేరిన రెండు ఖండములు ఉద్గ్రాహము అను నొకఖండమగును. ఈ ఉద్గ్రాహ ఖండమందుగల స్వరములకంటె ఉచ్చమైన స్వరములగలిగిన ఆభోగము అనునొక ఖండముగలదు. ఉద్గ్రాహఖండముయొక్క మొదటిభాగ మెచట న్యాసముంచబడునో దానికి ధ్రువము అనిపేరు. ఈ ధ్రువము పదునొకండక్షరము మొదలు ఇరువదియాఱక్షరములవరకు గల పదియారు భేదము లకు నామములు, రసములు, తాళములు మొదలైన లక్షణములు వేఱ్వేఱ జెప్పబడియున్నవి. ఇటులనే తక్కిన అలుతాళములకును జెప్పబడియున్నవి. ఈవివరములు విశదంబుగా చతుర్దండిప్రకాశికలో గీతప్రకరణమందును, సంగీతరత్నాకర ప్రబంధాధ్యాయాంతమందును జెప్పబడియున్నవి. గ్రంథవిస్తరభీతిచే నిచట విరివిగా జెప్పక చాలించుకొంటిని. ఇటువంటి గీతంబులు ఇప్పట్లో గనబడ లేవు. ధ్రువము మొదలైన సూళాది ఏడుతాళంబులును, ఝోంపటయును, రగణమధ్యంబును ఈ తొమ్మిది తాళంబులే గీతంబులందు జేర్చవలెనని వెంకటమఖి అలంకారంబులు జెప్పుచోట జెప్పి యున్నట్లే ఇప్పటివాడుకలోనున్న గీతంబులలో కనుబడుచున్నవి. గీతంబులు రెండు ఖండంబులు మూడు ఖండంబులుగానున్నవి. రెండు ఖండంబులుగానుండు గీతంబులలో మొదటిది ఉద్గ్రాహ ఖండము; ఈ ఉద్గ్రాహఖండ స్వరంబులకంటే ఉచ్చమైనస్వరంబులు గలదియే రెండవదియైన ఆభోగఖండము. ఈ రెండు ఖండంబులుగల గీతంబులలో మొదటిఖండమందే ధ్రువఖండము మధ్య షడ్జన్యాసంబుగా నుంచబడియున్నది. మూడుఖండంబులుగల గీతంబులలో మొదటిది ఉద్గ్రాహఖండము, రెండవ అభోగఖండము, మూడవది ముద్రాఖండంబుగా నుంటున్నవి. ఈ మూడు ఖండంబులుగల గీతంబులలో మాత్రము అంతరిగలదు. మొదటిదియైన ఉద్గ్రాహ ఖండంబులో ధ్రువం, అవతల అంతరి.* అవతల జావడ†; రెండవదియైన ఆభోగఖండం, పిమ్మట అంతరి; పిమ్మట మూడవది యయిన ముద్రాఖండం, పిమ్మట అంతరము. ఇటులనే ప్రాచీన పుస్తకంబులలోను, వాడుకయందును గనుబడుచున్నవి. ఈ అంత రంబును ఐదవ ధాతువనియు, త్రిఖండగీతంబుల మాత్రమే కనుబడుచున్నదనియు వెంకటమఖి చతుర్దండి ప్రకాశిక ప్రబంధ ప్రకరణంబులో జెప్పియున్నారు. ముద్రాఖండంబు అనేకంబుగా ఉద్గ్రాహఖండధాతువును గలదిగానే యుండినప్పటికిని, కొన్నిగీతముల ముద్రాఖండధాతు కొంచెము వేఱుగా కనుబడుచున్నవి. ఈవివరంబు ఈ పుస్తకంబులోగల నాదరామక్రియ, హిందోళరాగ గీతంబులు మొదలైనవానిని జూడుడు. ముద్రాఖండ ధాతువులు విశేషంబుగా

---

* అంతరంబుల ధాతుమాతులు మూడు ఖండంబులకును ఒకటిగానే యుండును.

† జావడ అనునది దేశీయపదం. ఆ పదమునకు గీతములో సగము అని అర్థము.

ఉద్గ్రాహఖండ ధాతువలెనుండుటవల్ల పాఠముసేయువారు పాలుమాలి విడిచియుండుటచేత అంతరంబుతోఁగూడిన అనేకగీతంబులు ముద్రాఖండంబు లేక నేయున్నవి. రూపకతాళమునగల కొన్నిగీతంబులు ధ్రువరూపకమనియు, రూపక ధ్రువమనియు రెండు విధములై కనుబడు చున్నవి. (1) ధ్రువరూపకమనునది మొట్టమొదట మూడుకొట్లు కొట్టి విసరి, అవతల కొట్టైదు ఒక కొట్టందే ధ్రువంబున్నది. తోడనే విసరి రెండుకొట్లును, ఉద్గ్రాహఖండాంతంబున విసరు వచ్చినపిమ్మటనున్న ఆభోగ ఖండారంభంబున మూడుకొట్లుకొట్టి విసరి, తోడనే ఒక కొట్టకొట్టి విసరి రెండు కొట్లు కొట్టుకొనియేవచ్చి ఖండాంతమందు విసరినవెనుక ధ్రువఖండమును పాడుట వాడుక. కొన్ని గీతంబులలో ధ్రువముమీద జెప్పినట్లుండక ఆ ఉద్గ్రాహఖండమందే వేఱుచోటం దును గనుబడుచున్నది. (2) రూపక ధ్రువమనునది త్రిఖండగీతంబులుగాను అంతరమందు మూడు కొట్లుకొట్టి విసరి, తోడనే ఒకకొట్టుకొట్టి విసరి, పిమ్మట కొట్టైదు రెండవకొట్టందు ధ్రువమున్నది. ఆభోగఖండమును పాడి మీదజెప్పినట్లే తాళమువేసుకొనివచ్చి అంతరముపాడుట వాడుక. కొన్నిగీతంబులలో రంజనమునకై అనుద్రుత, ద్రుతంబులు మొట్టమొదట నెత్తబడి యున్నవి.

శ్లో. అష్టభాషాపదైర్యుక్తం అయ్యా అంవోతియైర్యుతం,
స్వరరాగైః ప్రగాయంతి గీతమిత్యభిధీయతే.

గీతంబుల మాతువులు సంస్కృతాభాసమైన ప్రాకృతాది భాషాపదములును. ఆభోగ ఖండమాతువు లలో అర్థములులేని అ ఇ, ఐయ్యా, తియ, అంవో ఇయ, అరే యను శబ్దములును ఉండవలెను.

శ్లో. గీత ప్రబంధ తాయానాం స్ఫాలనంబహిరంతరం,
తానాది మూర్ఛనానాంతు అంతస్ఫాలనమిత్యపి.

గీత ప్రబంధంబులగల ధాతుమాతువుల ప్రత్యక్షరములందును లోమీటు వెలిమీటును, తాయము లోమీటు వెలిమీటును, తానారాగాలాపన కీర్తనాదులందు లోమీటు మీటుకొని వీణ వాయించుటయే పూర్వీకుల సంప్రదాయము. కీర్తనాదులలోఁగల మాతువుల ప్రత్యక్షరంబు లందును లోమీటు మీటుటయుగాక, సాహిత్యాక్షరంబులు దూరంబుగా నుండినట్టయితే వీణలో తంత్రీనాదము తెలియునట్లు సందర్భానుసారంబుగా అబద్ధపు మీటును మీటి వాయించుటయే వాడుక. తానంబులకు రెండేసి అక్షరంబులకొక మీటును, త్ర్యశ్రజాతి ఖండజాతులలోఁగల అంత్యాక్షరములందు నడిమివ్రేలిచే తడమీటును మీటవలెను.

21. ప్రబంధము: ప్రబంధము ఆఱు అంగములతోను, నాలుగుధాతువులతోను, స్వర సందర్భముగలదిగా జేర్చబడినది. 1. ఆఱు అంగములు. (1) స్వరము; (2) బిరుదము;

(3) పదము; (4) తెన్నకము; (5) పాటము; (6) తాళము. 1. స్వరమనుట స రి గ మ ప ధ ని అను స్వరములు. 2. బిరుదమనుట, సంబోధనప్రధమగా ప్రబంధనాయకుని ధైర్యశౌర్యాదులను జేర్చబడుట. 3. పదమనుట క్రియకారక క్రియలచే ధైర్య శౌర్యాదులను జేర్చబడుట. 4. తెన్నకమనుట భాండీరభాషలో గలిగిన తేన అను శబ్దవికారము. తత్ అను పదముయొక్క సంబంధముగలది. తత్ అను శబ్దము నిత్యమంగళరూపమైన పరబ్రహ్మవాచకము. "ఓం తత్సత్" అనుటవల్లను "తత్వమసి" అను మహావాక్యమువల్లను ప్రబంధములలో తేన తేన అను శబ్దము కనబడుచున్నది. 5. పాటమనుట వాద్యములోగలుగు అక్షరసముదాయము. రుద్రవీణలోగలుగు తక తక మొదలైనవియును, ముఖ వాద్యమైన శంఖములోగలుగు తుకు తుకు మొదలైనవియును, ఉరోవాద్యములో గలుగు ధింత ధింత కిణ కిణ మొదలైనవియును తక్కిన వాద్యములందు లక్షణానుసారముగా గలుగు పాటములును గలవెయగును. 6. తాళమనుట తాళప్రకరణమున జెప్పబడినది.

11. ధాతు అనునది ప్రబంధమునకుగల అవయవము. ఆధాతువు (1) ఉద్గ్రాహము, (2) మేళాపకము, (3) ధ్రువము, (4) ఆభోగము. అని నాలుగు విధములు. 1. ఉద్గ్రాహము అనుట ప్రబంధముయొక్క మొదటిభాగము. మొదట గానమును గ్రహించుట. 2. మేళాపకము, ఉద్గ్రాహధ్రువములు గలయుటకు కారణమైనది. 3. ధ్రువము ప్రబంధముయొక్క ముగింపు. 4. ఆభోగము పైనిజెప్పిన ధాతువులగల స్వరములకంటె హెచ్చయిన స్వరములుగలది. ప్రబంధమందుపయోగింపబడెడి యీ ధాతువను పరిభాష సంగీతాచార్యులైన మతంగాది మునులచే వచింపబడియున్నది. ప్రబంధము ద్విధాతుకము; త్రిధాతుకము చతుర్ధాతుకములని మూడు విధములు. ద్విధాతుకము ఉద్గ్రాహ ధ్రువములు గలది. త్రిధాతుకము ఉద్గ్రాహ ధ్రువ ఆభోగములుగలది. చతుర్ధాతుకము ఉద్గ్రాహ మేళాపక, ధ్రువ ఆభోగములుగలది. ఇదిగాక నిర్యుక్తము, అనిర్యుక్తములని రెండువిధములు. నిర్యుక్తము ఛందస్సు రాగతాళములుగలది. అనిర్యుక్తము మీద జెప్పిన ఏర్పాటులేక జెప్పబడినది. ఈప్రబంధములు (1) మేదినీజాతి; (2) ఆనందినీజాతి; (3) దీపినీజాతి; (4) భావినీజాతి; (5) తారావళీజాతి అని ఐదువిధములు. 1. మేదనీజాతి స్వరములు మొదలగు షడంగములు; 2. ఆనందినీ జాతి ఐదంగములు; (3) దీపినీజాతి నాలుగు అంగములు; భావినీజాతి మూడు అంగములు; (5) తారావళీజాతి రెండు అంగములు. 1. మేదినీజాతి శ్రీరంగము మొదట ఏడు భేదంబులు. 2. ఆనందినీజాతి పంచతాళేశ్వరము మొదలు పది భేదంబులు. 3. దీపినీజాతి. సుదర్శనము మొదలు ఐదు భేదములు. 4. భావినీజాతి, వర్ణము మొదలు పదియేడు భేదంబులు. 5. తారావళీజాతి ఏల మొదలు ఇరువదిరెండు భేదంబులు. ఇవి యన్నియు ఏకజాతి ప్రబంధము. ద్విజాతి ప్రబంధము. (1) హంసలీల; (2) గజలీల; (3) ద్విపది; (4) ద్విగాసము; (5) వృత్తము; (6) ఘటకామ అని ఆరు విధంబులు. తక్కిన భేదము

లును వాని లక్షణములును చతుర్దండి ప్రకాశిక ప్రబంధ ప్రకరణమందును సంగీతరత్నాకర ప్రబంధాధ్యాయమందును జూచితే స్పష్టమగును. తానీకరణము. కొన్ని తానీకరణములు గీతలక్షణమును, కొన్ని తానీకరణములు ప్రబంధలక్షణముల ననుసరించి యెడనెడ విళంబ మధ్యలయలుగలవిగా నుండును. అలంకార, గీత, ప్రబంధ, తానీకరణములు మూడుకాలములందును నోరును చేతులును సమముగా యథాక్షరముగానుండునట్లు పాడవలెను. సూళాదులు నోరును చేతులును సమముగానే ఏకకలగా పాడవలెను. పై జెప్పిన అలంకారగీత ఠాయప్రబంధతానీకరణములు వీణలో లోమీటు వెలిమీటుగా వాయించవలెను. గీతప్రబంధతానీకరణములు మొదట మధ్యతార స్థాయీలందును, తరువాత మంద్రమధ్యస్థాయీలందును వీణలో రెండుసార్లువాయించినట్లుండుట యే సంప్రదాయముగా నున్నది.

22. కీర్తన పద దరు చౌకవర్ణ తానవర్ణాదుల లక్షణము :

కీర్తనము మాతుదేవతాస్తుతిగాను, పల్లవి, అనుపల్లవి, చరణములతోను మొదటి చరణముయొక్క కడపటిభాగము అనుపల్లవియొక్క ధాతువు ననుసరించియును, తక్కిన రెండు చరణములును మొదటిచరణ ధాతువు ననుసరించియును; కొన్ని కీర్తనములలో అనుపల్లవి చరణముల కడపటి భాగములు మధ్యమకాల[†] ఖండములుగాను, అనుపల్లవి చరణాంతములందు పల్లవి నెత్తునట్లును; పల్లవి ఒక ఖండమును, అనుపల్లవి రెండు ఖండములును, చరణము నాలుగు ఖండములుగా; పల్లవి రెండు ఖండములుగా నుండితే తక్కినవి రెట్టింపు ఖండములుగాను ఉండవలెను. 100 సంవత్సరంబులుగా లక్షణలక్ష్యజ్ఞులచే సేయబడిన కీర్తనపు చరణమొక్కటియే ఆచరణమొక్కటిలో నాలుగు లేక ఎనిమిది, పది రెండు ఆవర్తములుగానున్నను ధాతుభేదములొందియు కొన్ని కీర్తనములు పల్లవి అనుపల్లవి చరణాంతంబున ఆయాఖండములకు దగినట్లు మధ్యమకాల ఖండములు గన్పడుచున్నవి. సాధారణముగా కీర్తన, చౌకవర్ణ, పద, దరు, రాగమాలిక, జావళి, స్వరజతి మొదలైనవియు విళంబకాలమే స్థాయిగా (చౌకముగా) నుండినప్పటికిని సందర్భానుసారమై ఎడ నెడ[§] మధ్యమ *ద్రుతకాలము లిమిడింపబడియున్నవి. ఇదిగాక పైప్పబడిన కీర్తనాదులు పాడునప్పుడు చేతియందెల్లప్పుడు నొకఅక్షరముతో నోటియందు సందర్భానుసారముగా రెండు నాయిగు అక్షరములతో కొన్ని కీర్తనల పదములు మధ్యమకాలమై కనబడుచున్నవి. జంత్రగాత్రములందు, మంద్ర గాంధారము మొదలు తార పంచమమువరకు సంచరింపులు కీర్తనాదులయందు కలిగియుండును.

---

† ఖండము ఖండిక అనుట ఆవర్తమే

§ చేతిలోవేయు ఒక లఘ్వక్షరకాలంబునకు నోటిలో నాలుగు లఘ్వక్షరములు బలుకుట సరళి క్రమంబున 3వ కాలమైయున్నను, మధ్యమకాలమనియు, *చేతిలోవేయు ఒక లఘ్వక్షరకాలమునకు నోటిలో ఎనిమిది లఘ్వక్షరములు బలుకుట 4వ కాలమైయున్నను, ద్రుతకాలమనియు సంప్రదాయజ్ఞులు వాడుదురు.

23. పదము : పదముయొక్క మాతు శృంగారరస నాయికానాయక లక్షణవ్యవహారాదులతో పల్లవిని బట్టునట్టి అనుపల్లవ చరణమాతులునై విళంబకాలముగ పాడదగినదియై అనుపల్లవియందును మూడవచరణమందును నాయకముద్రలు గలిగినదియై కొన్ని పదములలో మూడవ చరణమందే ముద్రగలదియై యుండును. మొదటి చరణ ధాతువులనే రెండవ మూడవ చరణములనుసరించి యుండవలెను. శబ్దార్థములు చక్కగా నెఱిగి రసానుభవముతో చౌకముగా శ్రావ్యమగునట్లు పాడుటయే సంప్రదాయము.

24. దరు : దరు పదలక్షణంబులవలె, శృంగారరస మనుసరించి యుండుటయుగాక, ఒక చరణముతోను, కొంచెంకాలం తోసి పాడదగినదియును, కొన్నిదరువులు రెండుమూడు చరణములుగాను ఉండును.

25. చౌకవర్ణము : చౌకవర్ణము పదము బోలినదిగాక అనుపల్లవ ఆవర్తమునకు రెట్టింపైన ముక్తాయిస్వరము పల్లవినెత్తుకొనునట్లును, చరణము నాలుగు ఖండములుగాను, చరణ మొదటి ఖండాంతమున న్యాసముజేసుకొని విళంబలయగా నొక్కావర్తమైన మొదటిదియు, మధ్యమకాలముగా ఒకటికొకటి రెట్టింపైన ఆవర్తము గల రెండవది, మూడవది, నాలుగవదియైన స్వరముల క్రమంబుగా పాడి ఒక్కొక స్వరాంతంబున చరణముయొక్క మొదటి ఖండమును పాడి న్యాసముజేసుకొని పిమ్మట చరణముయొక్క తక్కిన మూడు ఖండములను పాడి అనుపల్లవిని గల ముక్తాయి స్వరమును పాడుకొని పల్లవినెత్తి నిలుపవలెను. కొన్ని చౌకవర్ణ స్వరములకు సాహిత్యాలును, కొన్ని చౌక వర్ణములు భక్తిరసముగాను ఉంటున్నవి.

26. తానవర్ణము : తానవర్ణము ఇది మధ్యమకాలముగానే యుండుట సంప్రదాయజ్ఞుల వాడుక. పల్లవి అనుపల్లవి-చరణపు మాతువులలోగల ప్రత్యక్షరములకును అకార ఇకారాదులు మిక్కిలి ఇమిడించి యుండుటయే వాడుక. అనుపల్లవి ముక్తాయి స్వర చరణస్వర క్రమములు చౌకవర్ణమునకు జెప్పినట్లే.

27. స్వరజతి : మధ్యమకాలము ననుసరించి శృంగారరసమైన మాతువును, పల్లవి, అనుపల్లవి చరణములును, అనుపల్లవమునకు కడపట ముక్తాయి స్వరరూపమైన ధాతువందు సగము పాటమును, సగముస్వరమును, కడపట తధిం గిణతోం అను పాటమును జేర్చి పల్లవిని ఎత్తునట్లు నుండవలెను. దీనికి సాహిత్యము గలదు. స్వరరూపమైన చరణపు మొదటి ఖండికయును, ఆస్వర సాహిత్యంబును పాడుకొని క్రమముగా చరణముయొక్క మొదటిది, రెండవది, మూడవది, నాలుగవదియైన స్వరసాహిత్యంబులపాడి అప్పటప్పటికి చరణపు మొదటి ఖండస్వరంబున న్యాసంబు జేసుకొని పిమ్మట చరణముయొక్క దక్కిన ఖండికలను చౌకవర్ణమునకు జెప్పినట్లే పాడవలెను.

కొన్ని స్వరజాతులు పాటసమూహమును గర్భమ దుంచుకొని స్వరసందర్భరూపమై సాహిత్యంబు లతో నుండుటలో ఆయారాగ మూర్ఛనలకు దగినట్లు ఆరోహణక్రమమైన స్వరములలో నొక టొకటికి ఒకటి లేక రెండేసి స్వరసాహిత్యంబులుంచి రచించుటయును, ఇటులనే అవరోహణ క్రమముగా రచించుటయుగలదు. ఈ స్వరజాతుల మాతువులు దేవతాస్తుతిగా నుండుటయుగాక ఆరంభమున పల్లవమును బోలిన మాతువులు గనుబడుచున్నవి.

28. జతి స్వరము: ఇది నృత్యంబున కుపయోగకరమైనది. పల్లవ, అనుపల్లవ చరణంబులకు ధాతుమాత్రమే కనుబడుచున్నది. దీనిలో మూడవస్వర మేరాగమున కేది జీవస్వరమో దానినే ఎడుపు స్వరముగా బెట్టి రచించియున్నారు.

29. జావళి: ఇది దరు లక్షణమును, గ్రామ్య గానంబును అనుసరించియుండును.

30. తిల్లాన: ఇది అన్యదేశీయమైన తిరి తిల్లానా అను గ్రామ్య పాటములు, దేశీయ రాగము, వర్ణక్రమము, తాళబద్ధము, వీనితో గూడియుండును.

31. శబ్దము: శబ్దమునది తాళపాట సాహిత్యంబుల బద్ధము.

32. సూళాది: (సూడ) సూళాది అన్నది ప్రసిద్ధాలంకార సప్తతాళంబులును, రగణ మఠ్యంబును, ఉద్గ్రాహ, ధ్రువ, ఆభోగధాతువులతో ఏకకలగా (యథాక్షరముగా) విళంబ మధ్యమ లయలు గలదియై వర్ణక్రమంబులలో సాహిత్యరూపమైయుండును. ఈ సూళాదులు శ్రీ పురందర విఠలదాసులవారు గాక దక్కినవారెవరును జూచినట్లు కనుబడలేదు.*

33. రాగమాలిక: శృంగారరసము, లేక భక్తిరసముగాను, అర్థములతో సమర్పబడిన రాగములును, తాళములకు దగినట్లయిన ఆవర్తములును, వర్ణక్రమంబుగా ఆయా రాగ జీవ స్వరములతో సమర్పబడిన మాతువును, పల్లవ అనుపల్లవ చరణములును, లేక తొమ్మిది, పదునాలుగు,

---

* పురందరదాసుల కాచార్యులైన శ్రీ వ్యాసరాయస్వామి రచించిన సూళాదులున్నవి. ఈ గ్రంథము నందే భిన్నషడ్జ మేళజన్యమైన భూపాళరాగమున రచించినది 'తందెయాగి తాయాగి' అను సూళాది వారిది ఉదాహరింపబడినది. శ్రీ స్వామివారి ముద్ర 'శ్రీకృష్ణ' యనునదే ఆసూళాదిలోగలదు. పురందర విఠలముద్ర అందులేదు కనుక అది పురందరదాసులదిగా ఈ గ్రంథమున నుల్లేఖించినది పొరబాటనవలసియున్నది ఇదిగాక పై వ్యాసరాయలకు గురువగు శ్రీపాదరాయలవారును సూళాదులు రచించినారని వినికి. మరియు శ్రీపాదరాయలవారి సమకాలీనులగు తాళ్ళపాక అన్నమాచార్యులుగారు రచించినది, ఏడుతాళములు ఏడు రాగములును గల 'దేశీయసూళాది' యొకటి. ఇంకను అచ్చుపడనిది, తిరుపతి దేవస్థానపురాగిరేకులలోనున్నది. (రా. అ)

పదియాఱు రాగముల నమర్చులను, ఆయా రాగముల కొనలందు తాళానుసారమైన ఆవర్తములు గల ముక్తాయి స్వరంబులును, కొన్ని స్వరములు సాహిత్యంబులతో గనబడుటయుగాక, కొన్ని రాగమాలికలలో విలోమక్రమంబుగా రాగమొకటికి ఒక ఆవర్తస్వర సాహిత్యములవంతున పల్లవి లేక మొదటిరాగము నెత్తుకొనువరకు ఎన్నిరాగములున్నవో అన్ని రాగములకును స్వరసాహిత్యంబులు రచించియుండుటయును, అర్థములతో రాగంబుల నమర్చియున్నట్లే రాగ, తాళముల నమర్చియున్న రాగతాళమాలికయును గనుబడుచున్నది.

34. పల్లవి పాడుక్రమము: ఏ తాళములుగానుండినప్పటికిని మాత్రమైన పల్లవి యొక్క ఆద్యక్షరము అతీత అనాగత సమగ్రహంబులలో ఏ గ్రహమున నెత్తినప్పటికినీ, అది తప్పకను, మొట్టమొదట నోట మాతువుయొక్క ఏఏ అక్షరములు ఎట్లెట్లు తాళావయవాక్షరముల నమర్చి పాడుచున్నారో ఆయా అక్షరములు నిలుచుచోట్ల తప్పక కల్పనలు జేసి తాళానుసారముగా ఒకటి, రెండు, లేక నాలుగు ఆవర్తములుగా పాడుకొనివచ్చుటలో మొదట పాతిక, అర, ఒక ఆవర్తముగా శక్త్యానుసారమునకు దగినట్లు పెంచుకొనివచ్చునప్పుడు వచ్చిన సంగతులురాక, రాగ తాళ నియమంబులు తప్పక, వినువారి కింపుగలుగునట్లు పాడవలెను. పిమ్మట పాతిక, అర, ఒకటి, రెండు, మూడు, నాలుగు వంతున స్వరములను విచిత్ర శయ్యలతో సామర్థ్యమునకు దగినట్లు పాడి పల్లవి యెడుపక్షరము దప్పక ఎత్తవలెను. ఇటుల కల్పనలుగా స్వరములు పాడునపుడు, ముత్తెము, పవడము, నీలములు గ్రుచ్చుటవలె స్వరముల ఎడనెడ పాటములును, అయా రాగంబులకు దగిన గ్రహస్వరంబులను జేర్చి పాడుటయు సంప్రదాయము. ఇదిగాక ఎవరైనను సమస్యగా స్వరవరుస, లేక పాటముల నిచ్చినప్పటికిని తాను పాడుకొనివచ్చు స్వరములో కడపటపెట్టి పాడి పల్లవి ఎడుపునెత్తవలెను. కడపటబెట్టు తదింగిణ తోం అనునది పాటముతో జేరినదే. పూర్వీకులు పౌనరుక్తులు రాక నుండుటకొఱకై పల్లవిని మధ్యమకాలముగానే పాడుట సంప్రదాయముగా నున్నది. ద్రుతకాలము కీర్తనములలో ఎడనెడ నెటులవచ్చునో అటుల పల్లవియందు వచ్చుటయులు కలదు. ఎడుపు మొదలైన అక్షరములన్నియు ద్రుతకాలముగానే ఇమిడించి పాడుట ఏబది సంవత్సరపు వాడుకగా నేర్పడినది. ఈలాగుపాడుటలో పౌనరుక్తదోషంబులు మిక్కిలి కలుగుచున్నవనియు, ఇది సంప్రదాయముగాదనియు పెద్దలు జెప్పుకొని యుండిరి. ఇరువది సంవత్సరములుగా కొందఱు గాయకులు చేతిలోవేయు ఒక లఘ్వక్షర కాలమునకు నోటిలో పదియాఱు లఘ్వక్షరకాలమువంతున పాడుచున్నారు. ఇందులో వచ్చెడి పౌనరుక్తులు జెప్పనలవిగాదు, అతి విళంబమును, అతి ద్రుతమునుగా పాడుట దోషమనియే పూర్వీకుల సమ్మతము.

శ్లో. గురుప్రసాద మార్గేణ శివానుగ్రహయోగతః,
లభ్యాచ గానసరణిః, ఇతరేషాంతు దుర్లభా.

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | సంఖ్య ఉ.భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 1 | రా | కనకాంబరి | సా రి మ, ప ధ సా | సా నీ ధ ప మ గా రి రీ స్సా |
| | ఉ 1 | ముఖారి (శుద్ధ) | స రి మ ప ధ సా | స ని ధ ప మ గ రి స |
| | 2 | శుద్ధసావేరి | స రి ను ప ధ సా | స ధా ధ ప ప మ రి సా |
| 2 | రా | ఫేనద్యుతి | స రి మ ప ధ ధ ప ని* ని స | స ని ధ ధ ప మ గ గ రి స |
| 3 | ,, | గానసామవరాళి | స రి మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | ఉ 1 | పూర్వవరాళి | స రి మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 2 | భిన్నపంచమము | స రి గ గ రి మ ప ధ ప ని నీస్సా | స ని ధ మా గ గ రి స |
| 4 | రా | భానుమతి | స రి మ ప ధ ని స | స ని ధ ప మ గా రి స |
| 5 | ,, | మనోరంజని | స రి మ ప ధ నీ స | స ని స ధ ప, మ ప మ, రి గ* రి స |
| 6 | ,, | తనుకీర్తి | స రి మ ప ని స | స ని ద* ని ప, మ గ రి స |
| 7 | ,, | సేనాగ్రణి | స రి గ గ రి మ గ మ ప, ని ధ† స్సా | సా నీ ధ ప మ* గ మా గ గ రి స |
| 8 | ,, | జనతోడి(ర-దే) | స రి గా మ, ప ధ నీ స | స ని ధ ప మ గా రి స |
| | ఉ 1 | నాగవరాళి | స రి గ మ ప. మ ధ ని స | స ని ధ మ ప* గ రి స |
| | భా 1 | పున్నాగవరాళి | ని స రి గ మ ప ధ | ధ ప మ గ రి స ని |
| | 2 | అసావేరి (ర) | స రి మ ప ధ సా | స ని ధ ప మ గా రి స |
| 9 | రా | ధునిభిన్నషడ్జము | స రి గా మ ప ధ ని ప | స ని ధ ప మ గా రి స |
| | ఉ 1 | మోహననాట | స గా మ ప ధ ప మ, ప ని ని సా | స ని ప ధ* ధ, ప మ గ స |
| | 2 | భూపాళము(ర) | స రి గ ప ధ స | స ధ ప గ రి స |
| | 3 | ఉదయరవిచంద్రిక | స గ మ ప ని ని ప | స ని ప, మ మ గ స |
| 10 | రా | వటాభరణం | స గ మ ప్పా ని ధ* ని స సా | స ని ధ ని పా, ని ప ప మ గ గ, రి రి సా |
| 11 | ,, | కోకిలారవము | సా, రి మ మ ప, మ ప ధ ని సా | స ని ధ ధ ప, మ గ రి రి స |
| 12 | ,, | రూపవతి | స రి మ ప, ప స సా | స ని ధ ని ప, మ గ స |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | ఉ.భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 13 | రా | గేయహెజ్జిజ్జి | సరిమ, గమపధస | సనీధప మగరిస |
| 14 | ,, | వాటివసంత భైరవి | సరిగమ, మధనిస | సనిధ, మగమపమగరిస |
| | ఉ 1 | లలితపంచమము | రిసగా మధనిస | సా నిధపమగరిస |
| 15 | రా | మాయామాళవ గౌళ | సరిగమపధనిస | సనిధపమగరిస |
| | ఉ 1 | సాళంగ నాట | సరిమపధస | సనిధపమగరిస |
| | 2 | ఛాయాగౌళ | సరిమపధపమపధసనిస | సనిధధపమగస, రిస |
| | 3 | మంగళకైశికి (ర) | సరిగమపమగ, పధనిస సరిమగధపస | సనిధపమగరిస |
| | 4 | మేఘరంజని | సరిగమనిస | సనిమగసరి ✱ స |
| | 5 | మేచబౌళి (ర) | సరిగపధస | సనిధపమాగరిస |
| | 6 | టక్క 1 | సగమధధని ✱ ధస | సధమగరి ✱ గస |
| | | 2 | సగమపమగమధనిస | సనిధమపమగమరిగస |
| | 7 | పాడి | రిమపధపనిస | సనిప, ధా ✱ పపమరీస |
| | 8 | నాదనామ క్రియ (ర) | సరిగమపధనిస | సనిధధప, మా గరిరిస |
| | 9 | రేవగుప్తి | సరిగపధస | సధపగరిస |
| | 10 | కన్నడబంగాళ | సరిమపధస | సధపమగరిస |
| | 11 | గౌళ (ఘ) | సా, రిమపనిస | సనిపమరిగ ✱ మరీస్సా |
| | 12 | లలిత | సరిగమధధనిస | సనిధమామగరిస |
| | 13 | గుజ్జరి | సరిగమపధనిస | సనిధపమగరిస |
| | 14 | గుండక్రియ | సా, రిగమపధనిస | సా నిపమగమ, ధపమగరిస. |
| | 15 | మలహరి (ర) | సరిమపధస | సధసమగరీస. |
| | 16 | బౌళి (ఘ) | సరిగపధనిస (అల్పనిషాదము) | సనిధపగరిస |

రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | ఉ. భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 15 | 17 | ఆర్ద్రదేశి 1 | సరిగమపధనిస | సనిధపమగగగరిస |
| | | 2 | (రిసనిధ) నిసరిగమపధప ధధధసనిస | (ధస) ధపమగగగరిస |
| | 18 | దేవరంజి | సమపధ, పనిధ, పనిస, ధనిస, ధసస. | సనిధపమసా |
| | భా 1 | సౌరాష్ట్రము (ర) | సరిగమపధనిస | సనిధపమగరిస |
| | 2 | పూర్వి (ర, దే) | సరిగమపధనిస | సనిధపమగరిస |
| | 3 | గౌడిపంతు (ర) | సరిమపనిస | సనిధపమగరిస |
| | 4 | మారువ | సగమధనిస | సనిధపగమ * గరిస, రిగరిస |
| | 5 | సావేరి (ర) | సరిమపధసా | సనిధపమగరిస |
| | 6 | మాళవపంచమం | సరిగమపనిస | సనిధధపమగరిరిస |
| | 7 | పూర్ణపంచమం | సరిగమపధస | సధపమగరిస |
| | 8 | మార్గదేశి | సరిగరిగధమపధస | సధమ * పగరిస |
| | 9 | రామకలి (దే) | సరిగపధస | నిధపమగరిస |
| | 10 | ఫరుజు | సరిగమపధనిస | సనిధపమగరిస |
| | 11 | గౌరి (ర, దే) | సరిమపధనిస | సానిధపమమపమగరిస |
| | 12 | వసంత (దే) | రిసగమధనిస | సానిధనిధమాగ, మమ పమగరిస |
| 16 | రా | తోయవేగ వాహిని | సారిగమపధనిసా | సానిధపమగరిసా |
| | భా 1 | భైరవము (దే) | సరిగమపధనిస | సధపమమపమగరిస |
| 17 | రా | ఛాయావతి | సరిగమధధధనిస | సనిధపమగరిస |
| 18 | రా | జయశుద్ధమాళవి | సరిగమపనిస | సనిధ * నిపమగరిస |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | ఉ. భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 19 | రా | ఝంకారభ్రమరి | సా రి గ మ ప ధ ని ధ ప ధ సా | స ని ధ ప మ, గ రి గా రి రీ సా |
| 20 | రా | నారీరీతిగౌళ (ఘ) | స రీ గ మ్మ, ప ధ ప ని ని సా | సా ని నీ ధ మా గ గ రి స |
| | ఉ 1 | హిందోళ | స గ గ మ ని ధ ని స | సా నీ ధ మ గ స |
| | 2 | నాగగాంధారి | స రి మ గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 3 | ఆనందభైరవి (ర) | స గ గ మ ప ధ * ప స ని స | సా ని ధ ప మ మ మా గ గ రి స |
| | 4 | ఘంటారవము (ర) | స గ రి గ మ ప ధ ప ని ధ ని స, | స ని ధ ప మ గ రి స |
| | 5 | మార్గహిందోళము | స గ గ మ పా మ, ధ ని స, | సా ధ మ గ స రి * స |
| | 6 | హిందోళవసంతం | స గ గ మ ప ధ స స | స ని ధ ప ధ నీ ధ మ గ స |
| | 7 | అభేరి | స మ గ మ ప ప స స | సా ని ధ ప మా గ రి స |
| | 8 | నవరత్న విలాసము | స రి గ మ ప ధ ప స | స ధ ప మ గ గ మ రి స |
| | భా 1 | భైరవి (ర) | సా, రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 2 | ఆహరి (ర) | స రి స గ మ ప ధ ని స, | సా ని ధా ప మ గా రి స |
| | 3 | ధన్యాసి (ర) | ని స గా మ ప నీ స్సా | ని ధ ప మ గ రి స |
| | 4 | గోపికావసంతం | రి * స రి గ మ ప ధ *, ప ని నీ స్సా | స ని ధ ప మ గ రి * మ గ స |
| | 5 | మాంజి (దే) | ని స రీ గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 6 | ముఖారి (ర) | స రి మ ప ధ సా, | స ని ధ ప మ గ రి స |
| 21 | రా | కిరణావళి | స రి మ ప, ధ * ప ధ ని స, | స ని ప, ధ ప మ ప గ రి స |
| 22 | రా | శ్రీరాగము (ఘ) | రీ మ ప ని స | స ని ప ధ ని ప మ రి గ * రి స |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | ఉ. భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 22 | ఉ 1 | మణిరంగు | రి మ మ ప ని ని స | స ని ప మ గ రి రి స |
| | 2 | సాళగభైరవి | స రి గ మ ప ధ సా.<br>స రి గ రి ప మ ప ధ ప సా. | స ని ధ మ గ రి స<br>ని స ధ ప మ గ రి స |
| | 3 | శుద్ధ ధన్యాసి | స గ మ ప ని స | స ని ప మ గ స. |
| | 4 | కన్నడగౌళ | స రి గ మ ప ధ ని స,<br>స గ గా మ ప ని నీ సా.<br>(మ గ రి స) ప్రయోగమును గలదు. | స ని ప మ గ స<br>స ని నీ ధ మ మ గ సా,<br>ని స నీ ధ మ మ గ సా |
| | 5 | శుద్ధదేశి | స రి మ ప ధ ని ధ ✱ స | స ని ధ ప ✱ ధ మ మ గ రి స |
| | 6 | దేవగాంధారి (ర) | స రి ✱ స గ గ మ, ప ధ ✱ ప ని ని స | సా ని ధ పా మ మా గ గ రి స, |
| | 7 | మాళవశ్రీ (ఘ) | స గ గ మ ప ని ని స | ని ని ధ ప ను ప, ని ధ మ మ గ స. |
| | భా 1 | శ్రీరంజని | స రి గ మ ధ ని స | స ని ధ మ గ రి స. |
| | 2 | కాపి (ర) | సా రి గ మ ప ధ ని స | ని ధ ప మ గ గ రీ స్సా |
| | 3 | హుసేని (ర) | స రి గ మా ప ధ ని సా | ని ధ ప మా గ రి స |
| | 4 | బృందావని (దే) | రి మ ప నీ స | ని ప మ రీ స |
| | 5 | సైంధవి (ర) | సా రి గ మ ప ని ధ ✱ ని స | స ని ధ ప మ గ రి స |
| | 6 | మాధవ మనోహరి | స రి గ మ ప ని ధ ✱ ని స | స ని ధ మ గ రి స |
| | 7 | మధ్యమావతి (ర) | స రి మ ప ని స | స ని ప మ రి స |
| | 8 | దేవమనోహరి | స రి మ ప ధ ని ప మ ప ని నీస్సా, | స ని ధ ✱ ని ప మ రి స |
| | 9 | రుద్రప్రియ (దే) | సా రి గ మ ప ధ ని ని సా. | స నీ ప మ గా రీ సా |
| | 10 | దర్బారు (దే) | సా రి గ మ ప ధ ని సా | నీ ధ ప మ గా రి సా |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య | | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| రా | ఉ. భా | | | |
| 22 | భా 11 | సహనా (దే) | స రి గ మ ప మ ధ ని సా | ని ని ధ ప మ గ గ రీ గ రి స |
| | 12 | నాయకి (దే) | సా రి గా మ ప ధ నీ సా | సా నీ ధ ప మ గా రీ సా |
| 23 | రా | గౌరీవేళావళి | స రి గ గ స, రి మ మ ప ధ ధ స్సా, | స ని ధ ప మ గ గ రి స |
| 24 | రా | వీరవసంతము | రి మ మ ప ని ధ ✱ ని స | స ని ప మ రి గ స |
| 25 | రా | శరావతి | స మ గ మ ప ధ ని ధ స | సా నీ ధ ప మ గ రి స |
| 26 | రా | తరంగిణి | స రి గ ప ధ ని ధ ప ధ స, | సా ధ ప గరి గ రి గ మ గ రీ స్సా |
| 27 | రా | సౌరసేన | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి గ సా. |
| 28 | రా | హరికేదారగౌళ (ర) | సా రి మ ప ని స | సా ని ధ ప మ గ. రి స |
| | ఉ 1 | బలహంస | స రి గ మ ప ధ స | స ని ధ ప మ గ రి స |
| | 2 | మాహురి | స రి మ గ రి మ, ప ధ సా | స ని ధ ప మ గ రి, సా రి గ రి స |
| | 3 | దేవక్రియ (ర) | స రి మ ప ధ స | స ధ ప మ రి స |
| | 4 | ఆంధాళి | స రి గ మ ప ని స | స ని ప మ గ రి స |
| | 5 | ఛాయాతరంగిణి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 6 | నారాయణగౌళ | రి మ ప ని ధ ని స | ని ధ ప మ గ రి గ రి స |
| | 7 | నటనారాయణి | స రి గ స రి మ ప ధ స | స ధ ప మ గ రి స |
| | భా 1 | కాంభోజి (ర) | స రి మ గ ✱ ప ధ ని ✱ ధ సా | స ని ధ ప మ గ రి స |
| | 2 | కన్నడ (ర) | స రి గ మ ప ధా ని స | స ని ధ ప మ గా రి స |
| | 3 | ఈశమనోహరి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి సా స్స |
| | 4 | సురటి (దే) | ని స రి మ ప నీ స్సా | స నీ ధ ప మా, గ రీ స్సా |
| | 5 | ఎరుకులకాంభోజి | స రి మ ప, ధ ని ధ ప ధ సా | సా ని ధ ప మ గ రి సా |
| | 6 | అఠాణా (దే) | స రి గ మ ప ధా ని స | స ని ధా ప మ గా రి స |
| | 7 | నాటకురంజి(ర) | సా రి గ మ ప, ధ ని సా | స ని ధ మ గ సా |
| | 8 | జుజావంతి (దే) | రీ గ మ ప ధ సా, ని ధ ని సా, | ని ధ ప మ మ గ రి స, రి మ గ రి స |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య | | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| రా | ఉ. భా | | | |
| 28 | 9 | కమాస్ (దే) | సా రి గ మ ప ధ ని సా | స ని ధ ప మ గ రి సా |
| 29 | రా | ధీరశంకరాభరణం | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | ఉ 1 | కురంజి | సా రి గ మ గ మ ప ని నీ స్సా | స ని ప ని ధ * ధ ప మ గ రి సా |
| | 2 | నారాయణి | సా రి మ గ రి గ మ, ప ధ సా | స ని ప, ని ధ ప ధ మ ప మ గ రి స |
| | 3 | ఆరభి (ఘ) | స రి మ ప ధ స | స ని ధ ప మ గ రి స |
| | 4 | శుద్ధ వసంతము | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 5 | నారాయణ దేశాక్షి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 6 | సామరాగము | సా రి గ స, రి ప ప ధ ధ స్సా (రి ప మ ధ ధ సా) అనియు గలదు) | స ధ ప మ గ రి స |
| | 7 | పూర్వగౌళ | స గ రి గ. స రి మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 8 | నాగధ్వని | స రి గ స మ గ మ ప ధ ని స, | స ని ధ * ని ప మ గ రి * గ స |
| | 9 | హంసధ్వని | స రి గ ప ని స | స ని ప గ రి స |
| | భా 1 | బిలహరి (దే-ర) | స రి మ * గ ప ధ సా | స ని ధ ప మ గ రి స |
| | 2 | బేగడ | స గ మ ప ని నీ స్సా | స ని ధ ప మ గ రి స |
| | 3 | పూర్ణ చంద్రిక | స రి గ మ ప ధ ని స | స ని ప మ గ * మ రి స |
| | 4 | సరస్వతి మనోహరి | స రి గ మ ధ ధ ని స | స ని ధ ప మ గ మ రి * స |
| | 5 | కేదారం | స మ గ * మ ప ని నీ స్సా | స ని ప మ మా గ రి స |
| | 6 | నవరోజు (ర) | ప̣ ధ̣ ని̣ స రి గ మ ప | ప మ గ రి స ని̣ ధ̣ ప̣ |
| | 7 | నీలాంబరి | సా రి గ మ మా ప ధ *। ప ని ని సా। ని ధ * ని సా | సా ని ప మా గ రి * గ సా |
| | 6 | దేవగాంధారి(దే) | సా రి మ ప ధ ధా స్సా | స ని ధ ప మ గ రీ, స రి గ రీ సా |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | ఉ. భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 30 | రా | నాగాభరణం | స రి గ మ ప ని ధ ✱ ని స | స ని ప మ గ మ రి స, మ గ రి స |
| | ఉ 1 | సామంత‡ | స రి గ మ, ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 31 | రా | కలావతి | సా రి గ మ, ప ధ ని ధ ప ధ సా | సా నీ ధ ప మ, రి గ ✱ మ రి స |
| 32 | రా | రాగచూడామణి | సా మ రి గ మ ప, ప ని నీ స్సా | సా ని ధ ప మ మ రి స |
| 33 | రా | గంగాతరంగిణి | స రీ గ, మా ప ధ ని సా | స ని ప ధ ✱ మ మ గ మ రి ✱సా |
| | ఉ | మనోహరి | సా గ మ ప ని సా | స ని ధ ప మ గ సా |
| 34 | రా | భోగచ్ఛాయానాట | సా రి గ, రి గ మ ప, ని ని స్సా | స ని ధ ✱ ని, ప స ని ప మ మ రి స |
| 35 | రా | శైలదేశాక్షి | స మ గ ప ధ స | స ని ధ స ని ప మ రి స |
| 36 | రా | చలనాట (ఘ) | సా రి గ, మ ప, ధ ని స | స ని ప మ మ రి స్సా |
| 37 | రా | సౌగంధిని | స రి మ ప ధ స | స ని ధ ప మ గ రి స |
| 38 | రా | జగన్మోహనము | సా గ మ ప ధ ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 39 | రా | ధాలివరాళి (ఘ) | స గ రి ✱ గ మ ప ధ ని స | స ని ధ ప మ గ గ రి స |
| 40 | రా | నభోమణి | సా గ రి ✱ మ ప ధ ✱ ప ని స | స ని ధ ప మ గ రి స. |
| 41 | రా | కుంభిని | స గ రి ✱ గ మ ప, ని ద ✱ ని స | సా ని ప మ గ రి స |
| 42 | రా | రవిక్రియ | స గ రి ✱ గ మ ప, ని ధ ✱ ని స | స ని ప, ప మ గా రి రి స |
| 43 | రా | గీర్వాణి | స రి గ మ ప, ధ ని ధ ప ధ స్సా, | స ని ధ ప మ గ గ రి స |
| 44 | రా | భవాని | స రి గ మ ప ధ ✱ ప నీ సా | సా ని ధ ప మ గా రి స |
| 45 | రా | శివపంతువరాళి (ర) | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |

† ఈ సామంతరాగ మూర్ఛనావరోహణములో మాత్రము స ని ధ ప మ గ రి అని వివాదిదోపయుక్తమై ప్రాచీనపుస్తకములో వ్రాయబడియుండుట లేఖరుల పొరపాటని యెంచవలసినదిగా నున్నది.

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య | | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| రా | ఉ. భా | | | |
| 45 | ఉ | సింధురామ క్రియ | స రి గ మ ప ధ ధ నీ స్నా | స ని ధ ప మ గ రి ✵ గ స |
| 46 | రా | స్తవరాజము | స రి మ ప ధ సా | సా ని ధ మ గ స |
| 47 | రా | సౌవీరము | స రి గ మ ప ధ ని స | స ని ధ మ గ రి స |
| 48 | రా | జీవంతిక | స రి గ మ ప ధ ని స | స ని ప మ గ రి స |
| 49 | రా | ధవళాంగము | స రి గ మ ప ధ స | స నీ ధ ప మ గ రి స |
| 50 | రా | నామదేశి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 51 | రా | కాశిరామక్రియ | స గ రి ✵ గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | ఉ | కుముదక్రియ | స రి గ మ ధ ధ సా | స ని ధ మ గ మ గ రి స |
| 52 | రా | రమామనోహరి | స రి గ మ ప ధ ని స, | స ని ధ ప మ గ రి స |
| 53 | రా | గమకక్రియ(దే) | స రి గ మ ప ధ ని స (ధ ని స) అల్పము | స ని ధ ప మ గ రి స |
| 54 | రా | వంశవతి | స రి గ మ ప ధ ని స | స ని ప మ గ రి స |
| 55 | రా | శామళరాగం | సా, రి గ మ ప ధ స | స నీ ద ప మ గ రి స |
| 56 | రా | చామరము | సా, రి గ మ ప ధ ని స | సా ని ధ ప మ గ రి స |
| 57 | రా | సుమద్యుతి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 58 | రా | దేశిసింహారవం | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 59 | రా | ధామవతి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 60 | రా | నిషధరాగం | స రి గ మ ప ధ ని స | స ని ప మ గ రి స |
| 61 | రా | కుంతలరాగము | స రి గ మ ప ధ స | స నీ ధ ప మ గ రి స |
| 62 | రా | రతిప్రియ | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 63 | రా | గీతప్రియ | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 64 | రా | భూషావతి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 65 | రా | శాంతకళ్యాణి (ర) | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |

## రాగాంగోపాంగ భాషాంగరాగ మూర్ఛనలు

| సంఖ్య రా | సంఖ్య ఉ. భా | రాగనామములు | ఆరోహణము | అవరోహణము |
|---|---|---|---|---|
| 65 | భా 1 | యమునా కళ్యాణి(దే) | స రి గ మ ప ధ ని సా | సా ని ధా ప మ గా రీ సా |
| | 2 | మోహన (ర) | స రి గ ప ధ ప | స ధ ప గ రి స |
| | 3 | హంవీరు (దే) | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| | 4 | సారంగ (ర) | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ రి స |
| 66 | రా | చతురంగిణి | స రి గ మ ప ధ ని స | స ని ప మ గ రి స |
| | ఉ | అమృతవర్షిణి | స గ మ ప ని స | స ని ప మ గ స |
| 67 | రా | సంతానమంజరి | స రి గ మ ప ధ స | స నీ ధ ప మ రి స |
| 68 | రా | జ్యోతిరాగము | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ గ స |
| 69 | రా | ధౌతపంచమం | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ రి * గా స |
| 70 | రా | నాసామణి | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ రి * గ స |
| 71 | రా | కుసుమాకరము | స రి గ మ ప ధ ని స | స ని ధ ప మ రి * గ స |
| 72 | రా | రసమంజరి | స రి గ, స ప మ ప, ని ధ * ని సా | స ని ధ * ని ప, ప మ ప, రి * గ స |

(1) ఈ 72 రాగాంగ రాగములలో 40 రాగాంగములందు వచ్చు వివాది దోషముల నివర్తించు మార్గమును లక్షణసంగ్రహమందు జూడుడు. (2) * ఈ గురుతు ఏ రాగమూర్ఛనా స్వరమువద్ద నుంచబడియున్నదో ఆ స్వరము ఆ రాగమునకు వక్రస్వరమని ఎఱుగదగినది. (3) ఘన, రక్తి (నయ), దేశీయరాగములివి యని దెలియుటకొఱకై ఇమ్మూర్ఛనాపథకములో ఆ యారాగములకు వద్ద ఘన - (ఘ), రక్తి - (ర), దేశీ - (దే) అని గనిపింపబడియున్నవి (4) రాగాంగోపాంగ భాషాంగమునగల కొన్నిరాగముల మూర్ఛనలలో ఆరోహణములందుగాని అవరోహణములందుగాని జంటస్వరములు లేక దీర్ఘస్వరములు, ఎడనెడ ( , ) ఈ గుఱుతులు వెంకటమఖి పరంపరాగత ప్రాచీన పుస్తకములోనే వ్రాయబడియున్నది. వీని వివరణములు సమీపమున అచ్చొత్తి వెల్లడిబఱచగల "రాగరసమంజరి" అను ఒక చిఱుపుస్తకమువలన విశద

మగును. ఈ సంగీతసాంప్రదాయప్రదర్శినియందును కొన్ని రాగములలోగల జంటస్వర దీర్ఘస్వరములకు వివరణము జెప్పియుండినప్పటికిని పై జెప్పిన రాగరసమంజరిలో విశేషించివ్రాయబడును

(1) కనకాంబరి. ఈ రాగమూర్ఛనలో దీర్ఘముగల నిషాదగాంధారములను, (రి రీ స్సా) అను ప్రయోగమును, (2) శుద్ధసావేరి. ఈ రాగమూర్ఛనావరోహణమున దీర్ఘముగల షడ్జ ధైవతములవల్ల ఈ ధైవత ప్రయోగములును, (3) ఫేనద్యుతి. ఈ రాగమూర్ఛనారోహణములో జంట ధైవత నిషాదములును, అవరోహణములో జంట ధైవత గాంధారములును గనిపించియుండుటవల్ల ఇటువంటి జంటస్వర ప్రయోగములును, (సా పా ని ని సా) (స ప మ ప గ రి) (ప మ గ గ రి గ గ స) ఈ విశేషప్రయోగములును, విశేషరంజనపుల నిచ్చును. (4) గానసామవరాళి. ఈరాగమునకు (ధ స స రి స రి ప మ గ రి) (మ మ ప ప ధ ధ స స) (ని స ధ ప మ గ రి సా) ఇవి విశేషప్రయోగములు. (5) మనోరంజని. ఈ రాగంబునకు (ప మ ప ధ సా) ఇది విశేష ప్రయోగము. (6) సేనాగ్రణి. దీనికి గాంధారమధ్యమములును మిగులరంజనముగల జీవస్వరములు. సా (గ ప ధ స) (మ ధ ప గ రి స) ఇవి విశేష ప్రయోగములు. (7) తోడి. ఈ రాగమునకు గాంధార నిషాద ధైవతములు విశేషరంజనముగల జీవస్వరములు. (8) ధునిభిన్నషడ్జము. ఈ రాగమునకు గాంధారము రంజనముగల జీవస్వరము. (పా మ ప ధ మ ప గ గ గ రి స) (ధ ధ గ గ స) (గ గ ధ ప మ గ రి సా) (స రి గ ధ ప గ గ రి సా) (ధ మ గ రి సా) ఇవి విశేష ప్రయోగములు. (9) మోహననాట. దీనికి గాంధార ధైవతములును; (10) నటాభరణము. దీనికి గాంధార ఋషభ మధ్యమములును. (11) కోకిలారవము. ఈరాగ మూర్ఛనలో మధ్యమధైవతఋషభములు జంటస్వరములుగా నుండుటవల్ల ఇవియును విశేషరంజనముగల జీవస్వరములు. (12) గేయహెజ్జిజ్జి. దీనికి (స రి గ రి స) (ప ద ప ధ ప) ఇవి విశేషప్రయోగములు. (13) వాటివసంతభైరవి. ఈ రాగమునకు మధ్యమనిషాదములు మిగుల రంజనముగల జీవస్వరములు. (స రి గ మ మా ని నీ ధ ని పా) (స రి గ మా ధా మ ప గా రి రి సా) (ని ధ మ గ గ మ ప గ మ గ రి రి రి రి సా) ఇవి విశేష ప్రయోగములు. (14) లలిత పంచమము. ఈరాగమునకు (రి రి గా మ ధ ని స) అను ప్రయోగము గలదు. (15) మాళవగౌళ జీవస్వరప్రయోగములను గీతకీర్తనములలో గమనించి జూడుడు (16) ఛాయాగౌళ (సా రి గ మ ప ధ స) అనియు మూర్ఛనగలదు. (17) మంగళకైశికి. (మా మా గా గా రీ రీ (ధ ్రి రి గా) (గా మ ప మ గ) (రి రీ రీ ధా రి రి రీ సా) ఇవి ఈ రాగమును స్ఫురింపజేయు ప్రయోగములు. (18) మేచబౌళి. దీనికి గాంధారము వరకు మంద్రగతిగలదు. (19) టక్క. దీనికి మూర్ఛనలో గనిపించియుండు జంటధైవతప్రయోగములే రంజనాస్పదములు. అల్ప పంచమము. (20) నాదరామక్రియ. ఈ రాగ మూర్ఛనారోహణమందుగల జంటధైవత దీర్ఘమధ్యమ జంట ఋషభములుగాక గాంధారములును ఈ రాగ

మును స్ఫురింపజేసును. ఈ రాగము వాడుకలో నిషాదమునకు క్రింద మంద్రగతియును పైన తారగతియును లేక గనుబడుచున్నది. (21) పాడి. దీనికి ఋషభము జీవస్వరముగావునమూర్ఛ నారోహణాదిని ఋషభమును, అవరోహణాంతమున దీర్ఘ ఋషభమును గనిపించియున్నారు. (22) గౌళ. దీనికి ఋషభము జీవస్వరము (రీ గ మ రి స) (ప మ గ మ రి స) ఇవి రంజనమునీయ గల ప్రయోగంబులు. (23) లలిత. దీనికి మధ్యమ ధైవతములు రంజనముగల జీవస్వరములు. (ధ ధ స సా సా) (ధ ధ స స) (ధ మ ధ రి రి స ని సా) ఇవి విశేషప్రయోగములు. ఈ లలితకు మధ్యమమువరకు మంద్రగతి మిగులగలవు. (24) గుజ్జరి. దీనికి (ధ ధ సా) (మ గ ప ధ రి స ని సా) (స రి గ ప ధ ని ధ ప) (మ గ ప మ గ స) (ధ గ్గ రి స ని) (ధ రి రి సా) ఇవియు, (25) గుండక్రియ. దీనికి (గ మ ప ధ స) (స రి మ రి మ ప ధ స) (స మ గ స రి రి సా) ఇవియును విశేషప్రయోగములు. (26) ఆర్ద్రదేశి. దీనికి ధైవతగాంధారములు బహుత్వములు. (27) సామరాగమునకు (సా రి గ స) (రి ప ప ధ ధ స్సా) అనియు మూర్ఛనగలదు. సౌరాష్ట్రము మొదలు రసమంజరి వరకుగల రాగవిశేషములను ఆ యా రాగ వివరణములలో జూడుడు.

గమకసంజ్ఞా నియమవిధాన వివరణము.

శ్లో. దయమాన దీర్ఘనయనాం దేశికరూపేణ దర్శితాభ్యుదయాం,
వామకుచనిహిత వీణాం వరదాం సంగీతమాతృకాం వందే.

శ్రీ సావిత్రీ దేవతా వరప్రసాద సమాలబ్ద సకలకలాపారంగతులై యశోవంతులై విల సిల్లిన గోవింద దీక్షితులవారి పుత్రులగు శ్రీ వేంకటమఖి అను వెంకటేశ్వర దీక్షితులవారి పర మానుగ్రహమువలన పరంపరాగతమై లక్ష్యస్వరూపంబులతో నుపదేశపూర్వకంబుగ తెలిసికొనబడిన గమక స్వరూపంబుల నే నెఱిగినంత స్పష్టముగా సంజ్ఞావివరణంబులతో ప్రకటీకరింపవలెనని దలంచి శ్రీ పురందరదాసాది వాగ్గేయకారకులను మదినిస్మరించి, గమకస్వరూపమార్గదర్శియును, నాదు పెత్తండ్రియు నైన ముద్దుస్వామి దీక్షితులవారిని గూర్చి నమస్కరించి వ్రాయంబూనితి.

కం. నేరములు కాళిదాస మ। యూరాదులకైన గలుగ నొరులకు లేవే।
సారమతులైన సుకవుల। కారుణ్యమె నేర్పుకలిమి కవిజనములకున్॥

ఈ పద్యములో జెప్పినట్లు మహాకవులకుగూడ తప్పులుగలుగుచో నాబోటివారలకు తప్పులుగలుగుట గొప్పకాదు. కావున ప్రాజ్ఞులైన వాగ్గేయకారకుల కారుణ్యాతిశయమే నాదు సామర్థ్యాతిశయముగానున్నది. మిక్కిలి తెలిసినవారు నావల్ల వ్రాయబడిన గమకస్వరూపముల కనికరముతో చిత్తమున నంగీకరించి అనుగ్రహింతురు. తెలియనివారు చిత్తంబునబూని తెలిసి

కొనవలెనని అపేక్షింతురు. తెలిసి తెలియనివారు నాదుప్రార్థనలంగీకరించి మౌనముగా నుందురే గాక, వేఱొకటియు జెప్పజాలరని నమ్ముచున్నాను. గమక స్వరూపములబట్టెడి క్రమము గని పించుటకు వీణయే ముఖ్యసాధనముగా నుండుటవలన వీణలో గమకంబుల బలికించు విధంబుల నెఱిగిన కొలది నెఱింగించెద. ఈ సంగీత సంప్రదాయప్రదర్శినియందు ఉపయోగపఱచబడిన గమకపు గుఱుతుల వివరణము.

I. (1) కంపితము. — — ఒకానొక స్వరస్థానమందు డాచేతివ్రేళ్లను ఎటులబెట్టవలెనో అటుల మీటుతోబెట్టి అల్లార్చుటయే కంపితము అగును. ఒక స్వరస్థానమందే డాజేతి (Fore finger) జుట్టనవ్రేలును నడిమవ్రేలును చేరికగానుంచి కదలించుటయు కద్దు, ఉదాహరణముగా : (గా) ఈ కంపితమే కదలిక.

(2) లీనము. (3) ఆందోళితము. (4) ప్లావితము. ఇవి మూడును కంపితభేదములే వీని కాలనిర్ణయముల లక్షణసంగ్రహములో జూడుడు.

II. (5) i. స్ఫురితము. ∴ ఆరోహణక్రమముగా బొయ్యెడి ఒక్కొక్క జంటస్వరము లందును వీణలోగాని గాత్రమునగాని రెండవస్వరమును కొట్టుటయే స్ఫురితమగును. ఎటులనిన వీణలో స ṡ అను జంటస్వరమును బలికింపుచో జుట్టనవ్రేలు నిషాదస్థానమందును నడిమివ్రేలు షడ్జస్థానమందును ఏకకాలమందే బెట్టుకొని మొదటి షడ్జస్వరమును మీటి నిషాదస్థానమందున్న జుట్టనవ్రేలు నెత్తక నడిమివ్రేలుమాత్రమెత్తి మీటుతో నడిమివ్రేలను షడ్జస్థానమందు కొట్టుటయే. ఈరీతిగానే తక్కిన జంటస్వర స్ఫురితముల బలికించు విధముల నెఱుగవలెను. ఈ స ṡ మొదలైన ఆరోహణక్రమముననుండు జంటస్వర స్ఫురితంబులు వీణయందును గాత్రమందును బలుకునప్పుడు డాసిన క్రిందిస్వరములతో బలుకును. స ని స, రి స రి ఇటులనే తక్కిన జంటస్వరములకు నెఱుగ వలెను. స్ఫురితమను గమకముయొక్క స్థానమందు డోలము అనునొక్క గమకమును వికల్పం బుగా జెప్పుచున్నారు. ఆ డోలమనెడి గమకమునకు పూర్వాచార్యులు ముత్యములో నీరు పారునట్లు పొదలెడి కదలికను లక్ష్యంబుగా నుడివియున్నారు. ఈ డోలమునే ప్రత్యాఘాత మందురు.

ii. ప్రత్యాఘాతము. ∵ అవరోహణ క్రమంబుగావచ్చెడి ఒక్కొక జంటస్వరములలో రెండవస్వరమును వీణయందు కొట్టి వాయించుటయే ప్రత్యాఘాతమనబడును. ఎటులనిన; వీణలో ṡ స అని దిగెడి జంటస్వరమును బలికింపుచో, డాచేతిజుట్టనవ్రేలు మాత్రము మీటుతో షడ్జస్థానమందుంచి క్రిందటి నిషాదస్థానమునకు ఆ జుట్టనవ్రేలు పొరలి దిగునప్పుడే మీటుతో నడిమి

వ్రేలను షడ్జస్థానమునందు కొట్టుతో నుంచవలెను. ఇటుల కొట్టినప్పుడు నిషాదస్థానమునకు బొరలివచ్చిన జుట్టనవ్రేలు నెత్తగూడదు ఈరీతిగానే తక్కిన యవరోహణ క్రమముగావచ్చు నొక్కొక్క జంటస్వరముల వాయించువిధములు నెఱుగవలెను. వీణలో స ని మొదలైన అవ రోహణ క్రమముననుండు జంటస్వరములను వాయించునప్పుడు అంటునటువంటి మీదిస్వరములు అతి సూక్ష్మములై బలుకును. ఉదా: స రి స, ని స ని. ఈరీతిగానే వీణలో తక్కిన జంటస్వర ప్రత్యాఘాతంబుల బలికించువిధము నెఱుగవలెను. ఈ ప్రత్యాఘాతము ఆరోహణక్రమముగా నెక్కిపొయ్యెడి స్వరములకు క్రిందిస్వరములనదుముటకు (నొక్కుటకు) బదులుగా నవరోహణ క్రమమున దిగెడి స్వరములయందు రంజనమునకై కొన్ని కొన్ని విడిస్వరములందు ప్రత్యాఘా తంబును బట్టుట సంప్రదాయముగానున్నది. ఉదా: మ గా, రి మ పా, ధా ప మ, రి గ స. ఇటుల బట్టు ప్రత్యాఘాతము ఆరోహణముగానెగు విడిస్వరములకును బట్టుట వాడుకగానున్నది. ఈ స్ఫురిత ప్రత్యాఘాతముల నొక్కొక్క మీటుతోను వీణలో బలికింపవచ్చును. గాత్రమునకు ఈ ప్రత్యాఘాతము స్ఫురితమేయగును.

(6) తిరుపము. w స్వరముల చేరికయందు ఒక స్వరమును అదిమి (నొక్కి) బట్టుటయే నొక్కు అనబడును. ఉదా: (ని స గా), రి మ పా), (ని స రి గ మ పా), (ని స రి స). (7) ఆహతము. ముందరగాని వెనుకగాని వేగముగా గొట్టి తిరుగడము ఆహతమనబడును. ఇది (i) ముందటి స్వరమున గొట్టి తిరగడము, రవ అనియు (ii) వెనుకటి స్వరమున గొట్టి తిరగడము ఖండింపు అనియు రెండువిధములగును. (i) రవ. ^ పైదైన నొక స్వరస్థానంబుననుండి మీటు తోగాని మీటులేకగాని క్రిందిస్వరమును డాకేటి నడిమివ్రేలిచే వేగముగా తంతిని మీటుట రవ అనబడును. ఉదా: ప మ మ, మ మ గ, రి రి స. (ii) ఖండింపు. ✓ ఒకటి, లేక రెండు, లేక మూడు స్వరములందుండిగాని మీటుతో నొక స్వరస్థానంబుననుండి పైదైన నొక క్రింద స్వరస్థానం బునకు దిగి తోడనే మీటి కొంచెమైన నిలువక నేదైన వేఱొక క్రింది స్వరస్థానమునకు మీటు లేక దిగడమే ఖండింపు. ఉదా: ప మ గ, ప గ రి, ప రి స. (2) A. ఖండింపులో రెండవ భేదము. పై ఖండింపునకు జెప్పినట్లే రెండు, మూడు, లేక నాలుగు స్వరములందుండిగాని మీటుతో నొక స్వరస్థానంబుననుండి పైదైన నొక క్రింది స్వరస్థానంబునకు దిగి తోడనే తంత్రీనాదము తెలియ కుండునట్లడగించి తోడనే మీటుకొని జారుతో వేఱొక క్రింది స్వరమునకు వచ్చుటయే ఖండింపు యొక్క రెండవ భేదము. ఉదా: (ప మ ↘ రీ), (మ గ ↘ రీ), గ ↘ సా). (8) వళి ∩. ఒక

స్వర స్థానముననే వక్రముగ సుడియించి ఒకటి, లేక రెండు, లేక మూడు స్వరముల ఛాయలను రాజేయుట వళి అనబడును. ఉదా: (1) ఒక స్వర ప్రయోగము నిధా' లేక ధా ని ఈ ధైవత స్థానమును ఒక మీటుగా మీటి ఆ మీటుతోనే పైగా నిషాదము పలుకునట్లు తంతిని యీడ్చి ధైవతమునకువచ్చి డాసిన స్వరముయొక్క మీటును వేయవలెను. దీనికి లక్ష్యము పున్నాగవరాళి మొదలైన కీర్తన సంచారులందు జూడుడు. (2) రెండు స్వరముల ప్రయోగము. సా ని ద ని ధా ప, ఈ ధైవత స్థానమున ఒక మీటుగా నొక్కుతో మీటి సుడింపున నిషాదమును అల్పముగా గనిపించుకొని ధైవతస్థానమునకువచ్చి పంచమమును మీటు వేయవలెను. దీనికి లక్ష్యము ఆహిరి మొదలైన రాగముల జూడుడు.

(3) మూడు స్వరముల ప్రయోగము. స్ని / ద ని ధా స ధా ప ఈ దీర్ఘనిషాదములోగల ద ని ధా స వరకు మొదటి ధైవత స్థానమందు ఒక మీటుగా నొక్కుతో మీటి సుడింపందు నిషాదమును గనిపించి ధైవతమునకువచ్చి షడ్జమువరకు నీడ్చిబట్టి ధా ప యందు వేర్వేఱు మీటుగా మీటవలెను. దీనికి లక్ష్యము దరుబారు, అఠాణా మొదలైన రాగముల జూడుడు. ఇటువంటి మూడు స్వరములకు ⌒ ఇట్లు పెద్దవంపును, ఒక స్వర ప్రయోగమునకు ∩ ఇట్లు చిన్నవంపును ఉంచబడియుండుటను గమనింపుడు

III. (9) ఉల్లసితము. ఇది ఒక స్వరమునుండి వేఱొక మీది స్వరమున కెక్కుట ╱ ఎక్కుజారు అనియు, ఒక స్వరమునుండి వేఱొక క్రింది స్వరమునకు దిగుట ╲ దిగుజారు అనియు రెండు విధములు. (i) ఎక్కుజారు ╱ ఒక స్వరమునుండి మీటుతో డాసిన మీది స్వరమునకుగాని, లేక డాసిన రెండు, మూడు లేక యుక్తానుసారముగాగాని మీది స్వరమున కెక్కుట ఎక్కుజారు అనబడును. ఉదా: స ╱ రి, స ╱ గ, స ╱ మ, స ╱ ప, స ╱ స. (ii) దిగుజారు ╲. మీటుతో పైని జెప్పినరీతిగానే మీది స్వరమునుండి క్రింది స్వరమునకు దిగుట దిగుజారు అనబడును. ఉదా: స ╲ ని, స ╲ ధ, స ╲ ప, స ╲ మ, స ╱ స.

(10) హుంపితము. ఒక స్వరమునుండి నాలుగు, ఐదు, ఏడు స్వరములవరకును లేక డాసిన స్థాయివరకును సమయమునకు దగినట్లు హుంకారముతో కాహళవాద్యాకారము వలె క్రింద నుండినాదమును పెంచుకొనియో, లేక పైనుండిక్రిందికి నాదమును తగ్గించుకొనియో పలుకునట్లు సేయుట హుంపితమగును. ఇది జారుభేదమే

(ii) కురుళము. ఇది ఒడగింపు, ఒరయిక అని రెండు విధములు: (1) ఒదిగింపు. X మీది స్వరమును క్రిందిస్వరమున బట్టుట. మీది స్వరమును క్రింది స్వరస్థానమందు వీణలో మీటుతోబట్టుటయును, రాగములకు దగినట్లు ఒకటి, రెండు, మూడుస్వరములవరకు మీటుతో క్రింది స్వరస్థానమున నీడ్చిబట్టి ఆ క్రింది స్వరస్థానమునకు వచ్చుటయును కద్దు ఇది ఆలాపన మందు మెండుగవచ్చును. మూలకె పైనిబోవుట దుర్లక్షణ. ఉదా: (స స రి) దీనిలో షడ్జమును మీటిన వెనుక ఆ స్థానమందే మీటువేసి గాంధారము బలుకునట్లు తంతిని యీడ్చిబట్టి వెనుక ఋషభమును పలికింపవలెను. (రి ⁄ మ ╲ గ రి) ఈ ప్రయోగములోగల ప్రతిస్వరములను ఋషభ స్థానమందే మీటుతో బట్టవలెను. ఇట్లు మీది స్వరమును క్రింది స్వరస్థానమందు బట్టుట వీణకు ముఖ్యమేగాక గాత్రమునకు ఎక్కుజారుచే. (ii) ఒరయిక. ~ దీనినే ఒరిక అనిజెప్పుట వాడుకగానున్నది. మీటుతో నొకస్వరము, లేక రెండు స్వరములు, లేక మూడు స్వరములను డాచేతి అభ్యాసబలమున డాచేతి వ్రేళ్ళచే పలు స్వరస్థానముల నొదిగించిబట్టి దిగుట ఒరయిక అనబడును. ఉదాహరణము: నిస ధని పధ మప గమ నిస

స ని ధ ప మ గరిస, స ని ధ.

(12) త్రిభిన్నము. ఈ గమకము వీణ వాయించు సమయములో రంజనముగలుగు టకై కొన్ని కొన్ని సమయములందు మంద్ర పంచమసారణి తంత్రుల ఏదియైన నొక స్వరస్థానపు మెట్టున ఎడమ, జేతి జుట్టనవ్రేలునుగాని, నడిమివ్రేలునుగాని లేక రెండు వ్రేళ్ళను జేర్చిగాని అదిమిబెట్టుకొని వలచేతి వ్రేలిచే నొకమీటుగాగాని, విడివిడిగా గాని మీటుటయే త్రిభిన్నగమక మని జెప్పుదురు.

(13) ముద్రితము. నోటిని మూసుకొని పాడుటలో గలుగు స్వరముల కదలిక ముద్రితము అగును. ఈ గమకము గాత్రమునకు మాత్రమని జెప్పుదురు.

(14) నామితము. నాదములను తగ్గించి సూక్ష్మధ్వనితో పాడుట, లేక వాయించుట వలన గలుగు స్వరముల కదలిక నామితమనబడుడు.

(15) మిశ్రితము. మీదజెప్పిన గమకములు రెండుమూడు కలిసివచ్చునట్లు నేయుట మిశ్రితమనబడును. ఉదా:

స ╲ నీ ధ స, సి ⁄ గ గ మ, సి రి ⁄ ప మా ⁄ మ పా, ప ధ ⁄ స రి స.

## గమకముల గుఱుతులు

—, కంపితము; ∴, స్ఫురితము; ⁘, ప్రత్యాహతము; w, నొక్కు; ∧, రవ; ✓. ఖండింపు; ⌒, వళి; /, ఎక్కుజారు; \, దిగుజారు; × ఒదిగింపు; ⌣, ఒరయిక.

1. స్థాయి స్వరముల నెఱుగునట్టి గుఱుతుల వివరము - అనుమంద్రస్థాయికి క్రింద రెండు చుక్కలు, మంద్రస్థాయికి క్రింద ఒక చుక్క, తారస్థాయికి మీద ఒక చుక్క, అతితార స్థాయికి మీద రెండు చుక్కలు వేయబడును. మధ్య స్థాయికి చుక్క వేయబడదు. ఎటులనిన:

అనుమంద్రము. మంద్రము. మధ్యము. తారము. అతితారము.

ని । స రి గ మ ప ధ ని । స రి గ మ ప ధ ని । స రి గ మ ప ధ ని । స

శుద్ధ (ప్రకృతి) వికృతి స్వరముల గుఱుతుల వివరణము:

♭ ఈగుఱుతు శుద్ధఋషభ, సాధారణగాంధార, శుద్ధధైవత కైశికీ నిషాదములకును;

♭♭ ఈగుఱుతు శుద్ధగాంధార, శుద్ధ నిషాదములకును;

♮ ఈగుఱుతు పంచశ్రుతి ఋషభ, అంతర గాంధార, శుద్ధ మధ్యమ, పంచశ్రుతి ధైవత, కాకలీ నిషాదములకును;

♯ ఈగుఱుతు షట్ఛ్రుతి ఋషభ ప్రతిమధ్యమ, షట్ఛ్రుతి ధైవతములకును వేయబడును.

తాళకాల ప్రమాణ సంజ్ఞా నియమ బోధక వివరణము:

తాళముయొక్క అక్షరకాల ప్రమాణములు దెలియుటకొఱకై యీపుస్తకమునందు ఉపయోగపఱచియున్న గుఱుతుల వివరము. గుణక ప్రమాణములు. I. ఒక స్వరాక్షరమును హ్రస్వముగా వ్రాసి ఒక అక్షరకాలముగా భావించుకొనవలె దీర్ఘాక్షరముగా వ్రాయునపుడు రెండక్షర కాలమగును. దీని కధికముగావచ్చు గుణక ప్రమాణములకు ఈ ⌒ గొలుసు గుఱుతుల చేత పైజెప్పిన హ్రస్వ దీర్ఘాక్షర ప్రమాణములను క్రమముగా పెంచుకొనిపోవలెను.

ఎటులనిన: (1) స = 1 (2) సా = 2 (3) సా ⌒ స = 3, (4) సా ⌒ సా = 4,

---

1, 2, సరే, 3 లో సా ⌒ స = 3 అనియున్నది. గొలుసు లేకపోయినను అది మూడక్షర కాలమే అలాగే 4 లో సా ⌒ సా = 4 అనియున్నది ⌒ గొలుసులేకున్నను అవి నాలుగక్షరముల కాలమే. ఇట్లు 5, 6, 7, 8 అక్షరాల కాలము వరకును చూపబడినది. ఇచట ఆగొలుసులను వదలివేయడమైనది. ఒక అక్షరకాలమునకు , ఇలాటి కామా (Comma) యను గుఱుతును, రెండక్షర కాలమునకు ; ఇలాటి సెమికోలను (Semicolon) అను గుఱుతును వాడబడును

II. ఒక స్వరాక్షరముక్రింద ఒక గీతవేసితే కాలప్రమాణములో సగమగును. రెండు రెండుగీతలువేసితే పాతికయగును. మూడు గీతలువేసితే పరకయగును, నాలుగు గీతలువేసితే వీసమగును. దీర్ఘస్వరముక్రింద ఒక గీతవేసితే ఒక హ్రస్వమగును. తక్కిన ప్రమాణములను ఇటులనే యెంచి దెలిసికొనవలెను.

స = 1 (ఒక అక్షరకాలము), స = ½ అఱ అక్షరకాలము, స = ¼ పాతిక అక్షర కాలము, స = ⅛ పరక అక్షర కాలము, స = 1/16 వీసము అక్షరకాలము.

ఒక అక్షర కాలములోనే స్వరములయొక్క భిన్నప్రమాణంబులు పలువిధంబులై వచ్చెడి మార్గంబుల వివరంబులు ఎటులనిన:

I. స = సా, స స, స స స స, స స స స స స స స, సా సా, సా సా సా సా

స = సా స స, స సా స, స స సా, స స సా సా సా, స స సా స స సా;

స = స స సా సా, స స స స సా సా సా సా; సా, స, స సా,

ఇటులనుండు భిన్నకాలప్రమాణంబులో గీతలు అధికంబుగానుండుటవల్ల చూచుటకును కాలప్రమాణంబు తెలుగుటకును ప్రయాసముగానుండును గనుక గీతలనుతగ్గించి మొదటికాలమునకు సా అనియు, రెండవకాలమునకు స స అనియు, మూడవ కాలమునకు ఒక గీతతో స స స స అనియు, నాలుగవ కాలమునకు రెండుగీతలతో స స స స స స స స అనియు ఏర్పాఱచబడినది. గీతల వివరణము సేయబడిన కాలప్రమాణములను గలసిన స్వరముల లక్ష్యములను క్రింద జూడుడు.

నాలుగు కాలములకు పై కాలముల బెంచుకొనిబోవుటకు అధికమగు కాలమొక్కొక టికి ఒక్కొక గీత అధికముగా వేసుకొనవలెను.

II- సా = స స, స స స స, స స స స స స స స;

సా = సా సా, సా సా సా సా, సా సా సా సా సా సా సా సా;

సా = స స, సా స స, స సా స, స స సా, సా, స, స సా, ;

సా = సససస సాసా, సా, సససస, సస సా సా ;

సా = సస సససస, సా సస సస, సా సససస,

పెద్ద స్వరాక్షరంబుల నడుమవచ్చెడి చిఱు స్వరాక్షరములు కాలప్రమాణముతో జేరవు.

|| ఇట్లుండు రెండు గీటులును, ఆయా తాళావర్తముల కడపట నుండును.

| ఇటులనుండు నొక్కొక్క గీటు ఆయా తాళావర్తములలోపలనుండు అవ యవము లొక్కొక్కటికిని వేయబడును.

, ఈ కామ ఒక అక్షరము విడిచి యెత్తుచోట్లను,

; శమికోలన్ రెండక్షరములు అనగా (అర ఎడము) త్రోసి యెత్తుచోట్లను గుఱుతుగా వేయబడును.

ఈ ఎడుపు కాలప్రమాణములను సందర్భానుసారముగా జూచి యెత్తుకొనవలెను.

# సంగీత సంప్రదాయ ప్రదర్శిని

## చక్రము 1 : మేళము 1

రగమపధన ]　　　రాగాంగ రాగము 1 : కనకాంబరి　　　[ ఇందు. పా. చక్రము

### లక్షణ శ్లోకము

వెంకటమఖి :- కనకాంబరి రాగఃస్యాదారోహే గనివర్జితః
నివక్ర స్సర్వ కాలేషు గీయతే గాయకోత్తమైః.

మూర్ఛన :- { ఆరోహణము : సా ♭ రి మ ప ♭ ధ సా
అవరోహణము : సా ♭♭ నీ ♭ ధ ప మ ♭♭ గా ♭ రి రి స్సా } అసావేరి జాతి

### లక్షణ వివరణము — సుబ్బరామ దీక్షితులు

రాగాంగము ; సంపూర్ణము ; షడ్జగ్రహము ; ఆరోహణమందు గాంధార నిషాద వర్జ్యము.

*గమనిక* : పూర్వాచార్యులు మొదటి చక్రమందుగల రాగములకు 'రిగమ' ప్రయోగము లేకనే 'రిమ' ప్రయోగముతో మూర్ఛనలను గల్పించియుండుట, రంజనకును, గాత్రమందు సులభముగాఁ బట్టుటకునుగానని యెంచవలెను. స ↘ నీ ధ, మ గా రి, వీనియందు గల దీర్ఘ నిషాద గాంధారములను జారుతోఁ బట్టవలెను.

నిషాదవక్రము, ఎటులనిన ;- స ప ని ధ ప, స ధ ని ధ ప.

అసావేరి జాతి, ఎటులనిన; — మ ↘ గా రి స, రి మ ప ధ ప మ ↘ గ గా రి స, స ప ధ ప ↗ ని ధ ప మ ↘ గా గ రి స, ఎల్లప్పుడును పాడఁదగును.

## లక్ష్యము, గీతము - త్రిపుట తాళము - వెంకటమఖి.

త్రుధువము :— ధ ప | ప మ గ గ గ రి రి | సా స స రి గ గ
అ రె | ర అ అ గ అ . ం | గా దు స పు త తి

రి స స ధా ధా | పా మ గా రి రి |
మ న మే ళా | ప మ్మ అ . ణ |

అంతరి :— సా స మ రి మ ధ | ధ ప మ ప ధ రి రి | సా,
ధా మ బో ఒ ల్ల తి | న ం ద న ం ద ను | రే,

జావడ :— రి మ ప ధ | పా మ గా రి రి | సా స ధా ధా |
య ము న అ | తీ ర లో ఒ ల | కౌ స్తు భా లం |

పా మ ప ధ ప ని | ధా ప ప మ మ గ | రి రి స రి మ ప మ |
కా ర క అం చ న | చే ల కృ ప అ అ | ప అం గ ఇ శ అ అ |

ప ధ ప మ ప ధ ధ | సా స రి మ ప ధ | పా మ ప ధ సా |
ధ అ ర గో ఒ పి ఇ | జా ర ర అ గ అ | అం గ క న కాం |

ధ ధ ప మ ప ప ని | ధా ప మ గ గా | రి స స ప ధ ప ని |
బ రి ఇ ర ఆ . అ | ఆ గ ఇ ం దూ | ప అ అ చ అ క్ర ం |

ధా ప మ గ రి రి | సా, మ రి మ ధ | ధ ప మ ప ధ రి రి |
నా గ రు ఉ రె ఎ | యా, బో ఒ ల్ల తి | న ం ద న ం ద ను |

సా, సా; ||
రే రే ||

## తానము — వెంకటమఖి

1. స స సా స | స స ని ని ధ | ప స ని ధ | ప ని ధ ధ ప | ని ధ ప ధ ప |
మ మ ప మ ప . | . గ రి రి గ రి | స గ రి రి స | రి రి | స రి మ మ ప |
ప మ గ రి | మ మ ప | మ ప | ధ ధ ప ని ధ | ప ని ధ ప ధ | ప ధ

ఫ మ గ రి | ఫ మ గ రి | గ రి రి గ రి | స గ రి రి | సా | రి మ ఫ ధ సా |
స నీ ధ ఫ మ | గా రి రి స | రీ సా | రి మ ఫ ధ ధ ఫ మ | ఫ ని ధ ధ |
ఫ ధ ఫ మ | ఫ ధ ఫ ని ధా | ఫ ని ధ ఫ ధా | ఫ ధ ఫ మ ఫా | మ ఫ ధ ధ
సా | ధ ఫ సా | ధ ఫ రీ | స గ రి స రీ | స రి మ మ పా | ప మ | గ రి ప మ
గ రి | ధ ప ప ధ ప మ పా | ప మ గ రి రి గ రీ | స గ రి స రీ గ రి | రి గ రి రి స గ
రి స | రి స స స నీ ధ ఫ | గ రి స రి స మ గ రి | స గ రి స | రీ స సా, సా సా |

2. స స రి స రి | స స ని ని ధ | ఫ ని ధ ఫ ధ | ఫ మ ఫ | మ మ ఫ మ ఫ ని ధ |
ఫ మ ఫ ని ధ ఫ ధ ఫ మ | ఫ ధ ఫ మ ఫ గ రి | మ మ ప ధ ఫ ని ధ | ఫ స ని
ధ ఫ | గ రి | స మ గ రి స | ప మ గ గ రి | స గ రి రి స | స స రి స రి | స స
ని ధ | ఫ ని ధ ఫ ధ | ఫ ధ ఫ మ ఫ | మ మ ఫ మ ఫ | గ రి రి గ రి |
స గ రి రి స | రి రి మ మ ప | మ ప ధ ప ధ | ప మ ప ధ స | ధ ప గ రి స | మ మ
ప మ ప | ని ధ ధ ప మ | ప మ గ గ రి | స మ గ గ రి | స గ రి రి స రీ స సా, సా;

## కీర్తనము — తిస్రజాతి - ఏకతాళము — ముద్దుస్వామి దీక్షితులు

పల్లవి: స రి మా ప మ | గా రీ సా | ని ధ ఫ ధ సా ॥
క న కాం బ రి | కా రు ణ్యా | మృ త ల హ రీ ॥
రీ మా పా | దా/ని ధ పా/ధ మ | \గా రి స రి గ రి రీ ॥
కా మా క్షీ | మా మ వ కా | మే శ్వ రీ . . ఈ ॥ కన.

అనుపల్లవి:
ప ధ ని ధ పా | మ\గా గ రి రి స | రీ ప మ పా ॥
ది న క ర చం | ద్ర తే జ ః ప్ర | కా శ క రీ ॥
మా ప ధ సా | , రి గ రి సా | ని ధ పా ధ ప మా గ రి ॥
దే వి మ హా | త్రి పు ర సుం | ద రి శం ం . . క రి ॥ కన.

చరణము: సా రి ప మ | , మ పా ధ మ | \గా గ రి రి స రీ ॥
త్రై లోక్య మో | హ నా ది చ | క్రే ఏ శ్వ రీ ॥

సా రిగరిస | ,\న్థ్ ధ ఫ ధ | స రీ మ మా ॥
త్రైపదపర | . బ్రహ్మా మహి | షిఖా స్వరీ ॥
పా ధా/నిని | ధ పా ధా స | రీ/గ రి రీ ॥
సా లో కా | దిము క్తి ప్ర | దా న క రీ ॥
స\నీ ధ ప ధ | పా ధ ప మ\గ | , రి/గ రి సా ॥
స దా శి వ క | రీగురుగుహో | ద య క రీ ॥

సా న్థీ ధ ఫ ధా సా రీ | మమపపధపధా సా స స | స స\నీ ధా పా ధ ధ సా |
మూ లా ది న వా ధా రే | శ్వరి సు భ క రి నీ లా ళ క | ధ రి ని త్యా నం ద క రీ |
రీ సా\నీ ధా పా మా | ప ప మ గ రి స రీ మా ప ధ | సా ని ధ పా ధ ప మా గ రి ॥
లీ లా వి శ్వో త్ప త్తి | స్థితి ల య క రి బా లా ప ర | మే శ్వ రి పం చ ద శా క్ష రి ॥

కనక.

## సంచారి _ మఠ్య తాళము — సుబ్బరామ దీక్షితులు

స రి మా గ గ రి రి సా । రి మ పా ధ / ని ధ ధ పా । మ \ గా రి సా ని ధ ఫ ధ ।
సా రి మ ప ధ ప మ గ రి । స ప \ గా \ గా రి రి సా । నీ ధ ఫ ధ స రి మ గ రి ।
గ రి మ ప / ధా / ని ధ పా । ని ధ పా \ మా \ గా రీ ।
ప \ మా \ గా రి స రి సా । ని ధ ఫ / ని ధా ఫ ధ సా ।
ధ. స రి మ గ గ రి రి సా । ధ స రి మ ప ధ ప / ని ధా ।
ప ధ ప / ని ధ ధ ప / ధ ప మ । ధ ప మ గ రి ప ప మ గ రి । గ రి రి గ స / గ రి రి సా ।
స / ధ ప మ ప / ని ధ ధ ప మ । ప / ని ధ ప ధ ప మ ప ధ ప । / ని ధ ప / ని ధా ప ధ
ప మ । ప ధ ని ధ ధ ప / ని ధ ప మ । ప ధ ప మ పా ప మ గ రి । స / గ రి స రి / గ స
రి / గ రి । రి గ రి రి స / గ రి స రి రి । స రి మ మ పా మ గ రి స । పా మ ప
ధ ప / ని ధా ప । ధ ప ప మ / ధ ప మ \ గా రి । ప \ మా గ రి మ ప ధ ప మ । ప /
ని ధ ప ధ ప మ ప ధ ప । మ మ ప స రి మ గ రి మ ప । ధ ధ ప ధ స రి \ మ మ \ ప ప ।

గ రి మ ప ధ ధ వ మ పా । ప మ గ రి రి ↘ గ గ రి సా । రి రి స రి మ ప ప మ ప ధ ।
ప ధ ప ధ ↗ ని ధ ప ప ధ ధ । ప ధ ప ↗ సి ధ ప ↗ ని ధ ప ధ । ప మ ప ధ ప స ని ధ ప ధ ।
ప స ↗ నీ ధ ప మ ప ధ ధ । ప ↗ ని ధా ప ధ ప ని ధా | ప ధ ప మ పా ↗ ధ ధ పా |
మా ↘ గా రి రి సా సా | రీ మా ప ధ ప ↗ సి ధా | పా ↗ ని ధ ప మ ప ధ సా | ధా ని
ధ ప ↗ ని ధ ధ సా | ధా ధా ప మ ప ధ సా | రి రి గ రి రి ↗ గ రి రి సా | స రి మ
↗ గా రి స రి సా | మ గ రి స ధ ప రి గ గ రి | సా ధ ధ ప మ ప ↗ ని ధా | ప ధ
ప మ ↘ గా గ రి సా | ధా ప మ గ గ రి రి సా | మ మ రి మ ధ ధ ప మ ప ధ |
ప ధ ↗ రి రి సా రి ↗ గ రి స | స ప ధ ప ↗ ని ధా ప మ గ | రి రి సా రి మ ప
ధ సా | ↘ నీ ధ ప మ ↘ గా రి సా | రి ↗ గ గ రి స రి సా ; ||

ర గ మ ప ధ న ]　　మేళము 1 : కనకాంబరి.　　[ ఇందు. పా. చక్రము.

## జన్యము (ఉపాంగము) 1 : ముఖారి. *

### లక్షణ శ్లోకము.

వెంకటమఖి :— శుద్ధస్వర ముఖారిస్తు ఆరోహేగని వర్జితః,
సంపూర్ణ స్సగ్రహోపేత స్సర్వకాలేషు గీయతే.

మూర్ఛన :— { ఆరోహణము : స ♭ రి మ ప ♭ ధ సా.
అవరోహణము : స ♭♭ ని ♭ ధ ప మ ♭♭ గ ♭ రి స,

### లక్షణ వివరణము — సుబ్బరామ దీక్షితులు

ఉపాంగము ; సంపూర్ణము ; షడ్జగ్రహము ; ఆరోహణమందు గాంధార నిషాద వర్జ్యము ; ఎల్లప్పుడును పాడఁదగును.

*గమనిక:* ఈ ముఖారి రాగమును డెబ్బదిరెండు మేళములుగా నేర్పరచిన వెంకటమఖియే చతుర్దండి ప్రకాశికలో మేళ ప్రకరణమందు పూర్వికమైన ప్రసిద్ధ మేళములు పంతొమ్మిదియనియు వానియందు, ముఖారి రాగమును శుద్ధస్వరములతోఁ జేరిన మొదటి మేళమనియుఁ జెప్పియున్నారు. స్వరమేళ కళానిధిలో పూర్వికమేళము లిరువది యని రచించిన రామామాత్యులున్ను ఈ ముఖారి రాగమును మొదటి మేళముగానే వచించియున్నారు. దీనికి నిదర్శనము ఈ ముఖారిరాగ గీతమే.

* ఈ ముఖారి రాగమును శుద్ధముఖారియని చెప్పుట వాడుకగా యున్నది.

## లక్ష్యగీతము — ధ్రువతాళము — వెంకటమఖి

ధ్రువము ;— గ రి రీ సా ని ధ సా రి మ గ రి | మ పా నీ ధ ప ధ ప మ ప మ గ రి స |
గ అ అ న ప్రి య అ ము ని జ న | మ నో గ మ న హ ం స రె ఎ రె ఎ |

గ రి మ-గరి స రి ప పా మ గ రి స | రీ స ని ధ ప ధా ప ధ ప మ పా |
న ట అ మ ం ం డ ల రా అ అ అ వు | భూ యొ ఒ ఒ ఒ పా ప ని ర్థు తా |

ని ధ ప ధ స స గ రి ప ప మ గ రి స | రీ స ని ధ ప మ ని ధ ప మ గ రి స |
ఛ అ య అ ధ న నె ఎ ఎ త్ర సిం ం హా | ధా టి ఇ ఇ ఇ ని ఇ ఇ ల క ం ం ఠ |

అంతరి : పా; పా ని ధ సా రి మ గ రి | గ రి స గ రి స ని ని ధ ధ సా ; |
శు. ద్ధ స్వ ర ప్ర మ్మ అ . ణ | స ం ఖ్యా నా . మ స అ గ తి రే |

జావడ : ధ స రి మ రి మ పా మ ప మ గ రి స | గ రి స గ రి స ని ని ధ ధ సా ; |
బుధ ను త చ ర ణా భ వ త అ ర ణ | భు వ న భ ర ణ న అ య కు రే ; |

గా రీ సా రి రి స ని ధ ధ ప మ | ప ధ స ని ధ మ ప ధ మ ప మ గ రి స |
అ, ఆ రె గి రి జ అ స అ య క | అ ం గ జ అ త భ ం ం గ చ ం ం గ |

స రి స ప పా మ గ రి మ ప ని ధ ప | ని ని ధ సా స రి మ ప నీ ధ ధ ప మ |
మద త్రిపు రా సు ర హా ర క్ర తు హా ర | ర అ అ గాంగ ము ఖ అ రి ర అ అ గ

ప ధ ప స సా ని ధ ప మ ప ని ధ ప | పా మ గ రి స ని ధ ప ప మ గ రి స |
ఉ ప అం గా శు ఉ ద్ధ స వె ఎ ఎ రి | సా గ రు ఉ రె మ అ తృ ళు తె ఎ ఎ ళ |

పా; పా ని ధ సా రి మ గ రి | గ రి స గ రి స ని ని ధ ధ సా; ||
శు ద్ధ స్వ ర ప్ర మ్మ అ అ ణ | సం ఖ్యా న అ మ స అ గ రి రే ||

## సంచారి - రూపకతాళము - సుబ్బరామదీక్షితులు

గ రి రి స ని ని ధ ధ పా సా | రి మ గ రి మ మ / పా మ గ రి సా |

రి మ పా ని ధ ప ధ ప మ ప మ | గ రి స గ రి మ గ రి స ని ని ధ |

/ సా గా రి మ పా మ గ రి సా | ధ స రి మ రి మ పా / ధ ప మ ప |

/ ని ధ ధ ప మ ప ప మ గా రి స | రి స ని ధ ప ధా ని ధ సా |

ని ధ స స గ రి ప ప మ గ రి స | రి రి మ మ ప ప రి మ ప ధ ప ప |

మ / ని ధ ప మ / ధ ప ప మ గ రి స | ధ సా రి మ గ రి / గ రి స / గ రి |

స రి / ప పా మ గ రి స రి స | / ని ధ ప ధా ప ధ ప ప మా ప |

\ ని ధ ప ధ ప మ గ రి స గ రి స | ప \ మా గ రి మ మ గ రి సా |

గ రి మ గ రి స రి మ పా పా | రి మ ప మ / ని ధా ప మ గ రి |

స రి మా గ రి స రి గ రి సా | రి మ మా రి మ ప ధ ప మ పా |

రి మ పా మ ప మ గ రి రి | / ప పా మ గ రి మ మా గ రి స |

పా మ గ రి స ని ధ ధ సా | ప ధ స రి మ ప ని ధ పా మా |

ధ ధ పా మ ప మా గ రి మా | మ ప మ మ ప మ గ రి స స రి రి |

స రి మ ప మ గ రి మ ప ప ధ ప | మ ప ని ధ ప ధ మ ప ధ ధ ప ప |

ప ప మ గ రి స రి మ ప ని ధ ధ | మ ప ధ స స ని ధ ధ ప ధ ప మ |

ప ధ స ప ని ధ ధ ప మ గ రి రి | స రి మ ప ని ధ ప మ గ రి మ ప |
/ ని ని ధ ప ధ స రి రి గ రి స రి | స రి మ గ రి స ని ని ధ ధ రి స |
ని ధ ధ ప ప మ మ గ గ రి రి స | ని ధ స రి మ ప \ రి మ ప ధ ప |
మ ప ధ ప ద స రి మ ప ని ధ స | ధ స రి మాగ రి స ని ధ ప ధ |
స సా ని ధ మ పా మ గ రి స | రి మ ప ధ ని ధ ప ధ పా \ మా |
ప / ని ధ ధ ప ధ సా ని ధ ప మ | గ రి సా రి మ గ రి సా; ||

రగమపధన] మేళము 1 : కనకాంబరి. [ఇందు. పా. చక్రము

## జన్యము (ఉపాంగము) 2 : శుద్ధసావేరి.

### లక్షణ శ్లోకము

వెంకటమఖి :— శుద్ధసావేరికారాగః పంచమ గ్రహసంయుతః
నిగలోపా ద్దౌడవోయం సాయంకాలే ప్రగీయతే.

మూర్ఛన :— { ఆరోహణము ; సా ♭ రి మ ప ♭ ధ సా
అవరోహణము : సా ♭ ధా ధ ప ప మ ♭ రి సా.

### లక్షణవివరణము — సుబ్బరామ దీక్షితులు

ఉపాంగము ; ఔడవము ; పంచమ గ్రహము ; గాంధార నిషాదవర్జ్యము ; రక్తిరాగము ; సాయంకాలమున పాడదగును.

*గమనిక :* ప్రాచీన సంప్రదాయజ్ఞులలో శ్రేష్ఠతములును, పూర్వాచార్యులలో నొకరును, మొట్ట మొదట సకల జనులు నభ్యసించునట్టి పిళ్ళారి గీతమును రచించిన మహానుభావులుగా

నుండిన పురందరవిఠల దాసులవారు పై జెప్పిన పిళ్ళారి గీతములలో ననుబంధముగాఁ జేర్చియున్న శుద్ధసావేరి గీతమును, వెంకటమఖి జెప్పిన లక్షణపద్ధతిగానే, శుద్ధఋషభ ధైవతములతో నభ్యసించి పాడుకొని వచ్చుచున్నారు. గాంధార నిషాద వర్జ్యమును పంచశ్రుతి ఋషభధైవతములును కలిసియున్న రాగము దేవక్రియయే గాక శుద్ధసావేరి కానేరదు ; అటులుండంగ నీ శుద్ధసావేరి రాగమును పంచశ్రుతి ఋషభధైవతములతో పాడుట నవీనుల వాడుకగా నున్నది.

✱ ఈ శుద్ధసావేరి గీతములోగల గ్రహస్వర రచనల గమనింపవలెను.

### లక్ష్యగీతము - ధ్రువరూపకతాళము - వెంకటమఖి.

ధ్రువము :- ధ ధ పా ప మ మ రి సా | ధ ధ సా సా | ధ ధా ధ సా | ధ ధ సా సా |
ధ వ ళ గ్గ జ ఆ అ రో | హా ణు రే రె | క్క చి త్త శి | ష్ఠు ణుచంద్రా |
రీ రి రి సా | రి మ మా ; | సా ధ ధ పా | ధ ధ పా ప మ | రి స
ని త్య హా రి | శ్చ ం ద్రా | ని స్తం ద్రా | గు ణ సం ము ఉ | ం ద్రు

జావడ : ధ స రి మ మా మా రి మ | ప ధ స స మా | రీ మా మా |
ని జ భు జ దం డ ద్దం | డి త చం డ | ప్ర త్య ర్థి |
రి స రీ ; | రీ ప మ రి స | సా రి రి స ధ | సా ధా పా |
ఖ ం డా | తం డో ఒ ఒ ప | తం డ వె ఎ ఎ | దం డ అ |
ప మ ప ధ ప మ | మ రి మా రి రి | సా సా స స | రి రి మ్మా ప ప |
మ్మం డ లె అ ర | ణం ం ం ం | అ త్య ద్భు త | ర చ న ద్భు త
ధా సా స స | రీ మా పా |
స మ్మ ద్ధ త | సా మం తా |

సా ; , స | ధ స రి మ రి స | రి స ధ ఫ ప మ | రి స ||
పా ప | గ ప ధ స ధ ప | ధ ప గ రి రి స | ధ ప ||
ధ ధ పా ప మ మ రీ సా | ధ ధ సా సా ||
ధ ప ళ గ్గ ఱ అ అ రో | హా ణు రే రే ||

## సంచారి — త్రిపుటతాళము — సుబ్బరామదీక్షితులు

ప మ ప ధ స సా | ధ స స రి రి సా | ధ స స ధా పా | ధ ధ ప ప మ రీ | ప మ రి మ రి
సా | రి స ధ సా సా | ⁄ ధా ప ధా ప ప | మ ప ధ ధ ధ ప ప | మ ప ధ ప ప మ ప,
| రి పా ప మ మ ప | ధ పా ప మ రి స | ⁄ ధా ధ సా ధ రి | సా స రి రి
సా | ధ స రి మా మా | రి మ ప ధ ప ప మ | ∖ రీ ⁄ మ మా రి స | రీ స
⁄ రి రీ | సా రి ప మ రి స | ధా ఫ ధా స రి | స రి రి సా ధ స | ⁄ ధా ప మ
ప ధ ప | ప మ రి మా రి రి | స రి స రి ప మ ప | స రి స ⁄ ధ ధ మ ప | మ రి
మ ∖ రీ మా | పా ప మ రి సా | ప ధ ప ప మ ప మ | రి మ మ రి మ ప మ |
∖ రీ మ రి మ ప ధ | పా ధ ప ప ధ ధ | పా ధ ప మ రి స | సా ధ ప ప ధ ధ |
ప ప ధ మ ప ధ ధ | మ ప ధ పా ధ ధ | మ ప ధ ధ స ధ ధ | స ధ ప ప మ రి స |
రి మ రి ⁄ ప మ ⁄ ధ ప | ధ స రి ⁄ ప మ ధ ప | మ ప ధ సా సా | మ ప ధ స
రి సా | ప ధ స రి మ ∖ రీ | ధ స రి మ రి సా | ధ స రి ధ ధ పా | ప మ రి
ప రి సా | ధా స ధ స ధ స | ధ స రి మ రి స ధ | మ మ రి స రి స ధ | ⁄ రి
స ధ స ధ ప ధ | ప మ రి మ మ రి స | ధా స రి మ ప ధ | సా రి మ మ రి స |

సరిమరిసరిమ | సరిమరిసధస | ధధధసధధప | పధసధధ
ధప | పమరిధధధప | పమరిధాపా | పమరిసారి | పమరిధాధా |
పమపధాపా | పమపమారి | మరిసధపమరి | సధపమరిసధ |
ధధసరిమరిరి | సా ; ; . ||

మొదటి మేళము సంపూర్ణము.

ర గ మ ప ధ ని ]　　చక్రము 1 : మేళము 2　　[ ఇందు. శ్రీ. చక్రము.

## రాగాంగరాగము ఫేనద్యుతి.

### లక్షణశ్లోకము

వెంకటమఖి : రాగః ఫేనద్యుతిష్షడ్జ గ్రహారోహే గవర్జితః
నివక్రస్సర్వకాలేషు గీయతే లక్ష్యకోవిదైః.

మూర్ఛన :— { ఆరోహణము : స ♭ రి మ ప ♭ ధ ధ ప ♭ ని ని సా,
అవరోహణము : స ♭ ని ధ ధ ప మ ♭♭ గ గ ♭ రి స. }

### లక్షణవివరణము - సుబ్బరామదీక్షితులు

రాగాంగము; సంపూర్ణము; షడ్జగ్రహము; ఆరోహణమందు గాంధారవర్జ్యము; ధైవత వక్రము; ఎల్లప్పుడును పాడఁదగును.

*గమనిక :* మిక్కిలి రంజనను కలిగించునట్టి స్వరసందర్భ సంచారములు గల నీ ఫేనద్యుతి గీతమును విరచించిన వెంకటమఖియొక్క సమర్థతను గొనియాడుటకు నావంటి వాగ్గేయ కారకులు అనర్హులేయని యెంచదగినదిగా నున్నది.

## లక్ష్యగీతము - మత్య్యతాళము - వెంకటమఖి

ధ్రువము : స స ని ని సా ధ ధ ప మ | గ గ రి రి సా సా ప మ | మా ప గ రి స రీ ప మ |
ర అ జ అ వ త్తం ం స | గ ర క ం ఠ శ్శం క ర | మ త్స ర హ ర ము క్తి ద |
మ మ పా పా ; ; | స స పా ధ ప ని ని సా | ధ ధ ప ని ని స ప ధ ప మ |
ప ద రే రే . . | ధ వ ళా ం గ చ ం గా | ని ఖి ల అ సు ర ఖ ం డ న |
పా ప ధ ప మ పా ప మ | పా నీ సా స ని ని స | ప ధ ప స ని ధ ప మ గ రి |
ఖ ండ ప ర శు మం డి త | దో ర్దం డ కు ం డ లి | కు ం డ ల శో ఒ భి తు రె ఎ |

అంతరి : సా; పా ని ని స స | పా ధ ప మ ప స ని ని స | స మ గా రి రి సా ; |
ఆ రె పు ర హ రు | రె పా అ వ న కి ఇ రి తి | ము ఉ ఊ రి తి రే |

జావడ : ధ ధ ప స ని స ప గ రి గ | స రి రి స నీ సా రీ | ధ ప ధ మ మ ప గ
తు ఝు స మ అ ను కో ఒ ఒ ణు | రె ఎ రె ఎ యా ఆ రే | తి య ఇ య ఇ య ఇ
రి స రి | సా రి గ స రి స ని ని స | ధ ధ ప ని ని స ప ధ ప మ |
య ఇ య | ఆ ఇ య ఇ య ఇ య ఇ య | అ ఇ య ఇ ఇ య అ ఇ య ఇ |
గ గ రి గ గ స స ని స స | గ గ రి గ గ స రి మ మ ప | పా ధ ధ మ
అ అ అ అ అ అ ఆ అ అ అ | ర అ అ గ అ అ అ అ అం గ | ఫే న అ ద్యు
ప మా : | ని స సా ప ధ ప మ గ రి | రీ సా ని ని సా ; |
తి రా | అ అ గ న్న అ గ రు ఇ య | రే యా అ అ రే |
ధ ధ ప స ని ధ ప మ గ రి ॥ సా ; పా ని ని స స | పా ధ ప మ ప స ని
ఇం దు శ్రి చ అ క్ర అ ధి ప ॥ ఆ రె పు ర హ రు | రే పా వ న కి ఇ
ని స | స మ గా రి రి సా ; ॥
రి తి | ము ఉ ఊ రు తి రే ॥

## తానము - వెంకటమఖి

1 ఘు ఘు ఫా ఫ | ఘు ఫ ధ ధ ఫ ఫ ఘు | ఫ ని ని స ని ని | ఫ స ని ని స |

ని ని స ని స | గ రి స గ రి స గ రి రి | స రి స రి | ప స ప ని | ధ ధ ప ని ధ |
ప ని ధ ధ | ప ధ ప ధ | ప ని ధ ధ | ప ధ ప మ | ప స ని ని స | మ మ
ప మ ప | గ రి | స వ మ ప | స స రి స రి | స స స | రి స గ రి | స మ గ రి
| ప ధ ప ని స | మ మ ప మ ప | గ గ రి | స మ గ గ రి | స గ రి రి స
రీ సా | రి రి మ మ ప | మ మ గ గ రి | మ మ ప మ ప | గ గ రి మ ప |
మ మ ప | ధ ధ ప ని ధ ధ | ప స ని ని స | ని ని స ని స | గ రి స గ రి |
స రి మ మ ప | మ మ ప మ ధ ప మ ప | మ మ ప మ ప | ప మ గ గ రి | ధ ధ ప
స | ని ధ ప మ | గ రి సా | రి మ ప ధ ప | ని ని స గ రి | స మ గ గ రి |
స గ రి రి స | గ రి స రి స | ని ని స | ని ని నీ, | సా ; ||

2 స స ని ని ప | ని ని స | ధ ధ ప | ని ని స | ధ ధ ప స | ధ ధ ప ని | ధ
ధ ప ధ ప మ | ప స ని ని స | మ మ ప మ ప | గ రి రి గ రి | స గ రి రి స |
స స స గ రి | ధ ధ ప స ని | ప ధ ప ని ధ | ప మ ప గ రి | మ మ ప మ ప
| రి రి గ రి గ రి రి | స గ రి రి గ | రి రి సా || స రి మ ప ధ ధ ప ని |
ని స ని ని | స ని ధ ధ ప మ | గ గ రి స || రి రి సా మ మ ప | మ మ గ గ
రి | మ మ ప మ ప | ధ ధ ప ని ధ | ప ధ ప మ | ప స ని ని స | మ మ ప
మ ప | గ రి రి రి స | స స రి స రి | స స ని ని స ని ని | ప స ని | ని స ని ని
ధ ధ ప | ని ధ ధ ప | గ రి స | మ గ గ రి | స ప మ మ ప | స స రి స రి |
స స స ధ ప | ని ధ ప ధ ప | మ ప మ మ ప | మ మ గ గ రి | స గ రి రి స
| రి మ ప ధ ప | ని ని స గ రి | స మ గా , రి రి | స గ రి రి స | రి స |
ని ని స ని స | ని ని నీ , | సా ; ||

## కీర్తనము - ఆదితాళము - ముద్దుస్వామిదీక్షితులు

పల్లవి : రి మ ప ధ పా , ధ | మా గ గ | రి రి సా ||
శ్రీ ద , ఊ ణా | మూ ర్తి మీ | . . శం ||

ఫ ధ ఫ ని సి సా | మ ∖ గా రి | రీ సా ||
చి . త్ప కా . శం | ప్ర ణా | మి . ||

అనుపల్లవి :

మ పా, మ ప ధ ప ని ని । ని సా, ప । , ప ⁄ ధ ధ ||
వే దా ం త వే । ద్యం న్య । గ్రో ధ ||
. మా ప ∖ మా గ రి గ । రి సా స । ని ని సా ||
వృక్ష మూ లవా । సి నం వ । అల్ల కి ||
పా, ⁄ ధా ప ని ని సా ధ ప ని ని సా । మా గ గ రి స సా । ని ధ ప మా ∖ గ రి స ।
నా దా ను భ వ మోద మమృత ఫే । న ద్యుతి మం ద । స్మిత ముఖాంబుజం || శ్రీ

చరణము :

ని ని సా ⁄ ధ పా ధ ⁄ । మా. ⁄ ప మ గ । రి రి సా ॥ రి గ గ రి ని పా రి ।
జ న నా ది ఖే ద । ఖం జ న । చ తు రం॥ జ గ దిం ద్ర జా ల ।
స మా ∖ గ । రి రి సా ॥ ప ధ ప ⁄ నీ స ని స । రి సా రి । ⁄ గ స రీ ॥
చ మ త్కృ । తి క రం ॥ ముని జ నా ది ని ఖ । ల సం శ । య హారం ॥
సా ని స ∖ పా , ధ పా । ధ ప మ ∖ గ । , రి సా ॥
ము ద్రా క రం । గు రు గు హా । క రం ॥
ఫ ⁄ ధా ఫ నీ సా రి మా పా ⁄ ధ మా । పా , ధా ప నీ । ని సా రీ ⁄ గ రీ ॥
అ నా ద్య వి ద్యా త మో భా స్క రం । ఆ చా ర్య శే । ఖ రం సుం ద రం ॥
స మా ∖ గా గ రీ రి సా స ని ని సా । స రి స ని నీ ధ ప మ । ∖ గ రి ⁄ ప మ గ రి స ॥
మ నో వా గ గో చరం శ శి ధ రం । మౌ ని నం మ ద న । హారం శం క రం ॥

శ్రీ దక్షిణామూర్తిం

*గమనిక :* శ్రీ దక్షిణామూర్తి స్వామిపై నున్న ఈ ఫేనద్యుతి రాగకీర్తనము మిక్కిలి రంజన నిచ్చుటయుఁగాక, నేర్చినవారలకు పరమజ్ఞానమును కలిగించును.

## సంచారి - మఠ్య తాళము - సుబ్బరామ దీక్షితులు

మ మ పా ప మ ప ధ ధ ప | మ ప స ని స స ని ని స స | మ ప ధ ప స స ని ని సా |

పా ధ ధ ప ని స స ని స | ప స ని ని సా ధ ప ని స | ప స ని స ప ధ ప మ గ రి |

ధ ప మ ప గ గ రి రి సా | రి రి మ మ పా మ ప ధ ప | మ ప ని ని స స ప ని స స—

ప ధ ప స ని ధ ప ధ ప మ | ప స ధ ధ ప మ గ గా రి | ప మ గ గ రి రి స ని సా |

ని ని సా ని స గ గ రి స | ధ స ని స గ గ రి గ రి స | ధ ధ ధ స ని స ధ ధ ధ స |

ని ని స స గ గ రి గ గ రి | గ గ రి రి స రి గ ని ని స | స ధ ప ధ ప మ ధ ప ప మ |

పా ధ ధ ప మ ప ధ ప మ | ని ని సా ని స స మ గ రి | పా మ గ గ రి స మ గ రి |

ని స / గ రి స మ \ గా రి రి | స / గ రి స ని స గ రి సా | రి ప మ ప ధ ప ని ని సా |

ప ధ ప స ని ని ని ని సా | పా ధ ప సా ని ని సా | ప ధ ప స ని స / గ రి సా |

ని రి సా ని స ప ధ పా | గ గ రి రి స / రి స ని సా | ధ ధ ప ని ని స ధ ధ ప స |

ధ ధ స ని ద ధ ప ధ ప మ | పా ప ని ని స ప ని ని స | పా ని సా ప స ని స |

ప ధ స స స ని గ ధ ప మ | ప స స స ద గ స మ ప | స ని ధ ధ ప ప మ ప గ రి |

ప మ \ గా రి రి స రి సా | ని ని సా ధ ధ ని ని సా | ప ప పా ని ని సా సా |

పా ధ ధ ప మ ప స ని స | స మ గ గ రి గ గ రి రి స | ధా పా సా ని ని సా |

స ప గ రి / గ స రి రి సా | ధ ప గ స / రి ని సా రి | ధ మ / ప గ రి స / రి ని సా |

ధ ప స ని ప / ధ ప మ గ రి | / గ స / రి స రి మ ప మ పా | సా ని ని సా పా

మ గ | గ రి రి పా ని ని సా | పా / ధా ప \ ని ని సా | ప ని ని స మా గ గ రి స |

గ రి స ని ని సా \ పా ధ | ప \ మా / ప గ గ రి రి సా | సా పా ని ని సా స మ |

గ గ రి / గ గ రి స రి సా | ప / గ రి / గ రి స ని సా | పా / ధ ధ ప
మ గ రి సా | రి మ ప ధ ధ ప ని ని సా | స ని ధ ధ ప మ గ గ రి రి |
స రి స ని సా ; ; |

రెండవ మేళము సంపూర్ణము

## రాగాంగ రాగము 3 : గానసామవరాళి

### లక్షణ శ్లోకము

వెంకటమఖి : సంపూర్ణా సగ్రహాసామవరాళీ సార్వకాలికా.

మూర్ఛన :– { ఆరోహణము : స ♭ రి మ ప ♭ ధ ని సా,
అవరోహణము : స ని ♭ ధ ప మ ♭♭ గ ♭ రి స.

### లక్షణవివరణము - సుబ్బరామదీక్షితులు

రాగాంగము; సంపూర్ణము; షడ్జగ్రహము; ఆరోహణమందు గాంధారవర్జ్యము. ఎల్లప్పుడు పాడఁదగును.

*గమనిక :* భరతమతంగాది మహర్షులును శార్ఙ్గదేవ రామామాత్య వెంకటమఖి ప్రభృతులును, వారి వారి గ్రంథమందు ఈ సామవరాళి రాగము సామవేదమునఁ బుట్టినదని వచియించియున్నారు. అదియుఁగాక డెబ్బది రెండు మేళములకు పూర్వమందుండిన పంతొమ్మిది మేళములలో, నీ సామవరాళి రెండవ మేళముగా నున్నది.

### లక్ష్యగీతము - మఠ్యతాళము - వెంకటమఖి

ధ్రువము:– మ మ పా ధ ప ధ ని సా | మ గ రి గ స రి స ని సా |
ర ణ వి ద్ధ అ సు రు రే | గ జ వ ర ద అ య కు రే

రీ స నిధ ప నిధపమ | పధనిసగ రిస నిధప |
మాయఅమ యపరంమ | పఅవనము ఉరుతిరెఎ |
సనిధపమప మగరిస |
ధఅరఅధర దఅఅమ |

అంతరి :- పా ; ధధపమ పధ | పధనిసధనిసరిసరి |
నుంనఅసుర గోఒ | పఅలకపఅలకశుభ |
మగరిగ సరిసనిసా |
ద అయక నుతచరితా |

జావడ :- మా మా గగ రీ సా | గరినిసా సరి మమప | ప ధ ప ని ధ ధ
గో పీ జనలో లా | కఅళియాఅహిభ ంగ | గో ఒకుల వి ఇ
మ ప పా | ధ పా ధ మపమగరిస | మా గా రి స ని ధ ధ ప |
ఖ్యఅ తా | వి మత్త అ రి సు ఉ ద న | ఐ యా ఇయ ఇయ ఇయ |
సనిధ పమప మ గ రి స | రిమమపమపధపమప | ధసనరిస
అం వో ఒ ఇయ ఇ యఇయ | రఅగ అం గగఅఅన | సఅమవర
రిపమగరి | మమపపధధస సా | ధపమపమగరిపమగ |
అఅ అఅళి | ఉప ంగపుఉర్వవరా | అళిభిఇంనపంచమ |
రిస నిస ధపమగరిస||
ఇం దుగోఒఒచఅఅక్ర||
పా ; ధధ పమ పధ | పధనిసధనిసరి సరి |
నుం నఅసురగోఒ | పఅలకపఅ లకశుభ |
మగరి గసరిసనిసా||
ద అయకనుతచరితా||

## తానము _ వెంకటమఖి

సససా రి | ససరిసరి | సససనిస | నినిఫ | నినిస | ఫసనిఫ |
నినిసనిస | ధధఫనిధధ | ఫథఫమ | ఫసనినిస | మమఫ

